# తొలిపలుకు



చుక్కాని (జేబట్టి నిర్వహించుట కష్టము. )
ఐనను తుపాను చెలరేగు సూచనల నెఱింగి, నావను భద్ర
పఱచుట ముఖ్యావసరము. చుక్కాని నడుపుటకు సామ
ర్థ్యమున్నవారే అర్హులు! నడుపుశక్తి ప్రధానలక్షణమై
నను, తీరమును జేర్చు ప్రయత్నమునందు పాల్గొనుటకు
సాధారణ మానవులకైనను హక్కు కలదు. ఒకరిచే కాని
పని, నలుగురు బాధ్యత వహించి పూర్తి చేయుట లోక సహ
జము. ఆ నలుగురిలో నేనొకడనని చెప్పుకొనుట కధి
కారమున్నను, లేకున్నను, స్వీయబాధ్యతల నెఱిఁగి,
తోచినసలహా నొసఁగ సాహసించితిని. నాయభిప్రాయ
ములతో పూర్తిగ నేకీభవించుట జరుగునని ఆశాసౌధ
మును నిర్మించుకొనలేదు. కనుక వ్యతిరేకభావములు
బయల్పఱుపబడినను మానసికాందోళన మనవసరమే!
పూజ్యులగు మతప్రవక్తలకు నాయీగ్రంథము వినతిపత్రము
గను, తమ్ముంగలతోడి సోదర సోదరీమణులకు సహాయకా
రిగను వినియోగింపబడగలదని ఆశయము.

అప్పుడప్పుడే గృహస్థాశ్రమమునందడుగిడుచున్న
సోదరిని, (15) మజిలీలద్వారా, జీవిత సముద్రమునుదాటి
గమ్యస్థానమును జేరుమార్గమును సూచించుటయే
నాసంకల్పము.

ఈనాకృషి యెంతవఱకు ఫలించినది, 'చుక్కాని'
జేబట్టిన ఇతర సోదరీమణుల పురోగమనమే నిరూపించగ

లదు. వారు నాయాశయముల నవగాహన మొనరించుకొని, వాటి ననుసరించిన పక్షమున ధన్యతనందగలను. అట్లగుట భావిభారతదేశ సౌభాగ్యమునకొక శుభ చిహ్నము. హిందూమత వైలక్షణ్యమున కొక నిదర్శనము. పలువురు 'చుక్కాని' జేబట్టుదరని విశ్వసించుచున్నాను.

'చుక్కాని' నిర్మాణమునకు వలయు ధన మొసగి, దానిని గుప్తముగ నుంచవలెనని, ఆదేశించిన ఉదారవ్యక్తికి నాహృదయపూర్వక కృతజ్ఞత.

ఇందులో రాజకీయ ప్రశక్తియే లేదు. అందులో ప్రవేశమున్నూ లేదు. కేవలము సాంఘిక విషయిక ప్రస్తావనయే దీని స్వరూపలక్షణమని విజ్ఞులు గ్రహించెదరుగాక!

స్తనశల్య పరీక్షకుఁ బూనుకొనిన పక్షపాతి స్వభావులకు చుక్కాని ఎదురు తిరుగునేమో! వెక్కిరించినవారిని లెక్కజేయకుండుట మానవ సహజమేగదా! క్రొత్తదే మున్నది?

సహృదయుల సూచనలు, విమర్శలు శిరసావహింపగలను. నిర్మాణ కార్యక్రమమునకు వారితోడ్పాటు కల్పతరువువంటిది.

నిర్మించి మీచేతులలో నుంచిన యీ నావను 'చుక్కాని' త్రిప్పుచు ఎట్లు నడుపగలరోయని నాసోదర సోదరీమణులను ప్రశ్నించు హక్కును, పునర్నిర్మాణమునకు హక్కును ట్రస్టీగా ప్రత్యేకించుకొనుచున్నాను — సెలవు!

——రచయిత.

# మొదటి మజిలి.



సోదరీ ! యోగ్యశీలా !!

మనమిరువురమే సోదరులము. మనప్రేమ నిశ్చల
మైనది. దానికి హద్దులులేవు. విపరీతార్థ మొసగుటకు వీలు
కానిది. తలిదండ్రులకు, సంతానమునకు పరస్పర ముండవల
సిన గాఢానురాగముకన్నను మన ప్రేమ నిష్కళంకమైన
దనియు, ఒడుకు దుడుకులు లేనిదనియు నానమ్మకము. కార
ణమేమనిన స్త్రీపురుషుల రక్తసమ్మేళనము వలన సంతానో
త్పత్తి యగుచుండును. ఒక పుత్రుండు కాని, పుత్రికగాని,
ఐహిక సౌఖ్యానందము ననుభవించు కోరికతో శరీరైక్యమును
గావించుకొనిన స్త్రీ పురుషుల పరస్పరేకీ కృతశక్తి ఫలమున
జన్మింతురు. నాలోను, నీలోను, మన తల్లితండ్రుల పవిత్ర
రక్తము ప్రవహించు చుండునని ప్రత్యేకముగ జెప్పనక్కర
లేదు. మొదట ఏతల్లి గర్భగోళమునందు నేను సంచరించి
తినో, ఏతల్లి స్తన్యమును గ్రోలితినో, ఆ తల్లి గర్భమునందే
నీవు మెలగినావు. ఆమె స్తన్యమునే నీవుత్రాగినావు.
మన మిరువుర మొక్కతల్లి గర్భమునందే జన్మించినాము.
ఒకే నెత్తురును పంచుకొనినాము. ఒకే కండలోనుండి పుట్టి
నాము. మన యిరువురి సంబంధమవినాభావము. ఎడతెగనిది
పరమపవిత్రమైనది. కనుకనే సోదరీ సోదరులమగు మనప్రేమ
అఖండమైనదని పైనదెలిపితిని. దానిని విభజించుట దుస్సా

ధ్యము. విభాగమును గోరుట తల్లిని రెండుముక్కలుగ నఱికి వేయుటయగును. ముక్కలుచేసినను మనప్రేమ యఖండముగ నిలుచును. వేఱుచేయబడిన భాగముల నొకచోట చేర్చి పరీక్షించిన మొదటనుంచి తుదివఱకు సమానత్వమే గోచరించును గాని భేదభావము స్ఫురించదు. గుణభేదము లేనట్టి పరిస్థితులందు వైపరీత్యమెట్లు సంభావ్యమగును? శీలరక్షణకు గడంగిన భార్యాభర్తల నిష్కళంక ప్రేమ పరిణామముమీఁద నాధారపడఁగలిగిన సంతానమును గుఱించియే నేను మాట్లాడుచుంటిని. విపరీత పరిస్థితులలో ప్రవర్తించిన వారి సంతానము విషయమై మన కనవసరము. ఎప్పటికి మంచికొఱకే అన్వేషింపుము. కాని రంధ్రాన్వేషణకుఁ బాల్పడవద్దు. నీజీవితమునందదొక ప్రధానాశయముగ భావించుకొనుము. దాని వలన నీవు శాంతి, స్నేహితుల గౌరవము, ఆనందము, జూరగొన గలుగుదువు. ఇతరుల తప్పిదములను వెతకుటకు బూనితివో నీకెప్పుడు వారియందు ద్వేషము, క్రోధము కలుగుచుండును. క్రోధ స్వభావుల కాత్మశాంతి లభించకపోవుట ఆశ్చర్యకరముకాదు.

చిట్టీ! నీ పేరెంత మధురమైన దనుకున్నావు! మధురమంటే, పేరు వినినంతనే నోరూరకలదనికాదు. యోగ్యశీలవని మన తల్లిదండ్రుల యభిప్రాయము. యోగ్యమైన శీలము కలదానివి కావలెనని వారి యాశయము. ఎవరికి యోగ్యమని ప్రశ్నించెదవా? నీకు విశాల విశ్వనాటకమును గాంచుభాగ్యము లభింపజేసిన సృష్టికర్తకు, భౌతికదేహము ప్రసాదించిన తల్లి దండ్రులకు, నీతోఁబాటు సగభాగము

రక్తమును బంచుకొనిన అనుజన్ములకు, అగ్నిసాక్షిగా వివాహమాడినభర్తకు, నీకడుపు ఫలించి కలుగబోవు సంతానమునకు, కీర్త్యపకీర్తులను బట్టి మంచి చెడ్డలను విచారించు బాధ్యత-నీకు పనికి రాకపోయినను—వహించు సంఘమునకు, నీయోగ్యత ముఖ్యమని గ్రహించుము.

ప్రతి స్త్రీ పురుషుల శీలముమీదనే సంఘ మాధార పడియుండును. సంఘ మేమిటంటివా? అది మన కంటికి స్ఫుటముగ గోచరించునటువంటి వస్తురూపమున భావించుటకు వీలుకానిది. దాని నిర్మాణము, రూపము, వైశిష్ట్యము, గొప్పతనము, మంచిచెడ్డలు, మానసికదృష్టికి గ్రాహ్యము కాగలవు. ప్రతివారు; స్త్రీ కానిమ్ము, పురుషుడు కానిమ్ము; సంఘగౌరవమును సంపాదించుటకు ప్రయత్నింతురు. సంఘమునందు స్వార్థపరులకు చెల్లుబడి ప్రాప్తించి, వారి సంకుచితాభిప్రాయమునలన తక్కినవారికి నష్టముకలుగు పరిస్థితులు దాపురించినప్పుడు విజ్ఞానులగువారు సంఘరక్షణ మొనరించుటయే సంఘసంస్కారమని కొందరు చెప్పుదురు. సంఘసంస్కరణమంటే ఏమిటో నీకు ముందుముందు తెలుపగలను సంఘమునందు గౌరవమును నిలబెట్టుకొనలేని వ్యక్తికిపరపతి తగ్గిపోవును. పరపతి లేకపోవుట మర్యాదస్థులకు నవరంధ్రోద్బంధన సమానమగును. తోడివారెవరు గౌరవించక పోయినను సరేగాని, చులక నగజూచి నిందింతురు. మర్యాదకొరకు ప్రాకులాడువారిని చులకనగ జూచినజాలు, అదే యావజ్జీవితశిక్ష. వారికి కలుగు మానసికాందోళన చెప్పతరముకానిది. బహిర్గత మొనరింపకపోయినను, వారి హృదయ

మునందది, దివారాత్రిములు బాధించు చుండును. హృదయమున గాఢముగ నాటుకొనిపోయిన విషదంష్ట్రింబోలె, గుండెవరకు పోనిచ్చి కఠినముగ మెలిచివేయబడిన గాలమువలె, మెత్తని కండరములందు దూఱి యెంత ప్రయత్నించినను రాని నాగజెముడు ముల్లుకొనవలె, ఎప్పటికి సెలవేయుచునే యుండును. గాయముమీఁద ఉప్పద్దిన విధముగా, ఇతరుల సూటీపోటీలు మఱింత బాధించును. ఇన్ని అవస్థలు పడుచున్నను, సంఘ బహిష్కృతులగువారు సంఘమును తిరస్కరించి స్వతంత్ర జీవనమును గడుపుకొనగలమని చెప్పుచుందురు వీలుకానప్పుడు, తిరస్కారభావమూనుట మానవుని స్వభావము. అట్టి భావము కలిగినప్పటికి వానికి మనశ్శాంతి యుండదు. తనకుతానే పొగడుకొనుచు ఏకాకియై, సమయము వచ్చినప్పుడు సాయపడువారలకు దూరస్థుడై, ఎన్నాళ్లు కాలము వెళ్లబుచ్చగలడు? పరదేశాగమన మొనర్చినను, తాత్కాలికోపశమన మేగాని, మొదట నివసించిన గ్రామమునందెట్లు ప్రవర్తించినందువలన దుష్కీర్తి ప్రాప్తించి నిలువలేక వేఱొచోటికి వెళ్లవలసి వచ్చినదో, అదే విధముగా మరొకచోట కలిగితీరును. సంఘ నియమములంతటను సమానమే. వాటికనుగుణ్యముగ నడచుకొనలేనివారి కెచ్చోటనైనను మనశ్శాంతి లభింపదు. కలిగినమార్పు ప్రదేశములందే కాని హృదయమునందు కాదు. హృదయ పరివర్తనముకలిగినవానికి స్వగ్రామ పరిత్యాగమున కవసరమే యుండదు. హృదయ పరివర్తనమంటే వినదలచుకొనినవా? మంచిది. హృదయమంటే ఏమిటో మొదట తెలిసికొనుము. ప్రతిమా

నవునికి హృదయముండుట సృష్టి సిద్ధము. మళ్లీ హృదయమే యాకృతిలో గోచరమగునో వివరించుమని ప్రశ్నించినావు. నీవు వేసిన ప్రశ్నలు సక్రమమైనవే—కాని వాటిని నీవనుకొనినంత తేలికగ వివరించి వర్ణించుట సాధ్యముకాదు. రాగ ద్వేషములు దేనివలన ఉద్భవించి, వృద్ధిగాంచి, ఆచరణరూపమున బహిర్గత మొనర్పబడునో అట్టి యంతరవయవమునే మనము హృదయమని నిర్వచించవచ్చును. ఈయంతర వయవము ప్రతి వ్యక్తికి భగవానుడు ప్రసాదించును. అది బాహ్య దృష్టికి గనబడదు. హృదయమునందు రేకెత్తు అభిప్రాయములు రెండురకములు; సదభిప్రాయములు దురభిప్రాయములు. ఈద్వివిధ గుణభేదమును బట్టి యే అభిప్రాయములు మంచివిగాను, చెడ్డవిగాను మనము నిర్ణయించవచ్చును. ఎందుకనిన సద్గుణములవలననే సదభిప్రాయములు కలుగును; దుర్గుణములవలన దురభిప్రాయములు. అంతశ్శక్తికి గుణభేదములేదని చెప్పగా వినుచుండెదము. నిజమే! అంతశ్శక్తి అఖండమైనది. దాని ఏకత్వమును గ్రహించు సామర్థ్యము మనకు భగవత్ప్రసాదితము. ఆసామర్థ్యము ప్రతివారియందుండినప్పటికి, ఏకొలదిమంది మాత్రమే సంపూర్ణముగ గ్రహించి, నిత్యజీవితము నందుపయోగించుకొనెదరు. అట్టివారిని విజ్ఞానులని సామాన్య ప్రజలాదరించి గౌరవించెదరు. విజ్ఞానులకు సజ్జనత్వమబ్బును. వారిలో తాత్కాలిక విషాదపరిస్థితుల వలన గలుగవీలగు దుర్గుణ ప్రకోపము నడచికొనగలరు. విజ్ఞానమునుండి యే న్యాయాన్యాయ విచక్షణాశక్తి కలుగును.

న్యాయమేది, అన్యాయమేది, అని గూఢముగ, దీర్ఘముగ, విచక్షణసలిపి న్యాయమునే గ్రహించుట కుపకరించు మార్గ ముల నాచరణలో పెట్టగలిగిన శక్తి విచక్షణ శక్తి; అట్టి శక్తి కలిగిన వారికి ఆత్మయననేమియో యెఱుకపడును. ఈ విచక్షణ భాగ్యములేనివారికి సక్రమాక్రమమార్గ నిర్ణయము గోచరింపక, దుర్జనత్వమలవడును. ఐతే, గుణ తారతమ్యమువలన కలుగు నష్టములేమి? వాటిమీద జీవితమెంతవరకాధారపడియుండును? ప్రతివానికి, స్త్రీపురుష భేదము లేకుండ, సద్గుణ దుర్గుణ జాలమెఱుఁగుట ముఖ్య కర్తవ్యము. ఒకని హృదయము వెన్నవంటిదని, మరియొ కనిది పాషాణ సదృశమని మనము నిత్యము వినుచుందుము. సహజ మృదు హృదయునికి సదభిప్రాయములే కలుగును. కఠిన హృదయునికి దురభిప్రాయములు కలుగుచుండును. మన హృదయములందే పనికి బూనికొనినను కొంత సంఘ ర్షణ కలుగుచుండును. ఈ సంఘర్షణ సద్గుణ దుర్గుణము లక్షు మధ్య చెలరేగును. తేలికగ చెప్పిన దానిని ఆలోచన యనవచ్చును. తానొక కార్యముఁ జేయఁదలబెట్టిన ప్రతి మనిషి, ముందుగా కష్టనష్టముల నాలోచించును. తలపె ట్టినది మంచిపనియా, లేక చెడ్డపనియా, యని తర్కించు కొనును. వితర్కమే సంఘర్షణ. సంఘర్షణ జరుగున ప్పుడు, మంచిచెడ్డలను నిర్ణయించు సమయమునందు కడక వలంబించు మార్గమును నిర్ణయించుకొను విధానమతని విజ్ఞానముమీద, భూతదయమీద, స్వార్థత్యాగముమీద, నాధారపడియుండును. ఉదాహరణమొకటి చెప్పెదను. నీ

కనిష్టమైనపనిఁజేసి దూషించిన వ్యక్తి విషయమై నీవెట్లు ప్రవర్తించెదవు? తిరిగి వాని కపకారము చేయవలెననియే సంకల్పించుకొనెదవు. ఎవ్వరైన క్షమించవలసినదని మందలించినను వినక నీకుఁ గల కసిని తీర్చుకొనఁ బ్రయత్నించెదవు. వానినేవిధముగ పరాభవించవలెనా యని రాత్రింబవళ్లు దీర్ఘముగ నాలోచించుకొనెదవు. ఆలోచించు సమయమునందు చేసినవాని తప్పును క్షమించుట బాగుండదా? యను తలఁపొకటి కలుగును. కాని నీకు వానిపైగల ఈర్ష్య వలన క్షమించిన బాగుండగలదనెడి తలఁపు మరపునకు వచ్చును. ఇతరుల తప్పిదములను క్షమించు శక్తి నీ కలవడినచో, వానికేవిధమైన ప్రత్యపకారమును సలుపవు. క్షమాగుణము సజ్జనులకడగల రత్నాలరాశి యందొకటి. నీలో దుష్టశక్తియే తీవ్రముగఁ జెలరేఁగినప్పుడు సద్గుణజాలమని నిర్వచింపఁబడిన సత్కార్యములను నెరవేర్చుకొనుటకు మనసొప్పదు. చివరకు నీవపకారమునే చేయఁ బ్రయత్నించెదవు.

అంతశ్శక్తి అఖండమైనదని నీకుచెప్పియుంటిని. రెండు ముక్కలుగ ఖండించి ప్రత్యేకముగవిడదీయుటకు వీలుకానిది కదా! అఖండమనిపించుకొనును. సచ్ఛక్తి, దుశ్శక్తి — ఇవి రెండు అంతశ్శక్తి విభాగములని యనుకొనెదముగాక! ఈ ద్వివిధ శక్తులు నిరంతరము కలిసియే యుండును. విచక్షణ జ్ఞానమెఱిఁగిన వానికి రెండు గోచరమగును. అతఁడొసర్చు ప్రతికార్యమునకు ముందీ రెండింటిమధ్య ఘర్షణ జరుగును. నైజస్వభావమునుబట్టి దుశ్శక్తికో, సచ్ఛక్తికో పైచేయి లభించును. ఒకటి విజృంభించినపుడు రెండవది మరుగు

పడును. అంతేకాని విడివిడిగ మారిపోవు. సలుపఁబడు నిరంతరత్యాగమునలనగాని,దృష్టియందుంచుకొనిన మహత్తరాశయముల వలనగాని, హృదయమునందు పరివర్తనము కలుగుట సహజము. హృదయ పరివర్తనమనిన నేమి? దుష్ప్రవర్తనముగల వాఁడు, సత్ప్రవర్తన మలవఱచుకొనినప్పుడుకాని, అంతవఱకు యోగ్యుఁడనిపించు కొనినవాఁడు దుర్మార్గమునకుఁ బాల్పడినప్పుడుకాని నడతయందు మార్పు కలిగెనని వినెదము. నడత సర్వసాధారణముగ హృదయ ప్రవృత్తినిఁబట్టి నిర్ణయింపఁబడును. సక్రమప్రవర్తన కల వారినే సంఘము గౌరవించునని ప్రత్యేకముగ జెప్పనక్కఱ లేదు. సోదరీ! నీవు నీనడత యందత్యంత జాగరూకతతో మెలఁగవలసి యుండును. చెడునడత నలవఱచుకొనుట కెంత సేపోపట్టదు. కాని సచ్ఛీలవనిపించుకొనుటకు మాత్ర మేలాటి భంగముకలుగకుండ జీవిత పర్యంతము తదేకదీక్షతో ప్రయత్నించవలెను. చక్కని నడత కలిగియుండుటకు కొన్ని ప్రత్యేక పవిత్రాశయముల నాదర్శముగ పెట్టుకొనుట ముఖ్యావశ్యకము. ఆ యాశయముల నెప్పుడు దృష్టియందుంచుకొని ప్రవర్తనను దిద్దుకొనుచుండవలెను. పురుషులకన్న స్త్రీలే తమ శీలము విషయమై యెక్కువ జాగ్రత్తవహించ వలసియుండును. కారణమేమనిన సంఘ దృష్టిలో స్త్రీవ్యక్తికి ప్రధాన స్థానమొసఁగఁబడినది.ఆమెయొకపవిత్రమైన దేవత. ఆమెశీలముమీఁదనే, పాతివ్రత్యము మీఁదనే, సంసార గౌరవ మాధాపడి యుండును. తద్వారా సంఘ, గ్రామ, దేశ, జాతిగౌరవమువృద్ధి యగుటగాని,

క్షీణించుటకాని తటస్థపడును. సంతానము యొక్కమంచి చెడ్డలు ప్రిప్రథమమున తల్లిశీలముమీఁద నాధారపడియుం డును. సత్సంతానమును జాతికొసఁగిన సచ్ఛీలవతియగు స్త్రీయందు జాతికెంతయో గౌరవముగలదు. భారతనారీ మణులలో ఆదర్శజీవితములను గడిపిన వారెందఱోకలరు. సీత, సావిత్రి, రుక్మిణి, దమయంతి మొదలగువారు పవిత్ర హిందూధర్మముసుద్ధరించిరి. ప్రపంచమునం దేయితర దేశ మునందుకాని భారత నారీమణులకు సాటివచ్చువారు కనఁ బడరు. నీవా పవిత్రనారీమణుల జాతికి సంబంధించినదానవు. నీకందువలన మహత్తర గౌరవము లభించగలదు. సంపూ ర్ణభక్తి విశ్వాసములతో వారినే యాదర్శ వ్యక్తులుగ దృష్టి యందుంచుకొని శీలరక్షణకుఁ బాటుపడ నీహృదయమా కాంక్షించుటలేదా ? స్త్రీజాతికి సంఘమునందొసఁగఁబడిన ప్రధానస్థానమును దలఁచుకొనినప్పుడుగాని, స్త్రీ పవిత్రి రాలనుమాట వినినప్పుడుకాని, నీహృదయము గర్వముతో పొంగిపోవుటలేదా? నాపాతివ్రత్యమును గాపాడుకొని, సత్సం తానమునుగాంచి, తద్వారా భారతజాతి నుద్ధరించగలనను ప్రబల ధైర్యవిశ్వాసములు నీకుకలుగుటలేదా ? ఆదర్శజీవిత మును గడుపగలనను ధైర్యమునీకులభించుటలేదా ? సోదరీ ! సంఘమునందు ప్రతిసచ్ఛీలవతియగు స్త్రీకేలాటి ప్రధాన స్థానముకలదో గుర్తెఱిఁగి, దానిని వదలకుండుటకు ప్రయ త్నించుము. నీప్రయత్నమునందు విజయముగాంచుటకు నీలోఁగలధైర్యమే, ఆదర్శమే, సచ్ఛక్తియే తోడ్పడగలవు. జాతినిన్నాశీర్వదించును. సదాశయములను సాధించుటకు

నిరంతరకృషి సల్పినవ్యక్తియే చిరంజీవియగునని తెలిసికొనుము. ఆవ్యక్తి మరణించినను, పేరు కలకాలము నిలచును. ఆదర్శజీవితమును గడిపిన నారీమణుల జీవితచరిత్రను మనమిప్పటికిని స్మరించుచునేయున్నాము. వారుకావించిన యసాధారణ ప్రయత్నముల నెఱుఁగుటవలననే మనకు నేఁటికిని కార్యదీక్ష అలవడుచున్నది. భారతదేశ సంఘమునందు, భారతస్త్రీకిగల గౌరవము, ప్రధానస్థానము మఱి ఏదేశ సంఘమునందు లేదనియు, ఆమెసలిపిన సచ్ఛీలరక్షణ ప్రయత్నమువలననే సంఘముయొక్క గౌరవము లభించినదనియు, జాతీయ నాయకులు ఎలుఁగెత్తి చాటుచున్నారు. పాశ్చాత్యఖండవాసులు నిజమని విశ్వసించియున్నారు. కనుక, యోగ్యశీలా! నీవును పూర్వుల యాదర్శమును నిలఁబెట్టుటకుఁ బ్రయత్నింపుము. జీవితమును ధారపోయుము. ప్రతిభారత స్త్రీ యీవిధముగఁ బ్రయత్నించినచో, మనమాతృభూమికి గలుగఁగల గౌరవ మింతింతయని చెప్పవీలుకాదు.

# రెండవ మజిలీ.



అమ్మాయీ! ఇంతవఱకు నీవు కన్యవు. లోకవిధా
నమెఱుంగక చాల అబ్బురముగా పెరిగినదానవు. నిర్విచా
రముగ రోజులను గడిపినావు. నీవెచట దిరిగినను, ఎవ
రితో ఆటలాడుకొనినను తప్పని చూపించినవారులేరు.
నీకు తల్లిదండ్రులు, తోబుట్టువులు, ఆటలాడుకొను స్నేహి
తులు తప్ప పరిచయస్థులెవరులేరు. చిలిపిచేష్టలు చేసిన
ప్పుడు తప్ప, నిన్ను కోపబడినవారులేరు. ఇప్పటివఱకు నీకే
లాటి బాధ్యతలేదు. ఆనందముగ గడిచినవి రోజులు.
కాని నీవు మునుపటివలె ఇష్టమువచ్చినప్పుడెల్ల తిరుగుట
కాని, ఆటలాడుకొనుటగాని కొంతవఱకు తగ్గించుకొనవల
సినది. ఎందుకనిన, నీకు వివాహమైనది. నీకొకనిని
భర్తగ సంఘము నిర్ణయించినది. నేటినుండి అందరికన్న
నెక్కువగ భర్తను గౌరవించుట నేర్చుకొనుము. అతని
ప్రేమను జూరగొనుటకు ప్రయత్నింపుము. అతని కష్టసుఖ
ములందు సగభాగము ననుభవింపుము. అతనితో నిరంత
రము వెలుగునీడలవోలె, పూవిందావియుంబోలె, మెలఁగు
చుండుము. కనుకనే స్త్రీలను 'సహధర్మచారిణి' యని,
'అర్ధాంగి' యని గౌరవముగ బిలుచుచుందురు. ఆవిధ
ముగ బిలిపించుకొనుట కువ్విళ్లూరుటయేగాకుండ, ప్రవర్తిం
చుటకూడ ముఖ్యావసరము. పూర్తిగ పాశ్చాత్య నాగరి
కతకు దాసులైన స్త్రీ పురుషులకు స్వజాతీయ నాగరికత

మోటయినట్లు, పైపేర్లతో బిలచుట, పిలిపించుకొనుట కూడ నాకామోషిగ గన్పడుచుండెను. నీకావిపరీత నాగరికతయే వలదు. కావలెనని నీవు కోరవనికూడ నావిశ్వాసము. జాతీయనాగరికతకు, పాశ్చాత్య నాగరికతకుఁగల తారతమ్యమునుతరువాత తెలిపెదను. సహధర్మచారిణియను పదమునందెంతో గూఢార్థముకలదు. సమానధర్మముతోనడచు స్త్రీని 'సహధర్మచారిణి' యని భావించెదరు. పరిణయమాడిన పురుషుడు కావించుప్రతి ధర్మమునందు సగభాగమననుభవించు హక్కు స్త్రీకికలదని తాత్పర్యము. గృహస్థధర్మనిర్వాహణమునందు పురుషునికెంత బాధ్యతకలదో, స్త్రీకికూడనంత బాధ్యతకలదని మన పూర్వులు నిర్ణయించిరి. గృహస్థధర్మములేదో గృహస్థాశ్రమ ప్రసంగము వచ్చినప్పుడు విపులీకరించెదను. సహధర్మచారిణియైన స్త్రీయే 'అర్ధాంగి' యను ఖ్యాతికర్హురాలు. భర్తయొనగూర్చు ప్రతికార్యమునందు అర్ధభాగము పంచుకొను స్త్రీకి అతని శరీరమునందు కూడ సమానభాగము నప్పగించిరి పెద్దలు. భార్యాభర్తలు పరస్పర వ్యక్తిత్వము గలవారైనప్పుడు శరీరమందర్ధభాగమెట్లు పంచుకొన వీలగును? గృహస్థాశ్రమ ధర్మావలంబకులకే పరస్పరాంగ సమ్మేళన కర్హతగలదు. భార్యాభర్తల శరీరము లొకటియైనప్పుడు స్త్రీ పురుషులు పరస్పర దేహధారులుగాక, ఒకేశరీరము కలవారగుదురు. స్త్రీకప్పుడు అర్ధభాగము, పురుషుని కర్ధభాగము, పంచి యివ్వబడినట్లు స్ఫురించును. కనుకనే 'అర్ధాంగి' యని స్త్రీని పిలుచుచుందురు. అట్టి ఏకత్వమునకు అర్హురాలినే 'అర్ధాంగి' యని పిలిచెదరుకాని తదితర స్త్రీని అట్లు పిలువరు. ఇవేకాక

యింకను చాల అన్వర్థనామములు స్త్రీలకు కలవు. 'ప్రేయసి', 'మనోహారిణి', 'గృహిణి', 'గృహాలక్ష్మి' మొదలగునవి. ప్రత్యేకముగ ప్రతిమాటయందు విశిష్టార్థము గోచరించుచుండును.

హూణవిద్యావ్యామోహితులగు నేటి మన యువతీయువతులకీ శిష్టార్థము స్ఫురించనందున అగౌరవమును సూచించు మాటలని గర్హింతురు. భావి భారత భాగ్యవిధాతయగు గాంధీ మహాత్ముని పుణ్యమాయని, హూణభాషావ్యామోహము చాలవఱకు తగ్గిపోవుచున్నది. హిందూదేశములోనేయుండి, బి. ఏ., ఎం. ఏ., ప్యాసయిన నవీనయువకులకే ఈలాటివెఱ్ఱి యూహాలు కలిగి, వాటినాచరణలో పెట్టుటకు ప్రయత్నములు జఱుగుచుండగా, ఇంక పాశ్చాత్యదేశములకు బ్రయాణమొనరించి, ఏనాలుగైదేండ్లో అచటనివసించి, శ్వేతముఖులతో కలిసి మెలసి తిరిగి పూర్తిగ వారివలె మాఱిపోయినామను దుర్భ్రమతో స్వదేశమున కరుదెంచిన విద్యార్థికులసంగతి వర్ణనాతీతముగదా! వారికి స్వతంత్ర తల్లిదండ్రులు లేపసికిరారు. ఇంటియందుండుట నామోషి. అక్క చెల్లెండ్రు, అన్నదమ్ములు, పశ్చిమఖండములకు వెడలుటకు ముందు పరిణయ మొనర్పబడిన ఇల్లాలువారికి పశుతుల్యులు. కారణము వారికాంగ్లభాష రాదు కనుక; వారాచరించు హైందవ ధర్మవిధులు పాశ్చాత్య నాగకరితకు భిన్నముగనుండును. కనుక దైవభక్తియున్నచో ఒడలు మంట! శాస్త్రపరిశోధకులే వారిదృష్టిలో సృష్టికర్తలు! వారు కావించిన యుపన్యాసములే వేద

ములు! వారొనర్చిన వ్యాఖ్యానమే ఉపనిషత్సారము! వారు బోధించిన మతమే విశిష్టము! భగవంతుడు లేడను మూలసూత్రముమీద వారు వాదింతురు గనుక, ఈశ్వరు డెచటకలడో చూపించుమడని మన విద్యార్థికులు ప్రశ్నింతురు. గ్రంథసాంగులు కాని వారికొకప్పుడు కాక ఒకప్పుడయిన భగవంతుడొకడు కలడా లేడా యను సంశయము తొలుత గలిగి, తరువాత తాము సంపాదించిన శాస్త్రవిజ్ఞాన మాధారముగగైకొని అదృశ్యుడు కనుక భగవంతుడు లేడను సిద్ధాంతమునకు వచ్చెదరు. వారికి సృష్టియందు గోచరమగు పర్వతములు, నదులు, వృక్షములు, లోహ ములు మొదలగు వస్తుజాలమే భగవత్సాక్షాత్కారమును బ్రసాదించును. విశ్వమునందుగల వస్తుజాలము భగవం తుని చిద్విలాస గరిమను గ్రహించుట కుపకరించునే కాని వాటిసముదాయమే భగవంతుడనిపించుకొనునని మనపూ ర్వులెన్నడును బోధించలేదు. ఐనప్పటికి నవీన విద్యార్థిను లవిజ్ఞానమట్టి యభిప్రాయములనువారికి కలిగించును.

వివాహమైన బాలికలకు బాధ్యతకలదనియు, వారది వఱకు సంచరించినట్లు సంచరించుటకు వీలుండదనియు పైన తెలిపియుంటిని. దానిని విపులీకరించెదను. వివాహమంటే ఏమిటి? ఒకపిల్లవానిని, పిల్లనునలుగురియెదుట శుభము హూర్తమునందు, మంగళవాద్యములు చెలరేగుచుండ, వంద లాదిఖర్చులతో, ఏకమొనర్చుటయనియా? లేక ఇంకేమైన విశిష్టార్థముకలదా? నిజమే బాహ్యాడంబరమునకు వివాహ మైదురోజులు జరుపవచ్చును. స్థితినిబట్టి అపరిమితముగ

వ్యయముఁ జేయనచ్చును. బ్యాండు, సన్నాయి మొదలగు మంగళవాయిద్యముల నేర్పరుపనచ్చును. వివాహమంటే నేమిటంతేనా? కాదు. వివాహితులగు స్త్రీపురుషులాతరుణమునుంచి తమజీవితములందొక నూత్నాధ్యాయమును దెఱతురు. వేరువేరు వ్యక్తులైనప్పటికి వారైకమత్యముతో జీవితమును గడుపుటకు నిరంతరము ప్రయత్నింతురు. వారి సంబంధము శాశ్వతము. ఒకరినొకరు విశ్వసించుకొని, సమానబాధ్యతతో గృహస్థధర్మములను నిర్వహించుకొందురు. భార్యమీఁదభర్తకు, భార్యకుభర్తమీఁద ప్రేమానురాగము లభివృద్ధి జెందుచుండును. జీవించినంతవఱకేగాక, దంపతులలో నెవరుమరణించినను వారియాత్మశాంతికై, ముక్తికై సజీవులైయున్నవారు శ్రాద్ధములనుపెట్టుచుందురు. అట్టిపరిస్థితులలో జీవించియున్న భార్యాభర్తల సంబంధము, బాధ్యత, పరస్పరానురాగము, చెప్పనక్కఱలేదు. ఈపరస్పరానురాగ మెక్కడినుండివచ్చెను? వివాహమగునంతవఱకొకరిముఖము లొకరెఱుఁగకపోయినను, తదనంతరమీ సంబంధమెట్లుకుదురును? దీనిరహస్యము హిందూసంఘాచార నియమములందిమిడియున్నది. అగ్నిసాక్షిగవివాహ మొనర్పబడిన యువతీయువకులు, శీలభంగము మొదలైన క్షమించుటకు వీలుకాని దుర్మార్గపు పనులుజరిగినప్పుడుతప్ప, వేఱగుట మనసంఘదృష్టిలో మహాదోషము. పరిత్యజింపఁబడిన యువతికి జీవితాంతము పోషణజరుపుభారమామె భర్తపైనుండును. దానిని తప్పించుకొనుటకు వీలులేదు. భార్యాభర్త లిరువురు ప్రేమమయజీవితమును గడు

పుట చాలఅరుదు అనుమాట నేటికి నిజమని యొప్పుకొనక తప్పదు. ఇరువురి మనస్తత్వములు, సాంప్రదాయము, వారివారి వంశమర్యాదనుబట్టి, తల్లిదండ్రులొసగు శిక్షణను బట్టి నిర్ణయింపవచ్చును. కనుకనే వివాహమునకు ముందు యువతీయువకులు నిర్భయముగ గలిసికొని ప్రణయప్రసంగమునకు దిగుటకు వీలుండదు. వారికి పెండ్లిజేయు పెద్దలు పరస్పర మాలోచించుకొని, ఏకీభవించి పెండ్లిముహూర్తము నిర్ణయింతురు. ఇరుపక్షము లెదుటివారి వంశమర్యాద నడవడి, వ్యక్తిగౌరవము, మొదలగు విషయములెన్నియో పరస్పరముగగాని, పరోక్షమునగాని, విచారించుకొనెదరు. తృప్తికరముగ నుండిననే ముహూర్తనిశ్చయమునకు గడంగెదరు. ఇదంతయు వారు తమబిడ్డల క్షేమలాభములకొఱకే చేసెదరు. తమకుకాబోవు అల్లుని, లేకకోడలి, ప్రవర్తన, సహజస్వభావము, విద్య, చక్కదనము మున్నగు ప్రధాన విషయములను చాలజాగ్రత్తగ పరిశీలింతురు. వివాహ సమయమునందే భార్యాభర్తలతో భావిసూచనలను బోధించు కొన్నిపనులను చేయింతురు. వాటినగ్నిసాక్షిగ నొనరించుట యందెంతయో గూఢార్థముకలదు. కొంగుకు కొంగుకు ముడివెట్టి అగ్నిహోత్రముచుట్టు ముమ్మారు ప్రదక్షిణము చేయించుట, పూర్ణకలశమునందు చిన్నబంగారువస్తువును వేసి ఇరువురి నొకేపర్యాయము చిక్కించుకొను ప్రయత్నముచేయవలసినదిగా చెప్పుట, అన్నమువండి అగ్నిహోత్రమునందాహుతులు వేయించుట మున్నగు సంగతులు సాధారణముగనే కనిపించును. కాని ప్రతియొక్క

పనియందు, వివాహమంటపమున గూర్చుండిన వ్యక్తులిక ముందీరీతి యేకమై, సంపూర్ణ బాధ్యులై గృహధర్మములను నెరవేర్చుట తప్పనిసరి యనుభావము స్ఫురించుచుండును. ఈనాటినుండి నేనితర స్త్రీని సోదరభావముతో జూచుచు సక్రమ శీలుడనై నిన్ను విడనాడనని యువకునితోను, జీవితాంతము నీతోనేయుండి, గృహకృత్యములందు జేదోడు వాదోడుగా బ్రవర్తించి, కష్టసుఖములందు సమాన భాగమునుగొని, ధర్మజీవితమును గడిపెదనని యువతితోను చెప్పింతురు. పంచభూతములలో నొకటియగు అగ్నిసమక్షమున బ్రమాణము గావించుటయందలి రహస్యమేమనిన, ధర్మబద్ధ జీవితమును నడుపుట భారతీయులకు ప్రాణముతో సమానము గనుక అగ్నిసాక్షిగ గైకొనిన ప్రమాణమును వారెట్టి కష్టములు దాపురించినను భంగపఱుపరను ప్రబల విశ్వాసమే. ఈమె నాభార్యయని సంఘమునకు జాటు ఉద్దేశ్యముతో, వివాహ సమయమునందు పురుషుడు భార్య మెడయందు మంగళసూత్రమును కట్టును. మంగళసూత్రమే వారి జీవితముల నొకటిగ ముడివెట్టు దాంపత్య ధర్మ సూత్రము. మంగళసూత్ర ప్రభావమువలననే మనపూర్వ నారీమణులు వర్ణించుటకలవిగాని మహాత్కార్యములను నెరవేర్చిరి. మంగళ–| సూత్రము=మంగళసూత్రము అంటే శుభప్రదమైన సూత్రము. ఎవరికి శుభప్రదము? స్త్రీవ్యక్తికి. మెడలో మంగళసూత్రము ఉన్నంతవఱకు స్త్రీపుణ్యస్త్రీ. తద్విసర్జనానంతరము భర్తనుగోల్పోయిన వితంతువు. కనుక నే స్త్రీకి భర్తయే ప్రాణము.

సోదరీ ! ఈ మంగళసూత్రము నేఁటి విపరీత సంఘసంస్కారుల విమర్శనకు గురియైనది. వారు దానిని విషవల్లికయని, కంఠమున కురిపోయఁబడిన ఉచ్చుత్రాడని, యింకేమో విమర్శించుచున్నారు. అసలు ఆదర్శములే మంటగలిసిపోయినప్పుడు, ధర్మసూత్రములే ప్రాత నులకత్రాడు మాదిరి తెగిపోవుచున్నప్పుడు, మంగళసూత్రము వారిదృష్టిలో శాశ్వతముగ నిలుచునట్లు ఏవిధముగ గన్పడును ? కాని, ప్రతి భారతస్త్రీ మంగళసూత్రధారణము నసహ్యించుకొనదు. నిరాకరింపదు. ఇది ముమ్మాటికి నిజము.

స్త్రీ మరణించిన తరువాత పురుషునికి పునర్వివాహమునకు సంఘమనుజ్ఞ నొసఁగినది. అందువలన నతఁడెన్ని వివాహములైనను జేసికొనవచ్చును. తొలుత జేపట్టిన భార్య సజీవయైయున్నప్పటికిని, అతనికసహ్యము కలిగినచో మఱొక యువతినిఁ బెండ్లాడవచ్చునట ! కాని స్త్రీలకట్టి యర్హతలేదు. ఇది ఏకారణమున నియమింపఁబడినదో కాని పక్షపాత దృష్టికలదు. స్త్రీ పురుషులకు గృహకృత్య నిర్వహణమునందు సమాన బాధ్యత కలిగినప్పుడు, ఇరువురు జీవితాంత మొకేమాటమీఁద కష్టసుఖములనుభవింపవలసివచ్చినప్పుడు, సంతానోత్పత్తికి, రక్షణకు, శిక్షణకు, ఇరువురు సమాన బాధ్యులైనప్పుడు, పురుషునికి పునర్వివాహయోగ్యత, స్త్రీకి తన్నిరాకరణవిధించుట అసమంజసముగ స్ఫురించును. భార్యను గోల్పోయిన పురుషుడు కూడ జీవితాంతము, వైధవ్యము అనుభవించిన స్త్రీవలె, భగవదారాధనా తత్పరుఁడై కాలమును వెళ్లబుచ్చునట్లు

నియమించుట భావ్యము. స్త్రీలకు పునర్వివాహములు నేడు జఱుగుచుండుట కీపక్షపాతమే ముఖ్యకారణము కాదా! శరీరసౌఖ్యము ననుభవించుటకు స్త్రీ పురుషు లిఱువురికి హక్కు గలిగినప్పుడు, పురుషునికెంత కామముండునో, స్త్రీకి కూడ నంతేయుండుట విపరీతము కాజాలదు. కామోద్రేకము నణచుకొనుటకు స్త్రీ పురుషు లిరువురు ప్రయత్నించవలెను. కామోద్రేకమునకు స్త్రీ పురుష తారతమ్యము లేదేమో! గృహస్థాశ్రమ ధర్మమనుసరించి న్యాయబద్ధముగ, సంఘానుమతి ప్రకారము, సంభోగ మొనరించు స్త్రీ పురుషులలో నొకరు మరణించిన తర్వాత నింకొకరికి ఆ అధికారమును రద్దుపఱచుటవలన కుటుంబ క్షేమము చెక్కు చెదరకుండును. అటులగాక, పురుషులకు మాత్రమే అధికారము నొసఁగి, స్త్రీలకొసఁగనిచో, అల్లకల్లోలము జఱుగుటకు వీలుండును. యౌవనవతియగు స్త్రీకి వైధవ్యము సంభవించినచో, ఆమెలో నుండు కామోద్రేకము గర్హనీయమగు నడతకు ప్రోత్సహించును. శీలరక్షణకు గడంగుట ఉత్తమాశయములు లేనివారికి సాధ్యపడదు. పురుషజాతిలో సంభవము కానట్లు, స్త్రీజాతిలోగూడ సరళ జీవితమును యౌవనమందు గడపుట సుఖస్వప్నమువంటిది. పురుషుల కర్త్రృత కలిగించి, స్త్రీలకు పునర్వివాహములు చేసికొనగూడదని నిర్బంధించుటవలన వారిలో అసంతృప్తి కలుగుట విచిత్రముకాదు. స్త్రీ పురుషురక్త సమ్మేళనమువలననే సంతానోత్పత్తి, యవ్వన కామోద్రేక పరిహారము ప్రాప్తించునప్పుడు, స్త్రీ పురుషుల తారతమ్యదృష్టి పునర్వి

వివాహపరిష్కార నిర్ణయమునందుపయోగించుట సంఘాభి
వృద్ధి కేమాత్రము లాభకరముకాదు. పైపెచ్చు అంతఃకల
హములకు దారిదీయును. వైధవ్యానంతరము స్త్రీలకే
నియమములు విధింపబడినవో, పురుషులకుకూడ వాటినే
నియమించుట సక్రమవిధానము. అటులగాక వివాహమొన
ర్చుట కనుజ్ఞ నొసంగినచో, భార్యను గోల్పోయిన పురుషు
నికి, భర్తను గోల్పోయిన స్త్రీకి, పరస్పరము సంభవిం
చిన నష్ట పరిహారము కొఱకు, వివాహమొనర్చుటకు సం
ఘమంగీకరించినచో ఈ సమస్య తీరకలదేమో ? అప్పుడు
గాని పురుషులకున్నట్లు, మాకుకూడ పునర్వివాహ యోగ్యత
ఎందుకు లేకపోవలయుననే స్త్రీల యాక్రందనము (సహజము
గనుక) సమసి పోగలదు. సంఘమీవిషయము నెంతత్వ
రలో పరిష్కరించిన నంత మేలు చేకూరలగదు.

సోదరీ! బండిత్రోవదప్పి చాల దూరము పోయినది.

పరిణయమైన తరువాత ఆడపిల్లలకు మునుపున్నంత
స్వేచ్ఛయుండదను విషయమునుగదా మనము విమర్శించు
చుంటిమి. వివాహమైన వెంటనే స్వేచ్ఛకేల భంగము
కలుగ గలదని యానీ సందేహము. నీకిప్పుడు 12 ఏండ్లు.
ఇంకొక ఏడాదిలోపలనే నీవు పుష్పవతివి కాగలవు. అప్పటి
నుంచి నీలో యౌవన మంకురించి దైనందినాభివృద్ధి నందు
చుండును. మన పూర్వుల సిద్ధాంతము ప్రకారము కన్య
లకే వివాహము జరుపవలెనను నియమముకలదు. బాలిక
8 ఏండ్ల వయస్సున నున్నప్పుడు 'కన్య' యని పిలిపించుకొ
నును! "అష్టవర్షా భవేత్కన్యా" అను ప్రమాణము

కలదు!! సాధారణముగ బూర్వాచారములను విధిగఁ బాటించు శ్రోత్రియులు తమ బాలికల కెనిమిదవఏటనే వివాహము గావింతురు. (వీలు ప్రకారము బాలికల వయస్సును తారుమారుచేయుటయందు వీరు మహా సమర్థులు; సాహసులు) కాని, నీకు 12–వ ఏట వివాహమైనది. 8–వ ఏటనే పెండ్లిచేయవలయుననువారి తీర్మానమునకు కారణమేమో? బహుశా కన్యాత్వము భంగము కాకూడదనియు, వివాహానంతరము తల్లిదండ్రులు, వ్యక్తురాలై భర్తృగృహమున కేగునంతవఱకు, తద్విషయమై జాగ్రత్తవహింతురని యునని ఏమో! 8–వ ఏటగాకుండ నాలుగేండ్లయిన తర్వాత నాకు వివాహమైనదిగదా! నాకన్యాత్వమున కేలోటువచ్చినదని ప్రశ్నించెదవేల? మొదటనుంచి నీవు చాల యోగ్యురాలవు. ఆదర్శ జీవితమును గడుప నిశ్చయించుకొనినదానవు. నీకాలస్యముగ వివాహమయినను కన్యాత్వమునకే లోపము రాలేదని వేఱుగ జెప్పవలెనా? వ్యక్తురాలగునంతవఱకు బాలిక వివాహమునకర్హురాలనియే గ్రహింపుము. అష్టవర్ష ప్రాయమునందే వివాహము జరుపవలెనను నిర్బంధము పూర్వులేల కలిగించిరో, వారికాలమునాటి సంఘపరిస్థులను కూలంకషముగ విచారించినగాని, తెలిసికొనలేమేమో? ఇప్పుడా విషయమును తరచుటకు మనకు వ్యవధిలేదు. నీకును 8–వ ఏటనే వివాహమైనచో ఆసంగతిని విపులముగ తెలియబఱచేవాడను. ఇప్పుడది అనవసరము. వివాహానంతరము వ్యక్తురాలుకాని ఆడపిల్ల విచ్చలవిడిగ తిరిగినచో శీలభంగము వాటిల్లునను సందేహమునకాదు నిర్బంధము

విధించినది. సంఘమునందు మీకుగల ప్రాముఖ్యతను రద్దుపఱచవలెనను దురుద్దేశ్యమునగాదు. ఆట పాటల యందు మీకుఁగల అభిలాషను చెడగొట్టవలెననికాదు. అంతవఱకు నిర్విచారముగ, గాలము వెళ్లబుచ్చు మిమ్ము లను బందిఖానలో నుంచవలెననికాదు. అమ్మాయీ! నీవింతవఱకు అమ్మకోపపడి చెప్పిన పనినేతప్ప, కావలెనని నీకై నీవేమైన నింటిపనిచేసితివా? చెప్పుము. గృహకృత్య నిర్వహణ బాధ్యత నీకేమైన తెలియునా? లేదు. భర్త గారింటికి వెళ్లునంతవఱకు జవాబుదారిలేకుండ ఆడుకొన్నచో నీకు గృహకృత్య నిర్వహణ సామర్థ్య మెట్లలవడును? పని పాటలుగాని ఆడపిల్లలత్తవారిండ్లకేగి అనుభవించు కష్టము లను మనము వినుటలేదా? చిన్నతనమునందు వారు కాల మును వృథాబుచ్చినందుకు పెద్దదయిన తరువాత విచారిం చుటలేదా? నీబాల్యమునందే ఆటలాడుకొంటివనియు, ఎంత గారాబముగ పెరిగితివనియు, అత్తగారింటియందు ప్రశ్నిం తురనికొంటివా? అట్లెన్నటికి జరుగదు. నీవెంతవఱకు జాగ్రత్తవహించి శుభ్రముగ నింటిపనులు చేయగలవో అనే విషయమై ముఖ్యముగ పరిశీలింతురు. నీవింకను చిన్నతనము చేష్టలతో కాలము గడిపినచో ముందుభర్త యింటికి వెళ్లినతరువాత చాల కష్టములు పడగలవు. మా దగ్గర గారాబముగ పెరిగినదానివని వారాలోచింపరు. నీ వదినెను మనుమూరుకొనుచుంటిమా? సరిగా పనిచేయన ప్పుడు అమ్మ ఏవిధముగ కోపగించుకొనునో చూచుటలేదా? అట్లనే నీవిషయములోకూడ. ఇప్పటినుంచి నీవు అమ్మతో

బాటు ఇంటిపనులందు శ్రద్ధవహించుము. తెలియని పనులు ఆమెనడిగి నేర్చుకొనుము. నీమీద తల్లికున్న ప్రేమ, అత్త గారికుండదు. అది సహజము. తెలియనప్పుడు కడుపు తీపిచేత అమ్మ నేర్పించునుగాని, అత్తగారటులకాదు. ఈవిధముగ జెప్పినప్పుడత్తగారికి నీమీద ఈర్ష్యగలదనికాని, వేధించవలెననే దురభిప్రాయము కలదనిగాని పొరపాటు పడవద్దు. పుట్టింట నేర్చికొనిన పనులత్తింట రాణించును. కోడలు శ్రద్ధతో ఇంటివ్యవహారములను దిద్దుకొని పోవుచున్నదను నమ్మకముతో నున్నప్పుడు అత్తగారు విశ్రాంతి తీసికొని నీకు మార్గదర్శినియై యుంచును. నీకు వచ్చునంత వఱకు ఆమెయే ఇంటిభారము వహించుచున్నది. కనుక విశ్రాంతి ముఖ్యావసరము. ఈడు గడచిన కొలంది నిస్సత్తువ ఎక్కువగును. విశ్రాంతి జెందవలెనను కోరిక ప్రబలమగును. కనుక ప్రతి ఇల్లాలు తమ కోడలు వచ్చినతరువాత భారమంతయు ఒప్పగించి పింఛను తీస్కొనును. అంతటితో గృహవ్యవహారములందామెకు బాధ్యత వదలిపోవుననియు. సర్వస్వమునకు నీవే పట్టాభిషేకము కట్టుకొనవచ్చుననియుందురూహాపడకుము. వయస్సు చెల్లిన కారణమున నింటిని నీకు ఒప్పగించినదేకాని, ఆమె బ్రతికియున్నంతవరకు గృహమునందు ప్రధానస్థానమామెకే నిలిచియుండును. ఆమెకోరునది విశ్రాంతికాని, సంపూర్ణబాధ్యతనుండి విముక్తి కాదు. నీవు వెళ్లునంతవఱకు, తాను భర్తతో కాపురము చేయుటకు వచ్చిననాటినుంచి అనుభవించిన బాధ్యతను సులభముగ వదలించుకొనునా? ఎన్నటికిని జఱుగదు. ఈమన

స్వత్వమును గ్రహించనందుననే చాల కుటుంబములందు క్రొత్త కోడండ్రు అత్తలతో డీకొని చీకాకులపాలగుచుందురు. ఒక కుటుంబమునందు తండ్రి కొడుకులుండిరనుకొందము. రెక్కలువచ్చి ప్రయోజకుడగునంతవఱకు పిల్లవాని బాధ్యత తండ్రిమీఁద నిలచియుండును. ఆతరువాత కొడుకును తనసహాయమునకు వినియోగించుకొనును. అనుభవజ్ఞుడు కనుక ప్రతి విషయమునందు సలహా నొసంగుట తప్ప మిగతా పనులన్నియు కొడుకుతో చేయించుచుండును. తనను పనికి రానివానిగ జేసి మూలగూరుచుండ బెట్టి సర్వాధికారములను నిరంకుశముగ చెలాయించు అవకాశము కొడుకున కెన్నడు కలిగించడు. ఎదురు తిరుగునను సంశయముకలిగినప్పుడు తానే స్వల్పముగ జోక్యము కలిగించుకొనును. పెత్తనము చేతికి దొఱకినదిగదాయని పెడసరముగ ప్రవర్తించుట కొడుకుతప్పుకాని, సమయమువచ్చినప్పుడు స్వయముగ జోక్యము కలిగించుకొని కొడుకు పెత్తనము నూడఁబెరికిన తండ్రి తప్పుకాదు. తండ్రి చలవవలననే తానింతవఱకు వృద్ధిగాంచకల్గితిననియు, ఇంటి వ్యవహారములందు ప్రవేశము దొఱకినదనియు, కొడుకు నిరంతరము విశ్వాసముతో ప్రవర్తించవలెనేకాని, విపరీతముగ నడువకూడదు. అట్లనే క్రొత్తగ కాపురమునకు వెళ్లిన ఆడపిల్లలవిషయమై కూడ. మూఁడు సుభముకలుగునంతకు, తమకు విశ్రాంతి దొఱకుటకు, అత్తలు కుటుంబ భారమును మీకు ఒప్పగింతురు. దానిని దుర్వినియోగ పఱచినచో తిరిగి తామే నిర్వహించుకొనుచుందురు. ఇంటి పెత్తనము విషయమై అత్తలతో

ఎన్నిటికి జగడము పెట్టుకొనకూడదు. వారికి సహాయ మొనర్చుచుండి, కలసిమెలసియున్నచో కోడళ్ళను బాధించరు. ఇది ముమ్మాటికి సత్యము. ఏండ్లతరబడి సంసారమును దిద్దుకొని వచ్చుచున్న అత్తలకులేని యధికారము, బాధ్యత, నిన్నగాక మొన్న వెళ్ళిన కోడళ్ళకెటనుండి వచ్చును? ఇవి గొంతెమ్మ కోరికలనిపించుకొనును. నీవెన్నడును అత్తగారితో జగడమాడవద్దు. సక్రమముగ ననుగుణ్యాముగ ప్రివర్తించుట నేర్చుకొనుము. అత్తకోడండ్రి తగాదాలు ప్రతిగృహామునందు జరుగుచుండును. ఈతగాదాలకు కారణమేమి? అత్తాకోడండ్రి పరస్పర గృహానిర్వాహణాదికార వాంఛయే. కోడలువచ్చువరకు అత్తయే ఆ ఇంటికి సర్వాధికారిణి. అమె ఆజ్ఞలను పాటించవలసినదే. ఎట్లుతలచిన నట్లుప్రివర్తించగలదు. కాని కోడలు రాగానే, ఆమె సంపూర్ణాధికారము కొంతవరకు తగ్గిపోగలదు. కోడలు తన వ్యక్తిత్వమును నిరూపించుటకు ప్రియత్నించును; ఇంటి కోడలికిగల స్వాతంత్ర్యముతో ప్రివర్తించును.

కొన్ని కుటుంబములందు గృహానిర్వాణాధికార విభజన కోడండ్రు వచ్చుటతోడనే ప్రారంభమగును. మరికొన్నిటియందు మరికొంత ఆలస్యముగ ప్రారంభమగును. తమ అధికారమును, వాంఛలను పట్టుదలతో నెరవేర్చుకొన చూచు అత్తలు, కోడండ్రు కాపురమునకు రాగానే వారిమీద చీటికి మాటికి నేరాదోపణ చేసెదరు. రాగానే లేచినిలువలేదని, ఆలస్యముగ నిద్రలేచినిదన, ఆజ్ఞలను శిరసావహించలేదని, యిలాటివే సాధారణ విషయములందు

సైతము దూరుచుందురు. సాత్విక స్వభావముగల కోడం
డ్రు మొదట సహించినను, కాలక్రమేణ వారు తమలోప
ముల నెరిగి యెదురు తిరుగుచుందురు. ఎదురు తిరుగుటకు
భర్తల విశ్వాసమును జూరగొనుటయేనా కారణము ? గడ
సుదనముగల కోడండ్రు అత్తలమీద కొండెములు (సత్యమై
నను, అసత్యమైనను) భర్తలతో చెప్పి, వారిహృదయము
లను కలవరపర్చి, తల్లికొడుకులు జగడమాడుకొనునప్పుడు
చూచి లోలోన సంతోషించుచుందురు. ఎందుకు ? తన్ను
ణచివేయదలచిన అత్తకు పరాభవమైనదనియు, తనమాటను
భర్తవిశ్వసించినాడనియు. ఏవిధముగ ప్రవర్తించినప్పటికిని,
అత్తపోరు తగ్గక, తమగృహమునందు సంపూర్ణ స్వాతం
త్ర్యములభించనినాడు, లేక లభించు సూచనలు కనపడని
నాడు, భర్తతో రహస్యముగ మాట్లాడి, ఒప్పించి, అత్త
రాకుండ వేరుగా సంసారమును జరిపించును.

నిష్కారణముగ కోడండ్ర నేడ్పించు అత్తలు లేక
పోలేదు. కలిసి మెలిసి గృహకృత్యములను నిర్వహించుకొని
పోవు నేర్పుగాని, ఆలోచనగాని, వారిలో మృగ్యము. అధి
కార వాంఛయే వారి అప్రతిష్ఠకు ప్రబలకారణమగును.

కుటుంబమునందు వితంతువైన ఆడుబిడ్డయున్నచో.
ఇక పరిస్థితులు విషమించును. తల్లిబిడ్డలేకమై క్రొత్తగ
కాపురమునకు వచ్చినపిల్లను నానాబాధలు పెట్టుచుందురు.
కోడలు సహజముగ భర్తను మంచిచేసుకొని, తనతరఫున
అత్త, ఆడుబిడ్డలమీద కఠినముగా మాట్లాడునట్లు ప్రయ
త్నించును.

అత్త కోడండ్ర తగాదాలు రూపుమాపుట కొకటే మార్గముకలదు. కోడలు రాగానే అత్త తెలివిగలదై గృహకృత్యనిర్వహణాధికారమును కొంతవరకు తగ్గించుకొని కోడలి సహకారమును వాంఛించవలెను. ఏవైన చిన్నతనము చేష్టలుకాని, సాధారణమగు తప్పిదములుకానియున్న యెడల వాటినిచూచి చూడనట్లు మెలగవలెను. సమయమునుబట్టి తనకున్నఅనుభవముతో సలహా పూర్వకముగ మందలించవలెను. అంతేకాని గోరంత కొండంతలొనర్ప రాదు. తనకూతురు అత్తగారింటియందెట్లు సౌఖ్యపడవలెనని అపేక్షించునో, అదేవిధముగ తన కోడలి విషయమై తాను ప్రవర్తించవలెను. ఇక కోడలి సంగతి. పెద్దదైన అత్తను గౌరవించుటలోనే తనగౌరవము, మంచితనము గలదని గుర్తించవలెను. ఏకోడలు అత్తగౌరవము నిలుప ప్రయత్నించదో, ఆమె తన గౌరవమును తన కోడలు నిలుపగలదని తలచుటకు వీలులేదు.

విచిత్రమేమనిన, చాలమంది గృహిణులు తమ కోడండ్రు వచ్చినతరువాత పోట్లాటలు లేకుండ సంసార జీవితమును గడుపగలమని ప్రగల్భములు పలికినను, కోడండ్రు రాగానే వారితోడీకొనుటకు పాల్పడుచుందురు. విద్యావతులైన యువతులు సైతము అత్తకోడండ్ర తగాదాలకు గురిగాకుండ ప్రవర్తించకపోవడమెంతో శోచనీయము, ఇకవారి విద్యవలన సంఘమునకు, భర్తలకు కలుగగల లాభమేమి ?

అనుగుణ్యాముగ ప్రవర్తించుటకు సీకు గృహకృత్యములను సక్రమముగ నెరవేర్చు కౌశలమబ్బవలెను.

అది మొదటినుంచి నేర్చుకొనిననేగాని మధ్యలోరాదు. కనుకనే నీవిక నాటలనుచాలించి యింటిపనులెందెక్కువ శ్రద్ధవహించవలసినదని చెప్పుచుంటిని. గృహమునే చక్క దిద్దుకొనలేని యువతివలననే లాభము సంఘమునకుగాని దేశమునకుగాని కలుగగలదు? అమ్మదగ్గర పనులను నేర్చుకొను కుతూహలము కలిగినప్పుడు ఆటలందు నీమనస్సు పని చేయునా? చేయదు. దానితో నీకెంత సహాయము ముందుముందు కలుగగలదో ప్రత్యేకముగ చెప్పనవసరములేదు. తరువాత భర్తకెట్లు ప్రతిపనియందు సహాయముచేయవలెనో, అతనికెట్లు మనోశాంతి గలిగించవలెనో, ఎట్లతని ప్రేమానురాగములను జూరగొనవీలగునో, మొదలగు ముఖ్యవిషయములను నేర్చుకొనుము. ప్రతిపనియందు మననాన్న అమ్మ సలహాతీసికొనుచుండుట నీవుగ్రహించియే యుందువు. ఆమె తోడ్పాటును పొందియే నాన్న గృహకృత్యములను నెరవేర్చుచుండుటకు కారణమేమి? ఆమె యెన్నడును పోట్లాడదు. ప్రతినిముసము చిరునవ్వుతో, అడిగినదానికే తోచిన జవాబిచ్చుచు, భర్త ఆమోదించిన మార్గముననే నడచుచు, అనువర్తనగానుండును. కనుకనే నాన్నకు ఆమె యందంత ప్రేమ, విశ్వాసము. ఎప్పుడు చూచినను మూతిముడుచుకొని, ముక్కు చిట్లించుకొని, ఎదురు జవాబుజెప్పి, చెప్పినదానికి వ్యతిరేకము చేయుచున్నచో, భార్యపైన భర్తకు గౌరవముండునా? గౌరవము లేనప్పుడు ప్రేమ ఎట్లు కలుగును? ప్రేమశూన్యమైనప్పుడు విశ్వాసమెట్లు కుదురును? విశ్వసించని భర్తభార్యతో

సంతోషముగనుండునా ? పురుషులను సుముఖులుగగాని, విముఖులుగగాని మార్చుకొను నేర్పు స్త్రీకుండవలెను. పురుషులు స్త్రీలుచూపించు ప్రేమకు లొంగిపోదురు. వారిని ప్రాణప్రదముగ జూచుకొనెదరు. ప్రేమాస్పదులగు భర్తలను స్వాభిప్రాయములను నెరవేర్చుతోలుబొమ్మలుగ నెన్నటికిని పరికించరాదు. నిశ్చలమగు ప్రేమయే భర్తయెడ జూపించవలెనుగాని, అతనిమీద సవారిచేయుటకు ప్రయత్నింపకూడదు. పురుషుడు తాను స్వతంత్రుడని ఎప్పుడు తలచుకొనుచుండును. ఎందుకంటే కారణము సులభముగ జెప్ప వీలులేదు. పోషకుడయినందున స్వతంత్రుడనని తలచుకొనునేమో ? అతనెట్లు తలచుకొనిననేమి ? మహారాజాధిరాజునని గర్వపడనిమ్ము. స్త్రీ కేమినష్టము ? అంతటి గర్విష్ఠియైనను, తనయందు గౌరవము కలిగి ప్రవర్తించు మార్గము నన్వేషించుకొని, ఆమార్గముననే నడచుచుండుట ముఖ్యము. స్త్రీచూపించు ప్రేమనుబట్టియే పురుషుని ప్రవర్తన మారుచుండును. ఎదురుదిరుగకుండ, అనువర్తనతో మెలగుచు, గృహశాంతికి భంగముకలుగనివ్వకుండ ప్రయత్నించు భార్యను, హృదయముగల ప్రతి పురుషుడు మనసార ప్రేమించును. ప్రాణప్రదముగ భావించి గౌరవించును. స్త్రీ సచ్ఛీలవతియైనను, అనురూపవతియైనను, అనురాగవతియైనను, నీచకార్యములకు గడంగు పురుషులు సంఘమునందున్నమాట వాస్తవము. వారు మానవులు కారు, సంఘప్రనాదములను బెకలించు రాక్షసులు. దేశకల్యాణమునకు విఘాతకులు. వంశమర్యాదలను చెడగొట్టిన

వేరు పురుగులు. వారిసంగతి మనకనవసరము. వారిలో ఏమాత్రము వ్యక్తిత్వముండినను దుర్మార్గ ప్రవర్తనమునకు బాల్పడరు. వారుండినను, మరణించినను సమానమే. గిట్టినచో సంఘ గౌరవము వృద్ధిజెందును. భూభారము కొంతతగ్గును. కుటుంబమునందు శాంతి లభించును. మనము ప్రసంగించునది హృదయముగల, సక్రమ ప్రవర్తనముగల, గృహస్థ ధర్మవిధులను నెరవేర్చ నేర్పుగల, పురుషులను గురించియే. దుర్మార్గులగు పురుషులవలెనే, వ్యభిచారమొనరించి పుట్టింటికి, మెట్టింటికి అపశయమును దెచ్చికులటలను పేరుతో ప్రవర్తించు స్త్రీలవలనగూడ సంఘగౌరవమునకు, దేశక్షేమమునకు, వంశమర్యాదకు హానివాటిల్లును. అట్టికులటలున్నను మరణించినను, సంఘమునకు సంతోషముగాని దుఃఖముకాని కలుగదు. దుర్మార్గులగు పురుషులకన్న, కులటలగు స్త్రీలవలన గలుగునష్టము విపరీతమైనది. కారణము, స్త్రీవలననే మనకు సంఘ గౌరవముగాని, అనాదరణకాని, కలుగుటకు వీలులేదు. ప్రధానస్థాన మొసఁగఁబడిన స్త్రీ యేకులటగ బ్రవర్తించిననిక, సంఘగౌరవమెట్లు నిలువఁగలదు. ? సక్రమ నడతగల స్త్రీ కెంతగౌరవము సంఘమొసఁగునో, కులటనంతకు పదిరెట్లు గర్హించుచుండును. స్త్రీలు కులటలగుటకు కారణములుముందు చెప్పగలను. ధర్మవిరుద్ధముగ నడచు స్త్రీలకు సంఘమునందు తావులేకపోవుట చూచుచున్నాము. పురుషులు స్త్రీలవలె శీలరక్షణ మొనర్చుకొన లేరనునది ఒప్పుకొనవలసిన విషయము. దాచిపెట్టినందున లాభములేదు.

ఏ కొద్దిమంది మహాపురుషులో తప్ప, సర్వసాధార ణముగ పురుషుడు కామమదోన్మత్తుఁడయి పశుప్రవర్తన మునకుఁ గడంగును. వానిలోనున్న బలహీనత సంఘము గ్రహించకపోలేదు. అందువలననే వానియెడ సంఘమున కంత గౌరవముగాని, అసహ్యముగాని లేదు. స్త్రీ జాతి యట్లుకాదు. ఆమె తనకామోద్రేకము నణచుకొనగలదు. పవిత్రాశయములను దృష్టియందుంచుకొని ప్రవర్తించగల దు. ఏలాటి రహస్యమునైన నామె కాపాడగలదు. గౌరవ హానికలుగు పరిస్థితులు దాపురించినప్పుడు మెలకువతో ప్రవ ర్తించి పురుషులకుపదేశము చేయగలదు. వారిదుర్నడతను మార్చి ధర్మపోషణను గావించగలదు. ఇదంత స్త్రీజాతిని పొగడదలంచి చెప్పుటకాదు. ఉన్నవాస్తవమును మఱ చుట సాహసము. సంఘగౌరవమునకుగాని, దానిని భగ్న పఱచుటకుగాని, ప్రతిదేశమునందు స్త్రీజాతియే ముందంజ వేయును. ఏసంఘమునందు స్త్రీకి ప్రధానస్థానముగలదో, ఏజాతిస్త్రీలు శీలరక్షణకు ప్రాణములనైన నొడ్డుటకు సంసిద్ధ ముగ నుందురో, ఆదేశమునందు సాంఘిక పరిస్థితులు చెక్కు చెదరకుండనుండును. అట్టిదేశము దైనందినాభివృద్ధి జెందును. ప్రతిభారతస్త్రీ సంఘమునందు తనకేలాటి ప్రాముఖ్యత కలదో, తనవలన దేశగౌరవ మెంతవఱకభివృద్ధిజెందగలదో దీర్ఘముగ నాలోచించి బాధ్యత వహింపవలెనని మనవి. మొదట దేశము, తరువాత సంఘము, పిదపవంశము, అట్లనే వంశము, సంఘము, దేశము. ఈమూటికెడ తెగని శాశ్వ తసంబంధముకలదు. వీటిలో ఏయొకటి విస్మరింపబడినను

సర్వతోముఖాభివృద్ధి కలుగదు. వంశమర్యాదమీద సంఘగౌరవము, దానిమీద దేశకల్యాణము తప్పనిసరిగ నాధారపడియుండును. ప్రతివ్యక్తియొక్క సహకారములేనిదే సంఘ నియమములను పాటించుట జరుగనట్లు, ప్రతివంశము ధర్మసూత్రములను గట్టుపడనిదే సంఘ గౌరవము చెక్కుచెదర కుండనుండదు. ప్రతిగ్రామ, సంఘగౌరవము వృద్ధికి తేబడనిదే దేశకల్యాణము వాటిల్లదు. దేశకల్యాణమునకు నోచుకొనని, దానికొఱకు దానికొఱకు బాటుబడని, జాతికి తక్కిన దేశములందు పేరుప్రఖ్యాతులు లభింపవు. ఈరహస్యమెఱిఁగినచో ప్రతిభారత స్త్రీ తనగృహమును చక్కదిద్దుకొని, ఆదర్శ జీవితమును గడుపగలదు. గృహమును చక్కదిద్దుకొనుటకు ప్రతి స్త్రీపురుషునితో జీవితమునందు సగభాగమువహించి సహాయ మొసగుటయేగాక, ఇంటిపనులను నెరవేర్చు కౌశలమును సంపాదించవలెను. ఈవిషయము చాల తేలికగనే కన్పడును కాని వాస్తవము నాలోచించిన చాలముఖ్యమని తోచకతప్పదు.

ఉదాహరణ:—ఒకగడియారమును తీసికొని అదెటుల సక్రమముగ పనిచేయుచున్నదో పరిశీలింపుము. దానియందెన్ని యోచిన్న చక్రములుగలవు. వీటికాధారభూతముగ నొకతీగె చుట్టుకొనియుండును. దానినే *Hair-Spring* (హేర్‌స్ప్రింగు) అనిచెప్పుకొనెదము. మనిషికి గుండెఎంతప్రధానమో, గడియారము సరిగనడచుటకీ స్ప్రింగు అంతముఖ్యము. ఇది చెడిపోయినచో గడియారమాగిపోవును. గుండెచెడిపోయినగాని, ఆగిపోయినగాని, మానవుఁడు పూర్ణాయురారోగ్యవంతుఁడై

పనిచేయలేదు. మానవశరీరమునకు గుండెకాక తక్కిన అవయవములెంత అవసరమో, అట్లనేగడియారమునకు గూడ *Hair-Spring* కాక మిగతాచక్రములంత అవసరము. కాలు విరిగినగాని, చెవులు వినబడకపోయినగాని, దృష్టి లోపము కలిగినగాని, మానవుడెట్లు సంపూర్ణారోగ్యము ననుభవింపలేడో, అట్లనే తక్కిన చిన్నచక్రములలో నే యొకటి ఆడకపోయినను గడియారము సరియైన టైమును చూపింపలేదు. త్వరగాకాని, ఆలస్యముగగాని, చూపించుచుండును. కాని సక్రమ గమనముండదు. దృష్టిలోపముండినను, గుండె పనిచేయుచున్నంతవఱకు, మానవుడేరీతి జీవించియుండునో, అదే విధముగ నొక చక్రమువిరిగిపోయినప్పటికి గడియారము పని చేయుచుండును. కాని, లోపములోపమే! పనియందు మాత్రము వెనుకముందు జఱుగుటనిజము.

అదేవిధముగ నొకకుటుంబమునందొక స్త్రీవ్యక్తి కాని, పురుషవ్యక్తికాని దుర్మార్గప్రవర్తనమునకు గడంగిన చో సంఘనిర్మాణమునకు లోటుకలుగగలదు. పూర్తిగరూపుమాయుట జరుగనిమాట వాస్తవము.

సంఘమనిన 'ఏమనియా' నీప్రశ్న, వినుము.



# మూడవ మజిలీ.

సంఘమనిన నేమి? మర్యాదస్థులైన భార్యాభర్తల
సహకారమే సంఘనిర్మాణమునకు పునాదివేయగలదు. వారి
సమూహమే సంఘమని చెప్పవచ్చును. కుటుంబమనినంతనే
మనకేమి స్ఫురించును? స్త్రీ, పురుషుడు, వారికి కలిగిన సం
తానము, పురుషుని తల్లిదండ్రులుకాని, స్త్రీ తల్లిదండ్రులు
కాని, లేక తదితర బంధువర్గముగాని పోషింపబడుచున్నచో
వారు—అందరిని కలిపి మాట్లాడునప్పుడు కుటుంబమనెదము.
వ్యక్తులే కుటుంబమునకు ప్రధానముగాని; ఇల్లువాకిలి,
సామాను మొదలగు నిర్జీవ పదార్థ సమూహముకాదు. సం
ఘమువిషయమై కూడనంతే.

వ్యక్తులొకచోట గుమిగూడి న్యాయాన్యాయములను
విచారించుటయే సంఘాకృతినొందును.

బ్రిటీషువారి ప్రభుత్వమునందు శాసన నిర్మాణసభ
యెట్లో, భారతదేశమునందు ప్రతిగ్రామమునందు సంఘ
మొకటి ఏర్పాటు చేయబడినది. శాసన నిర్మాణసభ
యందు సమర్థులగు వ్యక్తులకు మాత్రమే ప్రవేశార్హత
కలదు. వారిని ప్రజలెన్నుకొనిన మాటవాస్తవమే. వారిచే
ప్రతిపాదింపబడి, అధిక సంఖ్యాకులచే అంగీకరింపబడిన ప్రతి
శాసనమమలునందుంచబడును. శాసననిర్మాణ సభ్యు
లందుగూడ స్వార్థపరులుండుట నిరాకరించవలసిన సంగతి

కాదు. ప్రతిచోట స్వార్థపరులుండుట తప్పదు. స్వార్థపరత్వము వ్యక్తి స్వభావముమీద నాధారపడియుండును, స్వభావభేదముకలుగుట తప్పదు. అది సృష్టి నిర్ణయము. కాని స్వార్థత్యాగులపని, స్వార్థపరులవలన తక్కిన సభ్యులకుగాని, ఎన్నుకొనిన ప్రజలకుగాని, నష్టముకలుగకుండ జూచుటయే. వారినెన్నడును, స్వార్థమును వీడనంతవఱకు, పైకి రానీయకూడదు. ఒకసారి మోసపోయి స్వభావము నెఱుఁగక ఎన్నుకొనిన ప్రజలు మరొకపర్యాయము తమ ఓట్లను అట్టివ్యక్తికి నివ్వరు.

శాసన నిర్మాణ సభాపరిస్థులే సంఘమునకుగూడ కొంతవఱకు వర్తించును. సంఘమునందు స్వార్థపరులు లేరనుట ఎట్లు? ప్రతి స్వార్థపరునికి ప్రవేశము లభించదనుట పొరపాటు. ఐతే, కొందఱు చుట్టునున్న వాతావరణము ననుసరించి స్వార్థమునకు ప్రాకులాడుచుందురు. మొదట నుంచి స్వార్థమునే ఆకాంక్షించువారిని ప్రజలెన్నుకొనరని ప్రత్యేకముగ చెప్పవలెనా? చూచినంతనే అసహ్యించుకొనెదరు. వారివలన తమకు నష్టము కలుగగలదని పైపైదొలగియుందురు. ఏయొక స్వార్థపరుని కారణముననో సంఘమును (శాసన నిర్మాణసభయే యనుకొనుము) దూరుట సాహసము. నీచముకూడ. ప్రతివ్యక్తియొక్క సహకారము లేనిదే సంఘము పనిచేయలేదు. శాసననిర్మాణ సభను గుఱించి పోలికకొఱకు ఉదాహరించితినికాని, దానికన్న మన సంఘమే నూరురెట్లు శ్రేష్టము. అందులో ప్రవేశార్హత లభించుటకు ప్రజలెన్నుకొను నిర్బంధము కలదు, కాని

సంఘమునందటులకాదు. ప్రతిగృహస్థునికి, వివాహితయైన స్త్రీకి దానిలో ప్రవేశించు అధికారముకలదు. వీరిష్టపడిన వచ్చునదికాదు. నిరాకరించినపోవునదిగాదు. ఇష్టానిష్టముల ప్రాబల్యములేదు. ఏయొకవ్యక్తియైనను సంఘములో నాకు పనిలేదనిచెప్పి స్వైరవిహార మొనర్చినప్పటికిని సంఘమూరుకొనదు. ప్రజాక్షేమమునకు భంగము వాటిల్లనంతవరకు పేక్షించునుగాని, తదనంతరము వెంటాడి శిక్షించును. సంఘముమీాద ప్రతివ్యక్తికి అధికారమున్నది. ఇది తప్పదు. ఎందుకనిన సంఘగౌరవము వ్యక్తులపైన నాధారపడియుండును. సత్క్రమప్రవర్తనముగలవారివలన గౌరవము లభించును. దుర్మార్గులవలన నష్టము కలుగును. మంచినేగ్రహించి, చెడ్డతనమును విసర్జించుట మానవ సహజము. ఉన్నట్లుండి, ఒక కుటుంబీకుడు తక్కినవారికి నష్టము కలుగు పనులను సలుపుచున్నాడనుకొనుము. లేక స్త్రీలమానభంగమునకు బాల్పడినాడనుకొనుము. వానిని గౌరవించుట సమంజసమా? శిక్షించుట భావ్యమా? గౌరవించినచో అగ్నికాజ్యముతోడైనట్లు మరింత పెచ్చరిల్లునేగాని చెడు నడత వీడడు. శిక్షించుటవలన సత్క్రమప్రవర్తనకు రాగలడు. ఇంకను మొండిగ ప్రవర్తించినచో, సంఘబహిష్కారము, గ్రామబహిష్కారము, న్యాయాధికారులకు నప్పగించుట, మొదలగు తీవ్రమగు విధానమునసుసరింపక తప్పదు. దుర్మార్గునికి సంఘమునందు గౌరవముండదు. కారణం వానితప్పిదముల నుపేక్షించకుండ శిక్షించుటకు బూనుకొనుటయే. సంఘతిరస్కార మొనర్చిన వ్యక్తికి, మరల

సత్ప్రవర్తన కలవాటుపడిన నేతప్ప, జీవితాంత బాధలననుభ
వింపవలసివచ్చును. నేడు చాలమంది స్త్రీ పురుషులు సం
ఘమును గురించి తీవ్రముగ వ్రాయుచు విమర్శించుట విను
చున్నాము. ఒక నిర్ణీతమైన యాకృతిలేనిది సంఘము.
గనుక వారి దూషణ నిరాఘాటకముగ సాగుచున్నది.
తక్కినవారితో బాటుయిష్టములేకపోయినను తాముకూడ
సంఘసభ్యులమనుభావము వారికి లేకపోవుటచేతనేమో ?
వ్యక్తి దూషణకుగడంగిన ముప్పావచ్చును. వెంటనే ప్రత్యు
త్తరములభించగలదు. విశాలసమిష్టి కుటుంబమునకు బోల్చ
దగిన సంఘమును బ్రువ్వదిట్టినచో నందుగల వ్యక్తులు
ప్రత్యేకముగా దూషించుటలేదని యూరటపడి మిన్నకుం
దురు. కాబట్టి యెంతసేపు దిట్టినను ప్రత్యుత్తరము లభిం
చకపోవుట విచిత్రముకాదు. ఐతే యీ సంఘదూషకులు,
తమకు తామేదైనను, తమ నభినందించు వారిచేనైనను,
సంఘసంస్కారులని చాటించుకొనెదరు. సంఘసంస్కార
మనునది చాలగొప్పపని. సంస్కరించుటకున ఉన్నకుళ్లును
పోగొట్టి మంచినిచేకూర్చుట. సంఘసంస్కారులకు స్వార్థము
పనికిరాదు. వారికి సర్వమానవ సౌభాతృత్వమే ముఖ్యము
వారిప్రయత్నమునలన ప్రత్యేకవ్యక్తులకుగాని, సంఘమంత
టికిగాని లాభముచేయును. దుష్టశిక్షణ, శిష్టరక్షణకార్య
మేవిధముగా ఉత్కృష్టమో, యదేవిధముగ సంఘసంస్కా
రముకూడ. కొందరు దుష్టవ్యక్తులవలన ప్రజాక్షేమమునకు
భంగముకలిగినగాని, ధర్మనిర్వాహణమున కాటంకముకలిగిన
గాని, న్యాయమెరింగిన పెద్దమనుష్యులు వారినణిచిపెట్టి శాం

తిని నెలకొల్పెదరు. అణచిపెట్టుటయున వారొనర్చినది నలుగురికి తెలియనీయకుండ జేసి లోలోన పోత్సహించుట కాదు. వారిదుర్మార్గపుపనులను జరుగనీయకుండ జేయుటయే. ప్రజలయందు దుర్నీతి ప్రబలమైనప్పుడుగాని, స్త్రీ పురుషుల సౌశీల్యమునందు మార్పుగలిగి వ్యభిచారదోష మొదవునను సంశయము కలిగినప్పుడుగాని, పురుషునివలన స్త్రీకిగాని, స్త్రీవలన పురుషునికిగాని తెప్పరిల్లుకోలేనంత నష్టముగాని, అపకారముగాని, కగిలినప్పుడు సంఘసంస్కారులు ప్రాణములనైన త్యజించి, శాంతినెలకొల్పి, ధర్మమును పునరుద్ధరింప బాటుపడుదురు. వారినిరంతర కృషివలన దౌర్జన్యము అధర్మమునశించి, ధర్మము పునఃస్థాపించబడును. సంఘసంస్కారమన నిట్టిమహత్తర కార్యముసుమా! అది ప్రతివానికి సాధ్యముకాదు. శక్తిసంపన్నుల కేసాధ్యము. వారు నిత్యజీవితమును ధర్మబద్ధముగ నడుపుదు, ఇతరుల కష్టముల కాదుకొనుచు, ప్రశాంత జీవితమును గడుపుచుందురు. కనుకనే వారట్టి దుర్ఘటకార్యములను సాధించుట కర్హులు. నేటి సంఘసంస్కారులందు స్వార్థత్యాగము నేతిబీరకాయవంటిది. స్వార్థత్యాగముకారు వారియాదర్శము స్వార్థపరత్వము. వారి స్వేచ్ఛాప్రవర్తనకు భంగముకలుగరాదు. తమప్రవర్తనవలన యితరులకు నష్టము కలిగినను పరవాలేదను తత్వముగలవారు. స్వార్థమునకే లోటువచ్చిన నితరులను దూషింతురు. సంఘక్షేమమునకు సంఘనియమ పాలనమునకు, స్వీయ నష్టములను మరచువారికే స్వార్థత్యాగమలవడును. స్వార్థమున కభిలషించువారికి దుర

భిమానము మెండు. దురభిమానమే దుష్ప్రవర్తనకు దారితీ
యునుదుష్ప్రవర్తనము కలవారివలన నితరులకు నష్టమేగాని.
లాభము కలుగబోదు. కనుకనే స్వార్థపరులగువారు సంఘసం
స్కారు లనిపించుకొనినప్పుడిక నధర్మమేకాని ధర్మముజరుగ
బోదు. సంఘనియమము లెవ్వియో యెరుంగ బ్రయత్నిం
చనివారి కందులోని లోటుపాట్లు, మంచిచెడ్డలెట్లు అవగా
హనమగును? గ్రాహ్యముకానప్పు డేవిషయమునైనను విమ
ర్శించుట సాహసము. భగవంతుడు కంటికి గనపడనంత
మాత్రమున నతని యునికిని నిరాకరించుట యెంతహాస్యా
స్పదమో, సంఘనియమము లెరుగనివారు దానిని దూషించు
టయుంత హేలనము. దురభిమానముతో దహించుకొను
స్వార్థపరులజోలికి పోకపోవడమే మేలు. కుట్టుతుందని తెలిసి
కూడ తేలుకొండిని ముట్టుకొను అవివేకులుందురా? దొడ్లో
తిరుగుచున్నదని విషసర్పమును మన్నించి యూరకుండిన
నెట్టియాపద సంభవించునో, తక్కినవారివలె, దురభిమాను
లును సంఘసభ్యులేగదాయని, స్వైరవిహారమును గావింప
బ్రోత్సహించినపట్టి కీడు చేకూరగలదు. సజ్జనులవలెనే దుర్జ
నులు భగవత్సంతానమని వేదాంతమును బోధించు మహా
శయులుందురు. కాదనికాదుకాని, సృష్టియందు మెలగు
ప్రాణికోటి యంతయు నొకటేయైనప్పుడు క్రూరజంతువు
లను వధించుటదేనికి? వాటివలన ప్రజలకు విపరీతమగు
హానికలుగును గనుక. అధర్మప్రవర్తనమందే ప్రీతిగలిగిన
ధార్తరాష్ట్రుల వధింపవలసినదిగ శ్రీకృష్ణుడేల బోధించి
నాడు? స్వయముగ కంసునినేల వధించినాడు? వారు దుష్ట

స్వభావులుగనుక. దుష్టులను శిక్షించుట, శిష్టులను వారి వారినుండి రక్షించుట భగవదేచ్ఛయైనప్పుడు సృష్టిజాల మంతయు నొకటియని దుష్టశక్తులు విజృంభించుటచూచి యూరకుండుట క్షంతవ్యము. సమానభావ మెప్పుడవలం బించవలయును? ధనికనిరుపేద తారతమ్యమును రూపుమాపు టకు, సంఘమునందు మంచిని చేకూర్చునప్పుడు చిన్నపెద్దల భేదమును బోగొట్టుటకు, ఒకనియమమును పాటించునప్పుడు స్త్రీ పురుష వ్యక్తి భేదమునుపయోగించు స్వార్థపరులందుం డగ.మును బోకార్చునప్పుడు. సంఘమును సంస్కరించుట యందింత గూడార్థము ఇమిడియున్నది. ఇష్టమువచ్చినవారు సంస్కారులు కాగలరా? కనుక సోదరీ! సంఘసంస్కారుల మని డబ్బా వాయించుకొను స్వార్థపరుల యాగడము నెఱిగి ప్రవర్తించుము. గంగలో మునిగినంతమాత్రమున శునకము గోమాత సమానమగునా?



# నాల్గవ మజిలీ.



స్త్రీలకు సంఘమునందుగల గౌరవమును దెలిపితిని. ఇఁక వివాహితలగు బాలికల కేలాఁటి బాధ్యతకలదో వినిపించెదను. యువతీయువకుల కిరువురికి వివాహమగుటవలన వారి బాధ్యత ఎక్కువగును. నాఁటినుండి వారికి గృహస్థాశ్రమ ప్రవేశార్హతలభించును. గృహస్థధర్మమన నేమో చెప్పుమనెదవా ? గృహమేధి, అతనిగృహిణి, కలిసి ఆచరింపవలసిన ధర్మమే గృహస్థధర్మము. గృహమున కధిపతి పురుషుఁడు. అతనితో సమానభాగమున పంచుకొనిన గృహలక్ష్మి స్త్రీ. స్త్రీలను గృహలక్ష్ములందురు. లక్ష్మి మంగళ ప్రదాయిని. ఆమెను విష్ణుమూర్తి తనహృదయమునందధిష్టింప జేసికొనినాఁడు. ఆయనకుఁగల ఐశ్వర్యమంతయునామెయే. మనమెప్పుడు "శ్రీమహావిష్ణువు" అని వినెదమెకాని "విష్ణుమూర్తి" అనివినము. కొందరట్లుచ్చరించినను, అనవలసినది "శ్రీమహావిష్ణువు" అనియే. 'శ్రీ' అనుమాటకు లక్ష్మియను అర్థము స్ఫురించునుగదా! లక్ష్మిదేవివలన శుభములు కలుగును. విష్ణుమూర్తికి లక్ష్మిదేవికిఁగల సంబంధమును మానవులు వర్ణింపనశక్యులు అదిభావాతీతము. వారిరువురు భార్యాభర్తలని, యావత్సృష్టికి తల్లిదండ్రులని చెప్పుటకాదు. సృష్టిఁగావించుటయందు, దానిని రక్షించి, ప్రళయకాలమునందు సంహార

మొనరించుటయుండగా మూలవిరాట్టునకు, లక్ష్మీదేవికి నేలాటి సంబంధముకలదో తెలుపుట దుస్సాధ్యమని నాయభిప్రాయము. ఐనను, గృహస్థులకు త్రిమూర్తులు, వారిభార్యలు, ఆదర్శప్రాయులుగ నుండగలరు. ఆదర్శము లెప్పుడు ఉన్నతమ తరగతికి సంబంధించి యుండవలెను. వానినిబట్టి ఆక్షేపములు కుదురుచుండును. లక్ష్మీదేవికి ఎడబాటు కలుగుటను ప్రశ్నకేతావులేదు. కారణమామె విష్ణుమూర్తి వక్షస్థలమునందు నివసించుచుండును. వక్షస్థలనివాస భాగ్యమబ్బుటచేతనే మొదట నామెనుబేర్కొనెదము. శరీరము నందధిష్ఠించుకొనిన నప్పుడింక నారాయణుడామె హృదయమునందు నివసించియే యుండునని తెలుపనక్కఱలేదు.

స్త్రీలను మనపూర్వులు "గృహలక్ష్మి" అని గౌరవించిరి. దానివలన గృహకృత్య నిర్వహణమునందు స్త్రీలకేలాటి ప్రత్యేకస్థాన మొసంగబడినది విశదమగుచున్నది. 'గృహలక్ష్మి'యని గౌరవముగ బిలిపించుకొనుటకువ్విళ్లూరు యువతులా పేరునకు దగినట్లు ప్రవర్తించుట తప్పనిసరి. ఇంటికి అందమును, శోభనుకలిగించునది స్త్రీయని అందఱెఱింగిన విషయమే. సంపాదించు పురుషుడు బైటననుభవించు కష్టములను మఱపించుశక్తి స్త్రీలకుకలదు. స్త్రీవలననే కాని ఊరటకలుగబోదు. ఉద్యోగస్థుడుకాని, వ్యవసాయదారుడుకాని, కూలివాడుకాని, గృహమునువీడి మరల చేరుకొనునంతవఱ కనుభవించు కష్టములకు — శారీరకముగాని, మానసికముగాని — ఊరట అనుంగు భార్యవలన గాక నింకెవరివలన లభింపగలదు? ఇంటికి వచ్చినతోడనే.

అతనికానందమును గలిగించు విధమున బ్రవర్తించవలెను. వెంటనే అతని ఆఫీసు విషయములుకాని, లేక మఱి ఏయితర వ్యవహారములుకాని, ప్రశ్నింపక సేదదీరునట్లుపచరించి, ప్రియసంభాషణానంతరము కడుపార భోజనముచేయించి విశ్రాంతి దీసికొనునట్లొనర్చిననేకాని పురుషుని బడలికతీరదు. బడలి యున్నప్పుడు ఏవ్యక్తిసానుభూతిజూపి సాధ్యమైనంత వఱకు విశ్రాంతిని సమకూర్చునో, ఆవ్యక్తిమీద ప్రేమగౌరవము లుద్భవించుట విచిత్రముకాదు. ఎవరైననొకరు రుగ్మతతో బాధపడుచున్నప్పుడు వారివద్దకేగి, ఆరోగ్యమడిగి, వీలయిన ఉపచారములను జరిపితివనుకొనుము. బాధపడుచున్నరోగికి నీయందవ్యాజానురాగముకలును. అదిమానవస్వభావము. పరస్పర సంబంధములేని వ్యక్తులలోనే కృతజ్ఞతాభావము రేకెత్తుట సహజమైనప్పుడీక సంఘదృష్టియందేకమొనర్పబడి, సంసారభారమును తమ భుజములందు దాల్చిన భార్యాభర్తలొకరినొకరిని ఆదరించి సహాయమొసంగుకొనిన నెట్టిగాఢ ప్రేమానురాగ భావములు జనించునో చెప్పనక్కఱలేదు. పైనజెప్పిన ప్రకారము పురుషుడెంత కఠినహృదయుడైనను; విరసుడైనను, అతనిని తననిర్మల ప్రేమతో లొంగతీసికొనగలశక్తి స్త్రీలకపారముగ గలదు. వారివలన నానందము ననుభవించుటకు నోచుకొనని పురుషునిజీవిత మంధకారబంధురమై ఉండును. దేహసంబంధమునుబట్టివిచారించినను, స్త్రీవలన పురుషునికి, పురుషునివలన స్త్రీకి పరస్పరసౌఖ్య సంతృప్తులబ్బును. బాహ్యప్రపంచమునందే ముక్తిలభించినను, ఐహికసౌఖ్యకాముల కు బరస్ప

రానురాగముననే సంతుష్టికలుగును. ఇంటికి వచ్చినతోడనే తనకుగల అసంతృప్తిని వెళ్లబుచ్చి, నిర్దయతో రాపాడు భార్యలను చూచి, భర్తలు ఏవగించుకొనెదరేగాని, వారికోరిక లేమాత్రము మన్నింపరు. స్త్రీలను, వారెంత అనురాగముతో ప్రవర్తించినను, వేధించు భర్తలులేకపోలేదు. నేడేకాదు; అట్టివారు పూర్వకాలమునందునుకలరు. మహాపతివ్రతయని పేర్కొనంబడు సుమతి చరిత్రమును మనమెఱుంగమా? కామాంధుండై, భార్యను నీచముగ జూచి, నానాకష్టముల పాలుగావించి, తుదకామెచేతనే వేశ్యాగృహమునకు గొంపోవబడిన సంగతులు హిందూస్త్రీలకు క్రొత్తవికావు. ఓపికతో, పట్టుదలతో, ధర్మనిరతితో, శీలరక్షణాభిలాషతో, భగవానునిపై భారముపైచి, ఎట్టివిపత్తులు దాపురించినను, పరిణయమాడిన భర్తయను భక్తితో, మెలఁగిన సుమతి చాకచక్యమే చివఱకు భర్తకుగలవ్యాధి నిర్మూలమగుటకు, కలకాలము పతివ్రతయను కీర్తికలుగుటకు కారణమైనది. నేఁటికిని సుమతి చరిత్రమునాదర్శకముగ నేలచెప్పుకొనుచుంటిమి? ఆమెలోనున్న సహనము, సేవాధర్మనిరతి, పాతివ్రత్యము, క్షమాగుణము, సంతృప్తి మొదలగు సలక్షణములే ఆమె బ్రతికిఉన్నప్పుడు కీర్తిగౌరములనుభవించినదో లేదో కాని తనువు చాలించిన తరువాతమాత్రము భారత దేశ చరిత్రయందామెనామము సువర్ణాక్షర లిఖితమగుటకు దోహదమొసఁగినది. స్త్రీలకు మానపోషణమేగాకుండ క్షమాగుణముకూడ నుండవలెను. మానవతి క్షమాస్వ

రూపిణియగుచో, ఇంకలభించు గౌరవమనన్యసామాన్యము. క్షమాగుణ రహితలగు స్త్రీలు రాణింపరు. తమభర్తలు కాని, కుటుంబీకులుకాని, లేక తోడియువతులుకాని, హృదయము నొప్పించుమాటలనికాని, చేష్టలుసలిపికాని బాధించినచో, స్త్రీలు క్షమాస్వరూపిణులై మెలంగుట ఎంతయో సమంజసము. ఓర్పుఅనునది ప్రత్యేకముగ స్త్రీలకేగాని పురుషులకనవసరమాయని ప్రశ్నింపవలదు. సద్గుణముల వలవఱచుకొనుటకు స్త్రీ పురుషతారతమ్యముతో పనిలేదు. ఎట్టిమనస్తాపము కలిగింపబడినను, క్షమించి మన్నించువ్యక్తులు స్త్రీలలోనున్నారు; పురుషులలోనున్నారు. స్త్రీలందే ఈవిశిష్టగుణసంపత్తి సహజముగ గన్పడుచుండును. పూర్వకవీశ్వరులు, ఋషులు, స్త్రీలకే క్షమామూర్తులను గౌరవమునొసంగిరి. ఆదర్శ జీవితమును గడుపువిషయములో ప్రతి హిందూవనితయు, తనసంతానమునకు పూర్వభారత నారీమణుల జీవితచరిత్రలను బోధించును. వారిననుకరించు మార్గమును దేశించును. కారణము? మనపురాణ స్త్రీలంతటి ఆదర్శజీవితములను గడుపుటవలననే! పురుషులలో సక్రమమార్గమున జీవితములను గడిపినవారరుదు. సక్రమ మార్గమనిన ఆక్షేపించుటకు వీలులేనివిధమున ఆదర్శప్రాయముగ ప్రవర్తించుటయని యెఱుంగుము. పురాణములందు పేర్కొనబడిన విశిష్టవ్యక్తులలో మనమెఱింగినది శ్రీరామచంద్రుండు, భీష్ముండు, శ్రీకృష్ణభగవానుండు, ధర్మజుడు మొదలగువారు. వీరుకాక తక్కుంగలమహాపురుషులను కూడ పేర్కొనుటకు వీలున్నను మనమంతగా చెప్పుకొను

చుండము. పురాణకారులు వ్రాసిన గ్రంథములందు మన మెందఱినో ఉత్తమపురుషులను గాంచగల్గుదుము. వారు వ్రాసినవి పుక్కిటి పురాణములని గేలిచేయువారు బయలు దేరినమాట వాస్తవము. పుక్కిటివైనప్పటికి, వారు చిత్రించి, మనకనులఎదుట ప్రత్యక్ష మొనర్చిన వ్యక్తులజీ వితములను నిష్పక్షపాత దృష్టితో బరిశీలించినచో వాటివ లన నిత్యజీవితము నాదర్శప్రాయముగ నడుపుట కెన్నియో మార్గములు గోచరించును. పురాణయుగమునాటి వ్యక్తు లలో స్త్రీపురుషులాదర్శజీవితములను గడిపినప్పటికిని, మన చరిత్రకారులు స్త్రీజీవిత చరిత్రలనేమిన్నంటునట్లు స్తుతించిరి. బహుశా వారిదృష్టిలో స్త్రీలకు సంఘమునందు, దేశపురో భివృద్ధి ప్రయత్నములందు, గలప్రత్యేకస్థానమును సంస్మ రించుటవలననే పైవిధముగ స్తుతించియుందురని ఊహించ వచ్చును. ఇంతకుముందు నీకు చెప్పినప్రకారము పూర్వ ముమంచి స్త్రీలకొక ప్రత్యేకగౌరవస్థాన మొసఁగబడినది. అది యిప్పటికిని గలదాయని ప్రశ్నించిన ప్రత్యుత్తర మిచ్చుట కష్టము. ఉన్నవారికిగలదు; లేనివారికిలేదు. అనగా, ఏస్త్రీలు భారతీయ నాగరికతననుసరించి సక్రమ జీవితమును గడుపుచున్నారో వారికాస్థాన మిప్పటికిగలదు. తద్విరుద్ధ పరివర్తనకు గడంగినవారికి స్థానభ్రష్టత్వము కలు గుట వింతకాదు. భగవంతుఁడొకఁడున్నాడని నమ్మి, అత నిని స్మరించి, పూజించి, భక్తితో జీవితమును గడుపువా రికి పరమపదప్రాప్తి నేఁటికిని కలదు, పాషండులకు కలుగ

బోదు. అహంకారస్వభావులు కొందఱు భగవంతుఁడు లేఁడని బుద్ధిపుట్టినను, అతని ఉనికి యెట్లు సత్యమో, మదించి తిరుగు స్త్రీలు సంఘమునందు తమకు పూర్వమొసఁగబడి నస్థానము లేదనినను ఉత్తమస్త్రీలకు అది ఉండనే ఉన్నది. దానినెఱిఁగి ప్రవర్తించు సౌభాగ్యము నేఁడు భారతావని యందు కరవైనది.

# ఐదవ మజిలి.



ఈ దౌర్భాగ్యదశకు కారణము మనదాస్యభారమే; పురుషులు మొదట ధర్మచ్యుతులగుటయే; వారియందు విదేశనాగరికతావిషబీజములు నాటుకొనిపోయి, తమ రుచుల కనుగుణ్యముగ స్త్రీజాతిని మార్చుటకు ప్రయత్నించుటయే; నూత్నముగనగుపించిన విపరీత నాగరికతకు మోజుపడి స్త్రీలుసైతము తప్పటడుగులు వేయుటయే! లోగా తెలిపిన విధమున పురుషులకు పట్టుదలకాని, శీలపోషణనిరతికాని స్త్రీలకు ఉన్నంత లేదను సంగతి సత్యము. కనుకనే భారతదేశ సౌభాగ్యము, కీర్తిప్రతిష్టలు మొదటినుండి స్త్రీవ్యక్తులమీదనే ఆధారపడియున్నవి. నేడగుపించిన విధమున పాడయిన జాతి గౌరవమును పునః సంపాదించుటకు స్త్రీలే ప్రధానపాత్రవహించవలెనని గాంధీమహాత్ముండలుంగెత్తి చాటుచున్నాడు. అట్టి దృఢనిశ్చయముతోనే, ఆయన దేశ స్వాతంత్ర్యోద్యమమునందు పాల్గొనుటకు స్త్రీలకు ప్రథమ స్థానము నొసంగినాడు. ఈయుద్యమమునందు చేరుటకు స్త్రీలను పురుషులడ్డుపెట్టుచున్నారనునది సత్యము. దీని యందొక రహస్య కారణమిమిడియున్నది. స్త్రీలను తమతోబాటు తప్పుడుమార్గమునందు నడువప్రోత్సహించిరేకాని, దానివలన నేలాటి అనర్థకము కలుగగలదో ఊహింపజాలక పోయినారు. చేతులలో చేతులుకలుపుకొని, భుజములను రాచుకొనుచు, దుష్టభావములు చూచుటతోడనే చెలరేగు

విధమున నలంకరించుకొని బజారులవెంట, క్లబ్బులలో, కాఫీహోటళ్లలో, ఉద్యానవనములలో, సినిమాహాల్సు లలో, స్వేచ్ఛాప్రవర్తనముసలుపు పాశ్చాత్య యువతీయువ కుల నాగరికతనుగాంచి, మోసపోయి మనదేశము స్త్రీలు కూడ, ఆవిషయములో ముందంజవేసినామని గర్వించు పురు షుల అవ్యక్తతకారణముగ, చిరకాల కారాగారవాసము ననుభవించిన తరువాత వదలివేయబడిన ఖైదీలవలె, తమ గృహములను వీడి వీధిలోపడిరి. క్రమశః పురుషులను తల దన్నిరి స్త్రీలు. దానితో నెత్తి బొప్పికట్టినది పురుషమహా శయులకు. తమచేత ప్రోత్సహింపబడి, చేయూత నొసంగబడి అంతదనుక గృహములందే జీవితముగడుపు స్త్రీలుమించి పోవుటవారికిష్టము కాకపోయినది. తామొసర్చునది క్షేమ కరముకాదని మరల గృహప్రవేశ మొనర్చవలసినదని స్త్రీ లను బాధించిరి. దైనందినాభివృద్ధినందుచున్న స్త్రీలంత తేలికగా నణచివేయబడగలరా? 'నీవునేర్పిన విద్యయే నీర జాక్ష' యని వెంటబడిరి. ఈప్రవర్తన తమవ్యక్తిగౌర వమునకు భంగకరమని క్రోధించి, కఠిన మనస్కులైరి పురుషులు. వారిని వీరు సాధించుట వీరిని వారు చులకన పరచుట ప్రారంభమైనది. ప్రతి గృహమునందు కల్లోలము లేకాని, శాంతిలేనేలేదు. వీరికల్లోల ఫలితముగ జాతీయ నాగరీకతకు కనపడకుండానే దెబ్బతగిలినది. దానితో దేశ మునందు అసహనము సిద్ధించినది. పవిత్ర భారతమాత యొుదురవక్షకు కంపిల్లిపోయినది. ఆమె యాక్రందనమును వినువారు లేకపోయిరి. చివరకు మహాత్ముని చెవిని బడి

నది. జాతిపునరుద్ధరణకు బూనుకొనినాడు. చాలమంది స్త్రీపురుషులా పవిత్ర కార్యమునందు పాల్గొనినారు. ప్రాణమాన ధనములైనను త్యజింప శపథమును బూనినారు. స్వాతంత్ర్య సమరము సాగుచునేయున్నది. కాని సోదరీ! మన దేశ సౌష్ఠవమును మొదలంటదిని వేయుచున్న నాగరికతా విషకీటకము త్వరలో మ్రగ్గిపోగలదు. ప్రతియింట దీనిసంచారమునకు తావుదొరికినది. స్త్రీపురుషుల హృదయములను తొలిచివేసినది. సన్నిపాత జ్వరమొక మాత్రతోనే కుదరనట్లు నాలుగుమూలలకు ప్రాకిన యీనాగరికత మహాత్ముని, అతని అనుచరుల మానవప్రయత్నములవలన వెంటనే నిర్మూలింపబడునా? కొంతకాలము కావలయును. ఈనాగరికతా వ్యామోహమెంత భయంకరమైనదో తెలియునా? నానాటికి హెచ్చు మీరుటయే తప్ప తగ్గుటలేదు. విశిష్టభారతీయ నాగరికతకనుగుణ్యముగ గృహస్థాశ్రమవిధులను శ్రద్ధతో నెరవేర్చుటకుబదులు, వాటినేనగించి, ఒక్కసారిగ బందిలి దొడ్డిలోనుంచి బయటపడు గొఱ్ఱెలమాదిరి, ముందడుగు వేయుటకల్లాడిపోయి, గృహములనువీడి, వీధులత్రోబడిన స్త్రీపురుషులు క్రమశః సినిమాప్రవేశమునకు, క్లబ్బు మెంబరుషిప్పులకు, పార్కువిహారములకు ఎగబ్రాకుచుండిరి. వారికి సినిమాలలో చేరవలెనా? అక్కరలేదా? పురుషులకు ప్రవేశార్హత కలిగినప్పుడా స్త్రీలకు వలదా? అనుదుర్ఘట సమస్యలు బాధ కలిగించుచున్నవి పాపము! చర్చలు, వాదోపవాదములు, ఉత్తర ప్రత్యుత్తరములు బయలుదేరుచున్నవి. వాటిలో పాల్గొనినంతమాత్రమున

నష్టనేమియను సిద్ధాంతము బయలుదేరినది. నేడు భారత జాతిదానితో తలబద్దలు చేసుకొనుచున్నది. తుదకేమికానున్నదో తెలియదు. ఆతురతతో, ఆవేశముతో, పిచ్చితో, చూడనువిళ్లూరు ప్రేక్షకుల నేడిపించుటకుగాను గారడీవాడేరీతి ఒక్కొక్క విద్యను ప్రదర్శించునో, అట్లనే మనదేశ సౌభాగ్యమును కాలితో తన్ని, నాశనమొనర్చుటకు ప్రయత్నించు నాగరికతా పితామహులు కొద్దికొద్దిగా, ఒకేసారి బయటపెట్టిన లోపములు బయటపడునేమోయని వెఱచి తమ సాంప్రదాయములను, వేషభాషలను రుచి చూపించుచుండిరి. పాపము స్వేచ్ఛావాయుప్రచార భాగ్యము విదేశ నాగరికతానుకరణముననే ప్రాప్తించినదను పెట్టినమ్మకముతో చిందులు త్రొక్కుమనవారు బయటపడినదే తడవుగా స్వాధీనపర్చుకొనుటకు ప్రయత్నించుచుండిరి. ఆనాగరికత వారిపాలిటి భాగ్యదేవతయన్ని, ఎవరెన్ని చెప్పినను పెడచెవినిపెట్టించునంతటి గాఢవిశ్వాసము. చెడిపోవుటకన్న బాగుపడుట చాలకష్టము. విచిత్రమేమనిన విదేశనాగరికతా లక్షణ పరిశోధనకు గడంగిరి కొందరు మహామహులు. తమపాలమును బీడుపెట్టి యితరపాలములను సారవంతముకా నొనరించుటకు ప్రయత్నించు కర్షకుని మాదిరి, వీరు తమ నాగరికతను కాలదన్ని పరిత్యజించి, విదేశీయుల నాగరికతకు దాసోహమర్పించుటయేగాక స్వార్థమును వీడి యితరులకు సహాయమొనర్చిన కర్షకుడు గొప్పవాడేగాని వాని స్వార్థత్యాగమువలన కొంపలంటుకొని పోఁగూడదుకదా ? తాజెడ్డకోతి వనమెల్ల చెరచినదను

సామెత ప్రకారము, తక్కినవారుకూడ చెడిపోవలయునను దురభిమానముతో పరిశోధన గావించుచున్నారు. తమపరిశోధనాఫలితములను నలుగురికి చాటుచున్నారు. మెచ్చి ఆచరణలోపెట్టువారుకొందరు, సహవాసదోషము వలననను కరించువారుకొందరు. ఏమియు తెలియకపోయినను, నలుగురితోపాటు నారాయణా! అని తప్పదుత్రోవబడువారు కొందరు. తయారయినారు. ఇప్పటికి చాలవరకు విదేశీయులచే నాటబడిన విషబీజము మొలకెత్తి, నానాటికి వృద్ధికివచ్చి, మహావృక్షమై నలుదిక్కుల కొమ్మలతో నాక్రమించుకొనినది. ఆవిషచ్ఛాయలయందు వ్యక్తిత్వమును గోల్పోయి, దురహంకార పూరితులై, దూరపుకొండలు నునుపుఅను తత్వమును స్మరించు అజ్ఞానులై, జాతీయనాగరికతకు మహాపకారము సల్పుచు, త్రాగి, మత్తెక్కి వెర్రిసంభాషణ మొనర్చు త్రాగుబోతులవలె, ఇకిలించుచుండిరి మనదేశీయులు. వారి ప్రాణానికి గృహనివాసము కారాగారముతో సమానము. గృహకృత్య నిర్వాహణము ఖైదీలు విధిలేకచేయు కటిక దాస్యము. గృహస్థ ధర్మవిధులు పురోభివృద్ధి మార్గనిరోధకములు. సంతానముకట్టుత్రాళ్లు, సనాతన సాంప్రదాయము గుదిబండ. పాతివ్రత్యముకాని, సక్రమప్రవర్తనకాని, పెనుభూతము. పూర్వులు పిచ్చివారు; అజ్ఞానులు, మానవకల్యాణమునకు విద్రోహులు. దేశసేవ స్వగౌరవ విఘాతకృత్యము. ఆహా! యెంతటిమార్పువచ్చినది! సంస్కృతము చచ్చిపోయినది. మాతృభాష మంటగలిసినది, విదేశభాషవిశిష్టమైనది. విశ్వవిద్యాలయ ప్రసంశయే కర్తవ్య

ముగ దోచినది. వృత్తివిద్యలకుబదులు నిరర్థక గ్రంథపఠ
నమే మంచిదనిపించినది. సాలెవాండ్రు, కుమ్మరివాండ్రు,
మంగలివాండ్రు, చాకలివాండ్రు, కమ్మరివాండ్రు, మొదల
గువృత్తికారకులు నవీనయువతీ యువకుల దృష్టియందు పనికి
రానివాండ్రు. భావప్రపంచమునందు ప్రత్యేకస్థానమొకటి
తమకు నిర్ణయింపబడినదని యానందించు వీరికి, నిత్యజీవితము
నందు సేవచేయువారు వృత్తికారకులే. ఐనను దానిని
గ్రహించుటకు వీరుప్రయత్నింపరు. వారికనులకు అంధకా
రముదట్టినది. అవసరమున్నంతవరకు వృత్తిజీవితమును గడు
పువారు కనబడెదరు. తరువాత తిరిగి వారికాయంధకారము
వలన కన్నులు తెరిపికిరావు. ఈజాడ్యమెన్నడు వదలునో
ఈశ్వరునకే యెరుక. రానురాను వ్యామోహము ప్రాణాం
తకమైనది. 25 ఏండ్ల మహాత్ముని నిరంతర కృషివలన
యేమాత్రమైన ఈవిపరీత నాగరికుల హృదయములు చలిం
చుట సంభవించినను, వారినిబట్టి బాధించు విషజ్వర ప్రకో
పమునకు గురియై, వెంటనే చలికిలబడిపోదురు. పూర్వభాష
యందు కూలంకష ప్రజ్ఞగడించిన భారతదేశీయ నాయకుల
కీవ్యామోహ మొందుకులేదు? వారుకూడ విదేశనాగరికత
యెటువంటిదో గ్రహించినవారే. కాని వారిది క్షీరనీరపరి
జ్ఞానవివేకము. అట్టివారిలో ముఖ్యులు గాంధీమహాత్ముడు.
రవీంద్రుడు, రాధాకృష్ణ పండితుడు, నెహ్రూమహాశయుడు
మొదలగువారు. మన ఆంధ్రదేశమునందు మాత్రము
లేరనుకొంటిరా? "ఆంధ్రకేసరి" పట్టాభి, దేశభక్త, విశ్వ
దాత ప్రభృతులట్టివారే. వీరందరి జీవితచరిత్రములు మనకు

పాఠ్యగ్రంథములుగ నుండదగినవి. వీరిలో గాంధీమహాత్ముడు దేశమునకెంతయో మేలునుచేకూర్చిరి. త్యాగధనులని ఆబాలగోపాలము స్తుతించినది. భారతజాతి, దాని నాగరికత, తద్వైశిష్ట్యము, నిజరూపములో పాశ్చాత్య ఖండములకు జాటినారు. వారిదివ్య సందేశ ఫలితముగ భారత జాతీయౌన్నత్యమును మనమెవరి నాగరికతను గ్రుడ్డిగ ననుకరించుచుంటిమో, అట్టి పాశ్చాత్యులు గ్రహించగలిగిరి. భారతనాగరికతయొక్క గొప్పదనమును వారభినందించిరి. ఆధ్యాత్మికౌన్నత్యమునకు, బాటుపడుజాతి భారతజాతియే యని వారంగీకరించిరి. మొట్టమొదట భారతజాతి గౌరవమును పెంపొందజేసి పాశ్చాత్యుల హృదయములందు మార్పుగలిగించినది శ్రీవివేకానందస్వామి. ఆయనకు భారతజాతి యెంతయో ఋణపడినది. దానిని తీర్చుట చేతకాదు. ఆయన దివ్యసందేశమువలన నెన్నియో రామకృష్ణమఠములు పాశ్చాత్య ఖండములందు స్థాపించబడినవి. ఎంతమందో విశాలహృదయులు పవిత్ర హైందవ ధర్మసారమును గ్రహించగలిగినారు. ఆయనతరువాత మరల స్వాభిమానహృదయులై నిద్రించుచున్న పాశ్చాత్య దేశీయులను మేల్కొల్పినది శ్రీ రాధాకృష్ణ పండితుడు. ఈ జాత్యుద్ధారకుల హ్యాణభాషాపాండిత్యము అపారము. తమమాతృదేశ దాస్యవిముక్తికి, జాతీయ నాగరికతను వ్యాప్తిపరచుటకు, మాత్రమే వారాంగ్ల భాషావైశారద్యమును గడించిరి. కాని వారి యాత్మ మాతృదేశ చరణసేవాభిలాషయం దేగానిమగ్నమైయుండును. వారు తాము భారతీయులమనే తలం

చెదరు. అంతేగాక భారతీయులమని చెప్పుటకు గర్వించె దరు. భారతీయ నాగరికతయే విశిష్టమనినమ్మి, దానినభి వృద్ధిపర్చుటకు జీవితములను ధారపోసెదరు. నిండుకుండతొణ కదన్నట్లు వారి జాత్యభిమానము నిశ్చలము. ఏరోటిదగ్గర ఆపాటయన్నట్లు మెలగరు. వారికాంగ్లమందెంత పాండిత్య ముగలదో అంతకన్న రెట్టింపు దేశభాషయందును, మాతృ భాషయందును గలదు. పాశ్చాత్య ఖండములందు భారత దేశ గౌరమును పెంపొందించుటకు, భారత నాగరికతా వైశిష్ట్యమును బోధించుటకుమాత్రమే హూణభాష నుప యోగింతురు. వాళ్లు నూటికి నూరుపాళ్లు భారతీయులు. సోదరీ! మనపురాణ పురుషులతోబాటు వారిదివ్య నామము లను సైతము స్మరించుచుండుము. ఇకకొద్దిగ పొట్టకూటి కొరకు హూణవిద్యాభ్యాస మొనరించినవారి మిట్టిపాటిం తింతయని చెప్పలేము. విద్యవలన విజ్ఞానము, సహనము, సరళత్వము మొదలగు సద్గుణములబ్బునేగాని పొగరుబోతు దనము, ఎగతాళి, హాస్యము, నిరాదరణ, వ్యర్థప్రలా పములు మొదలగు దౌర్భాగ్య గుణములబ్బవు. ఇన్ని చెడు గుణములు నేను మనమభ్యసింపవలసివచ్చిన భాషయందు, నాగరికతయందు గలవని చెప్పజాలకపోయినను, వాటినవ లంభించువారియొక్క, ప్రోత్సాహించువారియొక్క, అజ్ఞా నప్రబోధమార్గము నంచిమిడియున్నదని మాత్రము చెప్పవ చ్చును. నేటిమనస్థితి నొకసారి ఆలోచించిన గుండెలు బ్రద్దలు కాగలవు. అన్నివిధముల భారతజాతి నిర్వీర్యమై పోయినది. వ్యక్తిత్వమును, ఆత్మజ్ఞానమును గోల్పోయి

నది. ప్రాణములతోనున్న కర్మాగార యంత్రమువలె నొనర్పబడినది. శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారొక పద్యాన్ని వ్రాసినారు. అది సరిగ మనదేశ పరిస్థితులను నిరూపించగలదు.

శా॥ అన్నప్రాశన హోటలందున, స్వవిద్యాభ్యాసముంగాలేజీ
తిన్నెన్ జేరిమి దేశసేవయును, బస్త్రీముందరాశీసులం
దన్నన్నా! మన చిన్నవారలకుదు స్థావస్థ ఇట్లాయె, యీ
అన్యాయంబున కూరకుండగలవయ్యా! ఆంధ్రదేశీయుడా!

ఇంతకన్న నేమి జరుగుచున్నదేమో! ఈవిధముగ నికకొంతకాలము జరిగినచో భారత జాతియనునదొకటి ప్రపంచభావ చరిత్రయందుండబోదేమో అనితోచుచున్నది. ఇవి మన సాంఘిక పరిస్థితులు. ఈవిషమ పరిస్థితులందుడికి పోవుచున్నాము మనము. పురుషులవలె స్త్రీలును స్థానభ్రష్టత్వము నొందినారు. నిజస్థితి తెలుప బ్రయత్నించినవారు వ్యర్థులనిపించుకొనుచున్నారు. పురుషునికి పదచ్యుతి గలిగినను జాతికంత నష్టము కలుగదు. కాని స్త్రీపతనము మాత్రము మహానర్థదాయకము. పురుషులకులేని గౌరవ నష్టము మాకేలయని స్త్రీలు తలచుట సాహసము.



# ఆరవ మజిలి.



దీర్ఘముగా నాలోచించినచో భారతీయనాగరికత యంతయు స్త్రీలమీద నాధారపడినదని స్ఫురించును. అది ముమ్మాటికి సత్యము. తక్కిన దేశములలోవలెగాక, భారత దేశమునందు స్త్రీలే జాతిగౌరవమునకు పట్టుగొమ్మలు. వారియాదర్శజీవిత విశేషములు కారణముగ భారతజాతి కొక ప్రత్యేకస్థానము లభించినది. కాదనివాదులాడుట ఆత్మ హత్యవంటిది. తక్కిన దేశములవారు తామునివశించు భూమిని (Fatherland) అనిపిలుచుకొనెదరు. కాని మనము మాతృదేశము (Motherland) అని చెప్పుకొనెదము. భారత విజ్ఞానము సైతము దానినే ఉద్ఘాటించును. ఈశ్వరుడు సృష్టి కారకుడని చెప్పుకొనినట్లు, ప్రకృతిని మాతయని గౌరవించె దము. భూదేవతయని మనముమాట్లాడుకొని గర్వించెదము. పవిత్రమాతృభారతియని మన దేశమును బూజించెదము. ఆమెకొరకు ప్రాణములనైన నొడ్డుటకు సిద్ధపడెదము. మన గృహములందైనను పరస్పర సంబంధమును నిరూపించు నప్పుడు, తల్లిదండ్రులని, అక్కచెల్లెండ్రని, చెప్పుకొనెదము. మతవిషయములందు సైతము మూర్తిత్రయమును బేర్కొని నప్పుడు లక్ష్మీనారాయణులని, పార్వతీ పరమేశ్వరులని, వాణీ చతుర్ముఖులని వర్ణించెదము. వీటన్నిటినిబట్టి యేమి తేలుచు న్నది? మనపూర్వులు ప్రథమస్థానము స్త్రీలకొసగినట్లు బోధ

పడుటలేదా ? గృహముకాని, సంఘముకాని, జాతికాని స్త్రీ పాతివ్రత్య ధర్మముమీదనే అభివృద్ధికి రాగలదు. కామాంధులై దుర్మార్గ ప్రవర్తనకు గడంగు పురుషులవలననే స్త్రీజాతి చెడిపోవుచున్నదని చెప్పుచుందురు. కాని మానరక్షణ మొనర్చుకొనుటయందు సర్వము త్యాగ మొనర్చిన స్త్రీలెట్లు చెడిపోగలరు ? రావణాసురునికన్న దుష్టచతుష్టయము కన్న మించిన దుండగీడులు నేడుకలరా ? సీతమ్మతల్లి, ద్రౌపది మొదలగు పతివ్రతామ తల్లులు నేడు మనకు కరువగుటచేతనే పురుషుల దుర్మార్గము విజృంభించుటకు తావు దొరికినది. మొదటినుంచి చెడిపోయినవారెవరు లేకుండ మనజాతి నిష్కళంకముగా నున్నదాయను కుశంకలుకలుగ వచ్చును. అట్టినీతి బాహ్యులను సంఘము వేరుపరచివారి ననాదరించినది. వారే తప్ప తక్కిన సంసార స్త్రీలు సక్రమజీవితములనే గడిపిరి. దేనినైన విమర్శించునప్పుడు మంచినే గ్రహించుట సజ్జన లక్షణము. ఆకాలమునందు నీతి బాహ్యులసంఖ్య చాలతక్కువగనున్నది. వారి యాక్రోశము వినవచ్చుచుండెడిదే గాని, వారివలన జాతిపాడగుట జరుగలేదు. శరీరమునందెచ్చటనో యొకచోట సెగగడ్డలేచినంత మాత్రమున ప్రాణాపాయము రాదు. కాని దానినే విజృంభింపచేసినచో అపాయము కలుగుట తప్పదు. అట్లనే జాతిగౌరవమునకుగాని, తదభివృద్ధికి గాని, విరోధకముగ లేనంతవరకు నీతిబాహ్యుల సంఖ్య స్వల్పముగనున్నప్పుడు నష్టముకలుగబోదుకాని అందరు నీతిబాహ్యులేయగుచో నిక జాతినిర్వీర్యమైపోవును. నీతిబాహ్యులలో చాలమంది మానభంగ మొనరించుకొనినవారే. వారి ప్రవర్తవలన హానిచేకూరగలదు గనుక దూరముగనుంచ

బడిరి. స్త్రీలకు మౌనమేభూషణమని మనవారుబోధించి,తమ సంతతివారు దాని నపహసించక సక్రమముగా ప్రవర్తించ గలరనే విశ్వాసముతో నుండిరి గనుక, దుష్టప్రవర్తనకు గడంగిన వ్యక్తులను బహిష్కరించిరి. దానికి పాపం! వారికి క్రమశః మనపరిస్థితు లీవిధముగ పరిణమించునని తెలియదు. మనమీరీతి స్వేచ్ఛావిహార మొనర్చెదమని తెలియదు. వారిని మనము పనికిరానివాళ్లని, వారు వ్రాసి మనకొసంగిన గ్రంథములు నిరుపయోగకరములని భావింతుమని, తెలియదు. వారు నియమించి, ఆచరించిన, సాంఘికాచారములకు మంటు గల్పెదమని తెలియదు. మనకీవిదేశ నాగరికతా వ్యామోహ పిశాచావేశముకలుగునని తెలియదు. ప్రతిచిన్న విషయ ములకుకూడ స్త్రీపురుషులీకాలమువారు తమను నానాబూతు లను తిట్టెదరని భావించలేదు. వారొనరించినది మానవక ళ్యాణముకొరకే వారిది విశాలదృష్టి. వారుకుతంత్రులుగారు. స్త్రీజాతిని త్రొక్కిపట్టి గృహకృత్యముల మధ్య బంధించు మార్గమును బోధించలేదు. ఇప్పటివలె పురుషులను దుర్మా ర్గప్రవర్తనకు పాల్పడమని వారాశీర్వదించలేదు. వారు మన కప్పగించినది వెలలేని రత్నాలపేటిక. మనకు దానివిషయమే లేదు. తెఱచిచూచుటకు సాహసములేక, తెలివితేటలులేక, గౌరవములేక దూరదూరములందు మనము మెలగుచున్నం దున ఆరత్నాలపేటికపైన దుమ్ముకూడుకొనినది. మనమా దుమ్మునుచూచి ఏవగించి, నిరర్థకమని దురూహపడుచుంటి మేకాని అందులోగల రత్నముల విలువగ్రహింప పాటుపడు టలేదు. ఇట్లు మెలగుట మనదురదృష్టమా? లేక మనపూ

ర్వాలదా ? లోన రత్నములు భద్రపరుపబడినను, పైభాగము ధూళితో గప్పబడిన పేటికను చూచిమన మేవగించుకొను పరిస్థితులందు, విదేశీయుల ద్వారా పూత మెరుంగులతో నేత్రానందమును గలిగించు గిల్టుపెట్టె మనకు సమకూర్చ బడినది. పై మెరుగును జూచినంతనే మనకు మరులుకలిగినవి. లోనయేముండినను, ఏమిలేకపోయినను పైభాగము గాంచుచు మాత్రమే తబ్బిబ్బులగుచున్నాము. ఈరహస్యమును, ఆత్మజ్ఞానమును బోధించు సదభిప్రాయమనే తాళము చెవిగ నుపయోగించి పెట్టెను పగులగొట్టినాడు మహాత్ముడు. ఇంతగా స్తోత్రపాఠములకు ప్రధానవస్తువైన దానిలో ఏమిలేనందుకు కొందరు దిగ్భ్రమచెంది అటువంక చూచుటయే మానుకొనిరి. అంతటితోనాగక దానినేతి బీరకాయ లక్షణములను తక్కినవారికి బోధించుట మొదలిడిరి. కాని ప్రథమదృష్టికే కన్ను చెదిరినవారిని నమ్మించుట సాధ్యమైనపనియా? ఇంకను కొంతకాలము చెవినిల్లుపెట్టుకొని ఘోషించిననేమైన ఫలితముకలుగునేమో?, మననాగరికతయను పేటికయందేలాటి వెలలేని రత్నములు భద్రపరుపబడినవో, ా టినిగురించి నాయకులెన్ని పర్యాయములో బోధించినారు. గ్రంథకులు వ్రాసినారు. నాకంత సామర్థ్యములేదు గనుక నిరూపించజాలను. కాని వారిప్రబోధములను వినవలసినదిగ మాత్రము ప్రార్థించగలను. నేడు మనము పొరబడి అవలంబించుచున్న క్రొత్తనాగరికత పనికిమాలినదనియు, జాతీయనాగరికత నవలంబించవలసినదనియు ప్రార్థించగలను మనకు గలిగిన వ్యామోహము చెప్పనలవికాదు. కనుకనే

మనము పూర్వులను తిట్టుచుండెదము. వారి ఆదర్శాభి ప్రాయములను చులకనపర్చెదము. ఏజాతియైనను సరే తన నాగరికతనితర ప్రదేశములందేవిధముగనైనను వ్యాప్తి పరచుటకు ప్రయత్నించును. అది సహజము. దానికి మనము లొంగిపోగూడదు. మనవ్యక్తిత్వమును మరచిపోగూడదు. మనము వంశపరంపరగావచ్చుచున్న నాగరికతను త్యజింప గూడదు. ఇతరుల నాగరికతయందుగల మంచినేయెరుకొ నవలయును. ఒక్కసారిగ వంటినిండ పులుముకొనుట పిచ్చి వానిలక్షణము. ప్రతిజాతికొక విధమగు నాగరికతయుండుట తప్పనిసరి. అదిలేనప్పుడు, ఇతరుల నాగరికత నవలంబించు నప్పుడు, అట్టి దౌర్భాగ్యదశయందున్న జాతికి ప్రత్యేకత రూపుమాయును. విదేశ నాగరికత మనదేశము నందెంత వరకు ప్రాకిపోయినదో యెంతచెప్పినను తరుగదు. స్వయ ముగా నీవు చూచుచుంటివి. నీవావిపరీత వ్యామోహ ములో పడకుండ కాపాడుకొనుము. మనపూర్వులు క్రూరు లని కాని, అజ్ఞానులని కాని, దుర్మార్గులని కాని యెన్నడు దురూహపడవలదు. నేడు నీస్నేహితులు చెప్పుకొనినంత నిరర్థకముకాదు, మన నాగరికత. అది సర్వగుణ విశిష్టమని పాశ్చాత్యులు సైతమంగీకరించిరి. ఒకవేళ నీస్నేహితులు నిన్ను గుడ్డిగ సనాతనాచారములను బట్టుకొని ప్రాకులాడు వెఱ్ఱిదానివని వెక్కిరించినను చలింపకుము. దానివలన వారియజ్ఞానమే బయటపడును. ఇంకొక సంగతి. మన పూర్వులు దుర్మార్గులేయనుకొనుము. ఐనను తమ సంతతి వారి పతనమునకు వారెన్నడాశించియుండలేదు. తల్లిదం

డ్రులే ప్రత్యేక విషయములందు దుర్మార్గులైనను తమ సం
తానమున కామనో దౌర్బల్యము ప్రాప్తించనలెసనీకోరరు.
తల్లిదండ్రులే సంతానమున కపకారమొనరించిన నిక
సృష్టియందు ఆదరించువారుండబోరు. నేడు తమ తల్లి దం
డ్రులను దూషించు దుర్మార్గులు స్త్రీ పురుషులందుగలరు.
వారిని గురించి తదుపరి చెప్పగలను.

# ఏడవ మజిలి.



ఇంతవరకు సంఘమునందు స్త్రీలకుగల ప్రత్యేకస్థానము, వారు గృహమునందెట్లు భావింపబడుదురను సంగతి తెలిపియుంటిని. గృహకృత్య నిర్వాహణమునందే జీవితమును గడుపవలసినదిగ నిర్బంధించుటయందు స్త్రీలకు స్వాతంత్ర్యములేదని నేడొక వాదన బయలుదేరినది. దీనినిచట విచారింతము. స్వాతంత్ర్యమంటేయేమి? స్వేచ్ఛావిహారము. అనగా యిష్టమువచ్చినట్లు సంచరించుట. ఎంతవరకీ యిష్టమువచ్చినట్లు సంచరించు భాగ్యము లభించవలెను? స్వాతంత్ర్య మేవిధముగానుండవలెను. మన నాగరికతయందు [సాంఘిక దృష్టిని చూచినచో] స్త్రీలకు స్వాతంత్ర్య మొసగబడినదా? లేదా? ఒసగబడిన నేలాటి స్వాతంత్ర్యము? మనకు ముందుండిన స్త్రీలెంతవరకా స్వాతంత్ర్యము ననుభవించిరి? వారు స్వాతంత్ర్య మనుభవించిరా? లేక నేటి యువతులకు మాత్రమే స్వాతంత్ర్యమనుభవింసవలెనను ఊహా, ఆవేదన పొడమినవా? ఏలాటి స్వాతంత్ర్యము వీరికి కావలయును? ఏవిధమైన స్వాతంత్ర్యము మన దేశ సౌభాగ్యాభివృద్ధికి కారణభూతమగును? మొదలగు ప్రశ్నలుదయించుట సహజము. స్త్రీస్వాతంత్ర్యమునుగూర్చి ముచ్చటించుటకుముందు భారతదేశమునందు హిందువులాచరించు వివాహముల విధానము నాలోచించెదము. వివాహమనిన నొక కన్యను పురుషుని కిచ్చి

జీవితాంతము అతనితో సక్రమమైన పద్ధతులమీద గడుపు నట్లు నియమించుట. వివాహమొక పవిత్ర ధార్మిక బంధము. వివాహమైననాటినుంచి స్త్రీ పురుషవ్యక్తు లిరువురు నేక మౌదురు. బ్రతికియున్నంతవరకు వారట్లు గడుపవలసిన దే. వివాహమొనర్పబడిన స్త్రీ పురుషులకు యుక్తవయస్సు వచ్చిన తదుపరి శరీర సౌఖ్యమనుభవించు అధికారము లభించును. సంభోగము సంతానోత్పత్తి కేయని పూర్వులు నిర్ణయించిరి. సంతానోత్పత్తి వలననే మానవాభివృద్ధి కలుగును. తద్వారా జాత్యభివృద్ధియగును. సంభోగమువలన లాభములున్నను, దానికి రెట్టింపు చెడుగులు కలవు. నిర్ణీతముగ పరిమితిపెట్టుకొని సలిపినసంభోగమునలన లాభములుకలవు. పరిమితి నతిక్రమించినచో అనర్థకములు వాటిల్లును. కామ ప్రకోపము వలన సంభోగ వాంఛకలిగినను, దానిని సలుపు నప్పుడు ధర్మచింత నొనరించవలెను. మనపూర్వులు నిరంతర భగవద్ధ్యాన తత్పరులైనప్పటికి, గృహస్థాశ్రమ స్వీకార మొనరించి యుండిరి. అంతేకాని నియమము లేకుండా, కామాంధులై యిష్టమువచ్చి నప్పుడెల్లసమాగమము నొనరించి యుండలేదు. నియమబద్ధముగ జీవితముగడుపుట యందు వారెంతయో శ్రద్ధవహించిరి. ఇంద్రియ చాపల్యము నణచు కొని కేవలము ధర్మార్థులై మెలగిరి. కనుక వారి దృష్టిలో వివాహితులగు స్త్రీపురుషుల సమావేశము సంతానోత్పత్తి కొరకేయని నిర్ధారింపబడినది. శరీరైక్యతఘటించినప్పుడుస్త్రీ పురుషులు పరస్పర ప్రేమనభివృద్ధిజేసుకొనుట సృష్టిగతము. నిర్మలమగు ప్రేమతో జీవితమును గడుపనేర్చిన భార్యా

భర్తలకు శరీరైక్యతయేగాక ఆత్మైక్యతకూడ ప్రాప్తించును. ఒకరినొకరు గాఢముగా ప్రేమించిన కారణమున పొరపొచ్చెములు లేక ప్రశాంతముగ సంసారమును గడుపుకొనుటకు వీలుగలగదు. ప్రతి జీవికి, బ్రతుకు తెరువు ముఖ్యము. ఆకలిదప్పులు ప్రాణులకు సహజము. ఏకమొనర్పబడిన స్త్రీ పురుషుల జీవనోపాధి జరుగుటకు, దానిభారము పురుషునిపైన వేయబడినది. కాయకష్టములకు పురుషుడు సహించగలడను నమ్మకముతో సంపాదనాభార మతనికి అంటగట్టబడినది. భార్యకభిముఖముగా ఇంటిలోనే కూర్చొనిన పురుషునికి జీవనము గడవదని చెప్పనక్కరలేదు. కాయకష్ట మొనరించిననే కాని భుక్తి గడువదు. కనుక పురుషుడు స్వగృహమును కొన్ని గంటలవరకువీడి, బయటసంచరించి, ఏదోవిధముగ తినుబండారములను సంపాదించుకొనవలెను. ఏదోవిధమనిన, దుర్మార్గవర్తనమువలసనికాదు. ఏదైననొక వృత్తిద్వారా జీవనోపాధిని సంపాదించుకొనవలెను. ఉదరపోషణ ఒకనాటిదికాదు గనుక, జీవితాంతము దానికొరకై ప్రయత్నించుచుండవలెను. కృషిసలుపు పురుషులకు బహిరంగముగ మెలగుట తప్పనిసరి. పురుషుడు తనభారమునేగాక, చేపట్టినభార్యభారమును మోయవలసియుండును. అతనిపొట్టనేగాక, భార్యాపిల్లలకొరకుకూడ ప్రయత్నించవలయును. ఈ నిర్ణయమును మనపూర్వులు యెన్నడో కావించిరి. అదిక్రొత్తదికాదు. నేటికిని పురుషులే సంపాద్యమునకు ప్రాకులాడుచున్నారు. పురుషులందరి జేరీతిగా నేదేని యొకమార్గమనుసరించి జీవనోపాధి సమకూర్చుకొనుటకు ప్రయత్నించెదరు.

గనుక వారిలో వారికి స్నేహభావములు వృద్ధిజెందును. ఒకరికొకరు సహాయముగనుందురు. ఒకరికష్టముల నొకరాదుకొనెదరు. క్రిమశః పురుషుల సంఘీభావము వృద్ధిజెందినది. సంపాదనాభారము వహించినారు గనుక సంఘము నందు వారికి పలుకుబడి కుదిరినది. నాలుగుచోట్లకు వెళ్లి వచ్చేవారు గనుక వారికి స్వేచ్ఛలభించినది. రోజెల్లకష్టపడి, గృహమునకేగి భార్యాపిల్లలతో హాయిగ కాలము గడుపుచుండిరి. వారనుభవించిన కష్టములన్నియు యింటిలో లభించు ప్రశాంత వాతావరణమునందు మరచుచు, పునః మరుసటిదినమెనర్చు శరీర కష్టమునకు సంసిద్ధులగుచుండిరి. ఇక స్త్రీలవిషయమో ? పురుషుల కష్టార్జితమునకు ధర్మకర్తలు స్త్రీలేయనిన సాహసము కానోపదు. పురుషుడు సంపాదించునేగాని, దానిని వినియోగపర్చు మార్గము నెరుగడు. వినియోగార్హత స్త్రీలకొసగబడినది. వారు దానినెటుల వినియోగించినను సమర్థలే. దుర్వినియోగపరచుట సహజముగ స్త్రీలాశించరు. ఏకొద్దిమంది దుర్మార్గప్రవర్తన కలవారోగాని తక్కినవారు సద్వినియోగపర్చెదరనియే నొక్కి చెప్పవచ్చును. కారణము పురుషులెట్లు తమవారో, వారి సంపాద్యముకూడ తమదేనని భావించుకొనెదరు. పోషణకొరకే పురుషులమీద స్త్రీలాధారపడవలసిన యవసరమున్నదనుట పిచ్చిమాట. ప్రతివిషయమునందు పురుషుడెట్లు స్త్రీమీద నాధారపడియుండునో, అటులనే స్త్రీకూడ. ఇరువురి సంబంధము యెడతెగనిది. పురుషునికి సంపాదనాభార నిర్వహణమెట్లు తప్పించుకొనజాలనిదో, స్త్రీలకు గృహ

కృత్యనిర్వహణభారమట్లు తప్పనిసరి. సంపాదించుటకు, గృహకృత్యము లాచరించుటకు పురుషులకే బాధ్యత నంట గట్టిన వీలుకానిపని. కనుకనే సంసారభారమును మనపూర్వులు స్త్రీపురుషులకు సమానముగ పంచియిచ్చిరి. స్త్రీతన పోషణార్థమై పురుషునిమీద నెట్లాధారపడియుండునో, పురుషుడు తనవంశమునృద్ధిపరుగుటకు, కష్టములు మరచిపోవుటకు, ధర్మకార్యములు నెరవేర్చుటకు, సంపాదించిన దానిని సక్రమముగా వినియోగపరచి తనకువలసిన ఆహారము నొసగుటకు స్త్రీమీద నాధారపడియుండును. మనపూర్వులు నిర్ణయించిన పద్ధతులమీద భార్యాభర్తలిరువురు నడచుకొనినచో, స్త్రీ పురుషునిమీద యాధారపడుటకన్న, పురుషుడు స్త్రీమీద నాధారపడుటే యెక్కువ. దుష్ప్రవర్తన కలిగిన పురుషునివలన నతనిభార్యకు కొంపమునుగునంతటి దుర్యశము సంఘమునందు కలుగదు. కాని దుష్ప్రవర్తనకు పాల్పడిన స్త్రీవలన పురుషునిపేరు మంటగలసి పోవును. పురుషునికి వ్యక్తిగతమైన దుర్యశమే లభించును. కాని స్త్రీ వలన పుట్టినింటికి, మెట్టినింటికి దుర్యశము ప్రాప్తించును. భార్యాభర్తలిరువురికి సమాన బాధ్యతకలదు గనుక ఇరువురిలో నేఒక్కరు తప్పుడు త్రోవతొక్కినను మరొకరికి మనస్తాపముకలుగుట సహజము. సజ్జనులెప్పటికి ధర్మవిరుద్ధముగ నడువరు. దుశ్శీలురగువారే దుర్మార్గవర్తనకు పాల్పడెదరు. సృష్టియందు సజ్జనులతోపాటు దుర్జనులుకూడ నుందురు. దానికి మనమేమిచేయలేము. అది వారి ప్రారబ్ధకర్మము ననుసరించి యుండును. దుర్మార్గులగు భర్తలను బడసిన

స్త్రీలు సహనముతో మెలగిన నెంతయో శ్రేయస్కరము. తాలిమిదూలినచో, పురుషులతోబాటి స్త్రీలుకు౦డ నక్రస్వభావము కలిగినవారేయగుదురు. మనమొంతమంది సాధ్వీమణులు భర్తలచేత గారింపబడిన వార్తలునినలేదు? వారి సహనమువలననే మరల భర్తలు సుముఖులుకాలేదు? పురుషునివలె స్త్రీకూడ చిందులు త్రొక్కిన నికవారి సంసార పరిస్థితులవిషయము చెప్పనక్కరలేదు. ఒకకన్నుకు దెబ్బ తగిలి మూసికొని పోయినదిచూచి, రెండవదానినిగూడ బలవంతముగపొడిచి మూతపడవేసినట్లుండును. పురుషుని గౌరవము స్త్రీచేతులలోకలదు. వారు తమగౌరవము కాపాడుకొనుటయేగాక, పురుషుల గౌరవమునుకూడ కాపాడుబాధ్యత వహించవలెను. వారికట్టిశక్తి సృష్టిగతము. దానిని వినియోగపర్చుకొనుటయందే గొప్పదనముకలదు. ప్రేమస్వరూపిణియగు భార్యచేతలో పురుషుడు కీలుబొమ్మగ ప్రవర్తించును. అట్లుమెలగుట స్త్రీకిగాని, పురుషునికిగాని విచారింపవలసిన సంగతిగాదు. మీదు మిక్కిలి గర్వించవలసిన విషయము. సృష్టిలో యెచటచూచినా ప్రేమదేవత తాండవమాడు చుండును. పురుషుడు దుష్ప్రవర్తకుడైనను స్త్రీ అతనిని ప్రేమతో సక్రమమార్గమునకు తీసికొని రాగలదు. ఇట్లుజరుగుట శుద్ధాబద్ధము. మనకీవిషయములో యెన్నో దృష్టాంతరములుకలవు. నేడు దేశస్వాతంత్ర్య సమరమునందు సైతము మహాత్ముడు ప్రేమవలననే శత్రువులను లొంగదీయుమని యెలుగెత్తిచాటుచున్నాడు. శత్రువులనినంతనే ప్రాణములనైన గైకొన సంసిద్ధపడినవారని స్ఫురిం

చును. వారిలో హృదయపరివర్తనము కలిగించుటకు ప్రేమమార్గమును మహాత్ముడు ఆచరించి, సూచించు చున్నప్పుడిక మదించి తాత్కాలికముగ దుష్ప్రవర్తనకు పాల్పడిన భర్తలను స్వాధీనపర్చుకొన లేరా స్త్రీలు? పురుషులు మదించి తిరుగుట, స్త్రీలు వారికి బుద్ధిగరపుట యేమంత కర్మమువచ్చినదని ప్రశ్నింతురు కొందరు. అంతయు సక్రమముగా జరుగుచున్న నిక సహనముతో పనియేమి? క్షమించుట దేనికి? హృదయ పరివర్తనము కలిగించుట దేనికి? అప్పుడు పురుషులు దురాత్మస్టులని భార్యలేవాపోవరు. దురాత్మస్టులగు పురుషుల భార్యలే సహనము చూపించవలసియున్నది. వారే పురుషుల తప్పిదములను క్షమింపవలసియున్నది. వారే తమ భర్తల హృదయములలో మార్పు తేవలసియున్నది. కష్టపరిస్థితులు దాపురించినప్పుడు, సహనము వహించి, విజయము సంపాదించు ప్రయత్నము జరుపవలయును. వేళక్కింత తిని, ఖులాసగా ఆడుకొను పిల్లలకే తల్లియైన మందుపోయునా? చక్కగాచదువుకొని అభివృద్ధికివచ్చు పిల్లవానినే తండ్రియైన శిక్షించునా? లేదు. జబ్బువచ్చినప్పుడాతల్లి తనపిల్లలకు ఔషధమిప్పించును. చదువుకొనకుండ చెడిపోతున్న కుమారునే తండ్రి శిక్షించును. అంతమాత్రమున వారికి శిక్షింపబడు వారిమీద ప్రేమలేకపోలేదు. ప్రేమవలననే; యోగక్షేమములను విచారించియే; అవసరమున్నప్పుడే శిక్షాపద్ధతులకు గడంగెదరు. శిక్షించకుండ, ఏతల్లిదండ్రులైన తమ సంతానమును చెడిపోవు ప్రవర్తనకుంచి, ప్రోత్సహిం

చెడ్డరా? చెడిపోవుచున్నారని వారికి మరింత ప్రోద్బలము కలుగునట్లు తప్పుడు త్రోవలను సూచించెదరా? అట్లున్న టికిన్ని జరుగదు. ఇదేవిధముగ చెడునడతనవలంబించిన పురుషులను స్త్రీలు ప్రేమనుపయోగించి వారి దుశ్చేష్టలను అరికట్టవలయును. చెడిపోవువారితో మనకేమిటని యూరకొనుట సాహసము. కీర్త్యపకీర్తులకొరకు ప్రాకులాడకపోయినను, తమయింటి క్షేమముకొరకైన జోక్యము కలిగించుకొనుట తప్పనిసరి. సంతోషముగ జీవితము నెసరితో గడుప నువ్విళ్లూరెదరో, అట్టివారె చెడిపోవుచుండ మిన్నకుండుటకు మనసొప్పునా? భర్తల దుష్కృత్యములకు రోసిన స్త్రీలు ప్రత్యపకారమునకు దలపడకుండదు. సర్వసాధారణముగ చేపట్టిన పురుషులను స్త్రీలు దండించుట నెచటనులేదు. పాశ్చాత్యదేశములందుసైతము స్త్రీలావిధముగ మెచ్చుమీరరు. వాగ్వాదములు సలిపికాని, సరసముగనుండుట మానుకొనిగాని, తమకోపములను తీర్చుకొనెదరు. వారి నాగరికత ప్రకారము, ప్రభుత్వమువారిచే ప్రసాదించబడిన దివ్యాస్త్రమొండ కలదు. దానినే విడాకులందురు. విడాకుల చట్టముద్వారా భార్యాభర్తలసిపించుకొని, ఒకచోట కొంతకాలము సంసారము గడిపిన స్త్రీపురుషులు, మనస్పర్థలు కలిగినప్పుడు పరస్పర పరిత్యాగమొనర్చుకొనుటకు వీలుగలదు. స్త్రీలకన్న పురుషులు బలిష్టముగనుండుట సహజము. ప్రత్యేకముగ వ్యాయామముచేసి కండలు పెంచుకొని, సంసారముగొడవ లేకుండా స్వేచ్ఛావిహారమొనర్చు స్త్రీసహాల్వానులసంగతి వేరు.

అట్టివారుండవచ్చును. కాని వారిసంఖ్య వేలలో, లక్ష లలో ఒకటి రెండుండును. సాధారణ పరిస్థులందు మెలగు స్త్రీలవిషయమై మనము ముచ్చటించుచుంటిమి. భర్త లకపకారము జేయవలెననే పట్టుదలతో స్త్రీ సలుపగలిగిన దేది? అతనిమనస్సునకు సంతాపము కలిగించుట, గృహకృ త్యములను సక్రమంగా నిర్వహించకుండుట, ధనమును దుర్వి నియోగపర్చుట, నలుగురికి తన భర్త చెడుగుణములను చాటుట మొదలగునవి. వీటివలన పురుషునికి క్రోధము రేకెత్తుట సంభవించును. అసలే దుర్మార్గుడైన భర్తకు, తనభార్య ప్రత్యపకారము సలుపుచున్నదని తెలిసినచో, మరింత దౌష్ట్యమునకు బాల్పడును. ఈవిధముగ స్త్రీ పురుషులిరువురు ఒకరినొకరు అణచివేయ బ్రయత్నించినచో తుదకు బరిణమించునది నిరంతర మనోవేదన, పరిత్యాగము. పరిత్యాగానంతరము సంబంధములేని వారగుదురు. పురు షునికి స్వేచ్ఛాప్రవర్తనలభించును. అతను సంపాదించు కొనును గనుక భుక్తికి లోటుండదు. భార్యలేని లోపము పశువర్తనవలన తీర్చుకొనును. కాని స్త్రీలగతి యేమ గును? భర్తచేత పరిత్యజింపబడిన యువతికి సంఘము సందు గౌరవముండదు. నలుగురు చులకనగ జూతురు. పరిత్యక్త అనిపిలుతురు. పుట్టింటనైన తలదాచుకొనుటకు వీలుండదు. కన్నతల్లిదండ్రులునైతము తమ మర్యాద కాపాడుకొనుటకు చిరకాలము పుత్రికలనింటనుంచుకొనరు. అందులో యిల్లు వెడలనంపిన పుత్రిక నసలే చేరదీయరు. ప్రత్యపకారభావమున దుర్మార్గప్రవర్తనకు గడంగినందువ

లన, ఆమెకు భర్తృగృహములో చోటులభింపదు. పుట్టింటికి, మెట్టినింటికి దూరమైన స్త్రీగతి యేమికావలయును ? నిరాశజనించి, న్యాయాన్యాయములను విడచి, ధర్మమును విసర్జించి, తన మనస్సుకు తోచిన ప్రకారము నిర్లజ్జయై, మానభంగమునకైన వెనుదీయదు. యౌవనములో నున్న దగుచో; స్వైరవిహారమునకు గడంగును. దుర్యశము గడించును, నలుగురి యనాదరణకు గురియగును. అనాదరింపబడినకొలది ఆమెలో ఈర్ష్యఇనుమడించును. ఎవరిని లెక్కచేయకుండ, శరీరారోగ్యము చెడిపోగలదనే చింతలేకుండ విపరీతముగ సంచరించును. ఈవిధముగ తయారయిన స్త్రీ బ్రతికియున్నను చచ్చినదానితో సమానమే. ఆమెకు తన ప్రాణముమీద తీపియున్నప్పటికిని, సంఘమున కామెయోగక్షేమముల నవసరము గనుక బ్రతికియున్నను చచ్చిన దానితో సమానమని చెప్పితిని. అట్టి స్త్రీని సంఘము వెలివేయును; వంశపారంపర్యముగ కుటిలవృత్తికి గడంగిన వారిల్లో జతపడును. ఈవిషమ పరిస్థితికి కారణమేమి ? భర్తృ దౌష్ట్యమా ? లేక ప్రత్యపకారమును దలంచి నీతివిరుద్ధముగ ప్రవర్తించిన భార్యలోపమా ? ప్రత్యపకారమునకు గడంగుటకు కారణము పురుషుని దౌష్ట్యమే. ఐనను పురుషుని దౌష్ట్యము అతనినేకాకుండ, అతనిభార్యనుగూడ నాశనమొందించగలదు. భర్తయొక్క దౌష్ట్యమును చూచి సహనమున మెలగిన స్త్రీలకట్టి అగచాట్లురావు. పైపై నెట్టి కలహములు సంభవించినను గృహమునందు మాత్రము తుపాను చెలరేగకుండ నరికట్టును. సహనవతియగు స్త్రీని

రాపాడు పురుషునిచూచి సంఘముతీవ్రముగ విమర్శించును. అతనికేలాటి కీర్తి నిలువబోదు. లెక్కచేయకుండ ప్రవర్తించు పురుషునికధోగతి ప్రాప్తించును. పురుషుడు దుర్మార్గమునకు గడంగినను స్త్రీ అతనిని అనుకరించకూడదు. ఇదంతయు పురుషుల వెనుకవేసుకొని వచ్చుటకాదు. స్త్రీలు తమ మర్యాద కాపాడుకొని యేవిధముగ సంసారమును గుట్టుగ నడుపుకోగలరనే విషయమును మాత్రమే విపులీకరించితిని. ప్రత్యపకారమునకు బాల్పడిన స్త్రీసంతానవతియగుచో, కలుగు అనర్థకము ఘోరముగనుండును. ఆమె భర్తనుండి వేఱయినచో, పురుషుని ఆస్తియందు తనకు జన్మించిన సంతానమునకు హక్కులభించును. స్త్రీ సంతానముండిననంతగ హానిజఱుగదు. కాని పురుషసంతానమైనచో, పురుషుని ఆస్తి తప్పక సంక్రమించును. మగబిడ్డలకొఱకైన స్త్రీ సంసార పరిత్యాగమొనరింపకూడదు. సంసారమునువీడి, భర్తతో సంబంధము త్రెంచుకొని, విపరీత ప్రవర్తనకుదిగి, తన కొడుకుకు భర్త ఆస్తి సంక్రమింపవలెనని పోరాడు స్త్రీ నిజముగ సాహసురాలు. తుపాకిని మొలలోదాచుకొని, అవసరముకలిగినప్పుడుపయోగింప నిశ్చయించి, ప్రత్యపకారమునకు గడంగి, నిరాయుధుడగు ప్రత్యర్థితో డీకొను కుటిల స్వభావుని కుతంత్రమువలెనుండును. ఎట్టిదుర్మార్గుడైనప్పటికి, స్త్రీ పురుషుని తనప్రేమతో, సహనముతో, లొంగదీసికొనగలదు. కనుకనే ఆమెను 'ప్రేమమయి' అని గౌరవించెదరు. ప్రేమ, సహనము, క్షమ మొదలగు ఉత్తమగుణములను పరిత్య

జించి, ప్రత్యపకారమునకే గడంగు స్త్రీలను మన మేమన లేముగదా! వారిజోలికి వెళ్లకుండుటయే మంచిది!! దూర మునుండియే ఒకనమస్కారము పారవేసి ఉత్తమస్త్రీలవిష యమై ఆలోచించెదముగాక!!!



# ఎనిమిదవ మజిలి.



నేటి మనసంఘ పరిస్థితులు సక్రమముగ లేవు. "అరయంగా కర్ణుండీల్గె నార్గురిచేతన్" అన్నట్లు అనేక విధముల మనసంఘపరిస్థితులు విషమించినవి. కాని నా దృష్టిలో ఈవిషాదావస్థకు మూలకారణముపాశ్చాత్య నాగరికతను గ్రుడ్డిగా అనుకరించుటయే! భారతీయ నాగరికతను సరిగా అర్థముజేసికొని మెలగక పోవుటయే!! విదేశనాగరికతను మోజుకలిగి అవలంభించువారు కొందఱు, అట్టివారి ననుకరించువారు కొందఱు, దేశమందంతటనుగలరు. మోజుపడి విదేశనాగరికత నవలంభించువారు, తాము విదేశీయులలో మెలఁగి వారి ఆచారములను మెచ్చుకొని, అదే ప్రకారము మెలఁగ నిశ్చయించుకొనిన మేధావంతులు. ఇఁక పూర్తిగ విద్యాగంధము లేనివారు, లేక నానాకాలపు చదువుచదివి పూర్ణప్రజ్ఞులమనుకొని ఆర్భాటముచేయువారు, పై రకపు మేధావంతులను గ్రుడ్డిగ ననుకరించుచుందురు. ఈమోజుగాని, అనుకరణగాని, వ్యక్తిగతమైనమాట నిజమైనను, అవి క్రమశః నాగజెముడు పురుగువలె తొలుత పట్టణములందు, పిదప బస్తీలయందు, తరువాత, యిప్పుడిప్పుడు, గ్రామములందు విపరీతముగా వ్యాపించి భారతీయ నాగరికతావృక్షముయొక్క తల్లి వేఱును నాశనమొనరించుచున్నది. ఏసంసారమునందు జూచినను యీవెఱ్ఱి ఊహలు, ఉత్సాహము చెలరేగుచున్నవి. భార్యాభర్త లిరువురు

పాశ్చాత్య నాగరికతా వ్యామోహితులైనచో చిక్కులేదు. కాని భార్యకో, భర్తకో, వ్యామోహాముండినచో మన స్పర్ధలు తప్పవు.

సంసారము సక్రమముగ నడుపుటకు స్త్రీ పురుషులు సమానముగ బాధ్యతవహింపవలసినవారే గనుక, వారి లోపములను శిక్షించుటలోగాని, మన్నించుటలోగాని, ఇరువురు సంఘదృష్టిలో సమానబాధ్యత వహించవలెననుట నిర్వివాదాంశము. కాని నేటి సంఘమందట్లు భావింపబడుటలేదు. అదిమువ్మాటికి శోచనీయమే! సంఘమే జీర్ణావస్థలోనున్నప్పుడిక సమానభావమెట్లు సంభవమగును? తప్పును శిక్షించుటలో స్త్రీ పురుష తారతమ్యమును దృష్టియందుంచుకొని పురుషులయెడ పక్షపాతము వహించుట సంఘమున కిటీవల పరిపాటియైనది. పురుషులెంత దుర్మార్గులైనను, సంఘము వారిని దూరునేగాని చెలరేగకుండ నణచివేయు ప్రయత్నములు సలుపుటలేదు. స్త్రీలను మాత్రము చిన్నచిన్న తప్పిదములకైనను తూర్పారబట్టుచుండిరి. దీనివలన స్త్రీలు సంఘమందు తమకన్యాయము జరిగినదని ఎదురుతిరుగుచున్నారు. సంఘమందు స్వార్థపరుల ఘూటు చలాయించుచున్నందున, వారి న్యాయమైన ప్రతి ఘటనను వేఱువిధముగ గ్రహించి అణగగొట్టుచుండిరి. అణగగొట్టబడినకొలది, స్త్రీలయందు క్రోధము, ప్రత్యపకారభావము, స్వార్థము, అనాదరణ జనించినవి. వారు బహిరంగముగ తమకన్యాయము జఱుగుచున్నదని చాటుచున్నారు. వారి తిరుగుబాటును — తిరుగుబాటని

నిష్పక్షపాత బుద్ధినాలోచించువారు స్త్రీల ప్రచారమును చెప్పజాలరని నానమ్మకము – అణచుటకు సంఘనాయకులు ప్రయత్నించుచున్నారేగాని, న్యాయదృష్టితో వారికష్టసుఖములను విచారించుట లేదు.

ఏదైన నొక తప్పిదమొనర్చుటలో సమాన బాధ్యత వహించిన ఇరువురు వ్యక్తులలో నొకరు శిక్షింపఁబడి, మఱొకరు విడిపింపబడుట న్యాయమేనా? శిక్షింపబడినవానికి ఆవేదన కొండు. సమానముగ తప్పిదముజేసిన తనతోడి వాడిని విడుదలచేసి, తననుమాత్రము శిక్షించుట ఏటిన్యాయమని మొఱపెట్టుకొనిన దోషమా? అపరాధమా? తిరుగుబాటా? అన్యాయముగ శిక్షింపబడినవాడు శిక్షానంతరము, మొదటతప్పుచేయలేదుకనుక, సక్రమముగనే ప్రవర్తించును. కాని న్యాయవిచారణయందు లోపము జరిగినట్లు స్ఫురింపక పోవునా? న్యాయాన్యాయవిచక్షణ జరుపునప్పుడు, పక్షపాత బుద్ధితో అపరాధిని విడుదలచేసినచో, వాడు సక్రమముగ బ్రవర్తింపగలడా? న్యాయమే వానికనవసరము. అట్టి మనోప్రవృత్తిగలవాని చర్యలవలన శాంతిభద్రతలకు హాని చేకూరును. కనుక స్త్రీ పురుషులను, వారుచేసిన తప్పిదములను, శిక్షించునప్పుడు పక్షపాతముండరాదు.

నిష్పక్షపాతబుద్ధితో బ్రవర్తించు సజ్జనులు సంఘాధికారమును గ్రహించినచో నేడు ప్రాప్తించిన హీనదశ సంఘమునకు మున్దెన్నఁడు రానేరదు.

సంఘమునందు తమకన్యాయము జఱుగుచున్నదని ఎఱిఁగిన స్త్రీలు దానిజోలికి పోకుండగనే, దాని అవసరము

లేకుండానే, సర్దుకొని పోగల మార్గములు కలవు. పురుషుని దౌష్ట్యమునకు దగినశిక్ష సంఘము విధించనిచో, అతనిని మందలించి సక్రమమార్గమునకు దీసికొని రావలసిన బాధ్యత స్త్రీలువహించవలెను. అసలు శిక్షార్హు లెవరు? దోషులే కదా! దోషులను సక్రమ ప్రవర్తన గలవారిగ నొనరించుటకే శిక్షవిధింపబడును. శిక్షవలన గలుగులాభమిదియే. దొంగతనము చేసినవానికి న్యాయాధికారి శిక్షవిధించునది దేనికి? ముందెప్పుడు దొంగతనమును జేయకుండుటకేగదా! శిక్షానంతరము తిరిగిదొంగతనమునకే దిగునట్టివ్యక్తి నెన్ని సార్లు శిక్షించినను లాభములేదు. దొంగకు లేకబోయినను, శిక్షాధికారికి సిగ్గుడుండవలెను. లేనిచో, దొంగకు శిక్ష ఒక మామూలు కృత్యమువలెగన్పడును. దొంగతనము నొనరించుచున్నప్పుడు ఇంటివారు మేల్కొనినచో, దొంగపలాయనమగును. వాని ఆటసాగదు. ఎచట ప్రమత్తతోనుండెదరో, ఆయింటనే దొంగకన్నమును త్రవ్వుటకు సాహసించును. దొంగతనమేల జఱుగును? దానికి దిగువాడు మాత్రము మానవుడుకాడా? కానివానికి తిండికిలేనప్పుడు ఆవృత్తికిదిగును. దొంగను శిక్షించుటకన్న, వానికాహారములభించు ఏర్పాట్లు గావించిన చాలలాభము కలుగగలదు. ఒకని కన్నదానము చేసిన సుకృతములభించును. దొంగతనమును మాన్పిన కీర్తిప్రాప్తించును. అట్లనే దుర్మార్గమునకు గడంగిన పురుషులను సంఘము శిక్షించకుండ మిన్నకుండుటజూచి సహించక వారిని శిక్షించునట్లు చేయుటకుబదులు, వారిదౌష్ట్యమునకు రెట్టింపు ప్రేమను స్త్రీలుచూపించవలెను. అప్పుడు పురుషుల

చొప్పమరికట్టబడును. ఇట్లాచరింపనగునా? అనుప్రశ్నను బయలుదేర తీయకుండ ప్రయత్నించి చూడవచ్చును. తమ ప్రేమవలననే స్త్రీలు పురుషులను స్వాధీనపఱచుకొనగలుగుదురు. ఈవిషయములోఁగా ఎన్నిపర్యాయములు చెప్పినను, దానివిలువ ఈషణ్మాత్రమేని తగ్గదు. చర్వితచర్వణ దోషము పట్టదు.

'అపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాఁడు నేర్పరిసుమతీ!'

అని ఉండనే ఉన్నది సమాధానము!

పురుషులు శిక్షింపబడుటలేదని సాహసమునకు దిగి స్త్రీలు ప్రత్యపకారమునకును గడంగరాదని నావిన్నపము. క్రొత్తగ కాపురమునకేగు నా అనుంగు సోదరీమణులకిదొక సందేశము. సాధారణముగ అన్నలయందు చెల్లెండ్రకు ప్రేమయెక్కువని నానిశ్చయము. అక్కాచెల్లెండ్రకన్న, అన్నాచెల్లెండ్రప్రేమ నిశ్చలము. దానిననుభవించి తీరవలసినదేకాని వర్ణింపనలవికాదు. ఇట్టి సదభిప్రాయముతో నా ఆంధ్రసోదరీమణులకీ పుస్తకముద్వారా వినతిపత్రము నంపుచున్నాను. స్వసౌఖ్యమాశించిగాని, నాయందు సోదరప్రేమ వహించిగాని యుచితరీతిని వారు మెలగెదరని నాఅభీష్టము.

సోదరీ! యోగ్యశీలా! నీయందు నాకు చాలవిశ్వాసము కలదు. నీవు నాసలహాను త్రోసిపుచ్చెదవని నమ్మను. చెల్లెలివగుటచేత నీవాదర్శజీవితమును గడిపెదవని, తక్కువవారికి మార్గదర్శిని వయ్యెదవని, మనహిందూ గృహధర్మ రహస్యసారమును గ్రహించి, తదనుగుణముగ మెలిగి, కీర్తి

గాంచెదవని నా ఆశయము. నీవొక్కదానివైనను, నేను చెప్పుదానిలోగల మంచినిగ్రహించ గలిగినచో బ్రహ్మా నందము ననుభవించెదనని వేఱుగ చెప్పవలయునా? సంసార నిర్వాహణమునందు భార్యాభర్తలకు సమాన బాధ్యత కల దని నీవిప్పటికి గ్రహించియే యుందువు. సమాన బాధ్యత వహించువ్యక్తులకు పరస్పర గౌరవబాధ్యత లుండితీరును. పురుషుడులేని స్త్రీవలనకాని, స్త్రీలేని పురుషునివలన సంసార శకటమొక్క అడుగైన ముందుకుసాగదు. భార్యగతించిన వెనుక పురుషునివలన కలుగు లాభమేమియులేదు. ఎవరి బాధ్యతవారెరిగి నడువవలయును పోషణాభారము వహించుట పురుషునికెంత ముఖ్యమో, గృహకృత్య నిర్వాహణ భార మును తలదాల్చుట స్త్రీలకంతముఖ్యము. ఇరువురి సహ కారముతోనే జరుగవలసిన సంసారశకట ప్రయాణము, ఒకరులోపించిన జరుగగలదా? అసంభవము. తుదకు శరీర సౌఖ్యమాశించియైన స్త్రీపురుషులకు పరస్పర సంబంధమత్యా వసరము. వివాహమువలన ధర్మబద్ధమైన పరస్పర సంబం ధము స్త్రీపురుషులకబ్బును. ధర్మబద్ధులుకాని స్త్రీపురుషుల సంబంధమె వ్యభిచారమనబడును. ఈవ్యభిచారము ధార్మిక దృష్టిలో మహాదోషమెగాక పెక్కు అనర్థదాయకముగూడ కనకనే మనపూర్వులు దానిని తీవ్రముగ ఖండించిరి. ఒక కంపినీకిరువురు భాగస్వాము లున్నారనుకొనుము. వారిరు వురి సహకారముమీదనె కంపినీయొక్క పురోభివృద్ధి ఆధార పడియుండును. ఇరువురిలో కలహముసంభవించిన కంపిని దివాలతీయును. ఇరువురు సమానముగ పాటుపడవలయును.

ఒకరు శ్రద్ధచేసినను వేరొకరు శ్రద్ధతో పనిచేయవలయును. వారికిలేనిది నాకెందుకని యూరకున్నచో యేమికాగలదో నీవే యెరుగగలవు. సంసారవిషయము గూడనంతే. మత గ్రంథములలోనుంచిగాని, పురాణములలోనుంచికాని నాకు గావలసిన ఆధారములు గ్రహించి నీకు వినిపించగలను. నాకు యిష్టములేదు. నీవు చిన్నదానివి. ఆధారములను గ్రహించియే చెప్పదలచుకొన్న నింతవిపులముగా వ్రాయక నే పోవుదును. చిన్న చిన్న ఉదాహరణముల ద్వారా చక్కగా తెలియపర్చినచో, త్వరగా నీవు నేను చెప్పు దానిని ఆకళింపుచేసుకొనగలవు. నేను చెప్పునది నీకు నచ్చునో లేదో అను దిగులు నాకు లేదు. నేను చేయుచున్న పని సక్రమమైనదేనని నా అంతరాత్మ ప్రబోధించుచున్నది. నీవే కాకుండ తక్కిన చెల్లెండ్రకుకూడ దీనిని వ్రాయుచున్నాను. వారి అభిరుచులనుకూడ దృష్టిలోనుంచుకొనక తప్పదు. కంపినీ భాగస్వాములవలె భార్యాభర్తలు సంసారనిర్వహణ మునందు సమానభాగము పంచుకొనవలెను. సంసారము నందలి కష్టసుఖములను సమానముగ ననుభవించవలెను. ఇరువురిలో స్వార్థత్యాగముండవలయును. ఒకరినొకరు మోసగించుదామనే దురభిప్రాయముండకూడదు. పోషణ భారము వహించుటవలన పురుషునికి కొమ్ములు మొలచుట జరుగదు. గృహమును చక్కదిద్దుటవలన స్త్రీకి గౌరవ హానియు జరుగదు. గౌరవము కలిగినచో యిరువురు తమ తమ విధ్యుక్త ధర్మములను నెరవేర్చుటవలననే. సంసార మును సక్రమముగా జరుపు పవిత్ర కార్యమునందిరువురు

సమానబాధ్యత వహించుచున్నామనియు, ఇరువురి సహకార మత్యావసరమనియు ఏభార్యాభర్తలు గ్రహించి మెలగెదరో వారి జీవితములు ధన్యములు. వారికీర్తి అపారము. వారి ఆనందము మేరలేనిది. వారి హృదయములు పవిత్రములు. వారివలననే నివసించు గ్రామమునకు, సంఘమునకు, దేశమునకు, జాతికి గౌరవము కలుగును. వారి ప్రవర్తనయే జాతికళ్యాణమునకు చలించని పునాది. అందరల్లే మెలిగిన నిక చెప్పవలయునా? గృహస్థాశ్రమ స్వీకరణ భాగ్యము లభించుటకు, ధర్మకార్యములాచరించుటకు, ప్రేమదేవతా రాధన గావించుటకు, వంశాభివృద్ధియగుటకు, సద్యశము లభించుటకు భార్యవలననే వీలుకలదని నమ్మి పురుషుడామెను గౌరవించవలయును. భర్తతోడిదే లోకమని పెద్దలు అనుభవముతో చెప్పిన ప్రకారము, స్త్రీకి పురుషునివలననే సంతానము కలుగుటకు, సతీత్వము నిలబెట్టుకొనుటకు, పాతివ్రత్యమహాత్మ్యమును ఆచరణద్వారా ప్రదర్శించుటకు, సత్కీర్తి గడించుటకు వీలుండును. గనుక అతనిని గౌరవించవలయును. ఈవిధముగా పరస్పర ప్రేమ గౌరవములభివృద్ధి జెందుచుండిననేగాని సంసారములందు శాంతి లభింపదు. కాని నేడు ప్రతి సంసారమునందు అశాంతియే గాన్పించుచున్నది. దీనికి కారణము భార్యయనిన భర్తలెక్కచేయకుండా తానేగొప్పయని విఱ్ఱవీగుట, భర్తయనిన తన గుప్పిటలో మెలగవలసిన వ్యక్తియని భార్య పొరబడుట. ఒకరినొకరు చులకనగ జూచుకొనుట వలన కలుగు ఫలితము మనస్పర్ధలు తప్ప వేరేమియు లేదు.

భార్యాభర్తలిరువురు పరస్పరము హృదయ ప్రవృత్తి నెరిగి వర్తించవలెను; ఏయేపనులవలన భర్తకు కోపమోగ అభిమానముకలుగునో, ఆరహస్యమును గ్రహించి తదనుగుణ్యముగ మెలగవలెను. భార్యకుగల అభీష్టములను భర్త నెరవేర్చవలెను. అభీష్టములకుకూడ హద్దుగలదు. తన యిష్టమువచ్చినట్లు భార్య మెలగవలయునని భర్త యెన్నడు తలచకూడదు. ఆమెకు హృదయమున్నదని, వ్యక్తిత్వము గలదని యెరుగవలెను. స్వాభిమానమును ఛీడవలసినదిగ భర్తరాపాడగూడదు. స్వాతిశయముగల స్త్రీని గౌరవించుట అగ్నిలో ఆజ్యము పోసినట్లగును, గౌరవించినకొలది అణకువతో ప్రవర్తించు సాధ్విని శిరసావహించిన గౌరవలోపముకాదు. స్త్రీలమనస్తత్వమును గ్రహించుట బ్రహ్మదేవునికైన తరముగాదని యొకవాడుక కలదు. అందరి స్త్రీలకీ రిమార్కు వర్తించునా ? అని సందేహము. కపటవర్తనము కలిగి చేబట్టిన భర్తలను మోసగించు స్త్రీల మనస్తత్వము నెరుగుటంతసాధ్యము కాని మాట వాస్తవమే! భర్తల సాన్నిధ్యమున నేమియెరుగని ముద్దరాలురీతిమెలిగి, అతనింటలేనప్పుడు దుర్మార్గమునకు బాల్పడు స్త్రీహృదయము నెరుగ వీలుకలదా ? ఈఅభిప్రాయముతో మనపూర్వులు కులటల మనస్తత్వమును గ్రహించుట చేతకాని పనియని చెప్పియుండవచ్చును. అటులకానిచో సాధ్వీమణులను వారేల ప్రశంసించియుందురు? క్రమశః వారి యభిప్రాయమునకు వ్యతిరేకముగ ప్రచారము సాగజొచ్చినది. నేడు

స్త్రీలవిషయమై ప్రసంగించునప్పుడు వారిని నమ్మరాదను విమర్శన గణనకెక్కినది. ఇది చాల అన్యాయము. ప్రతి చోట తమను నిష్కారణముగ నవమానపరచుట సహింప లేకపోయినది స్త్రీజాతి. ప్రత్యుత్తర మొసగదలచి మగ వారియందు విశ్వాసముంచుట వీలులేని పనియని ప్రచార మొనర్చుచున్నారు. ఏసినిమాలో చూచినను, యీవిష యమునకే ప్రాధాన్య మొసగబడినది. పాటలు, పద్యములు, కథలు తయారయినవి. అన్నెము పున్నెము ఎరుగని యువతులు మనస్పర్థలను పెంచుకొనుట జరుగుచున్నది. 'మగవారిని నమ్మరాదే చెలీ' అను పాట మన తెలుగు సినిమాలలో పాడబడిన దందరికి తెలియును. ఇది దుష్ప్ర చారముకాక మరేమి? స్త్రీలందరు నమ్మదగినవారెట్లు కారో, పురుషులునంతే—స్త్రీలలో సాధ్వీమణులు కలరు. పురుషులలోను విశ్వాసపాత్రులు కలరు. ప్రతిచిన్నపనులలో కూడ తాము పట్టిన పంతము నెగ్గనప్పుడు భర్తలను 'మీ మగవారిని నమ్మకూడదని ఎందుకన్నారు' అని భార్యలు విమర్శింతురు. ధనలోపముగాని, నెరవేర్పవల సిన యవసరము లేమిగాని, జరుప వీలుకానప్పుడుకాని, తమ కోరికలను మన్నించమాత్రముననే, భర్తలను దూరుట సాహసము. అనవసరముగ మాట్లాడకుండ, దుర్వ్యయము సలుపకుండ, సాధ్యమైనంతవరకు ఇతరుల మనస్సులకు కష్టము గలిగించకుండ, పవిత్రభావములతో ఆదర్శ జీవితములను గడుప నాశించు పురుషుడొకడున్నాడనుకొనుము. వాని

హృదయమును గ్రహింపజాలని, లేక గ్రహించియు లెక్క చేయని, భార్య వదరుబోతుదనమునకుఁ బాల్పడికాని, దుర్వ్యయము సలిపికాని, ఇతరులమీద కొండెములు చెప్పి వారు కష్టపడుచున్నప్పుడు సంతోషించుటకాని, జూచి నోరు మూసికొనగ సాధ్యమగునా ? వెంటనే ఆమె భర్త జోక్య ముకలిగించుకొనును. వద్దని మందలించును. అంతమాత్ర మున నామె స్వాతంత్ర్యమునకు భంగమువాటిల్లునా ? లేదు. చక్కని సలహాలనొసంగు భర్తలను గౌరవించుటకు బదులు మలకనపర్చుట సాహసముకాదా ? చిన్నవిషయములం దెన్నడు భార్యాభర్తలు వివాదములు సలుపకూడదు. సర్దు కొని పోవలెను. అట్లులేని నాఁడిరువురికి మనస్పర్ధలు కలిగి జీవితము ప్రశాంతముగ జరుగనేరదు. భర్తలు తమ భార్యలకోర్కెలను సాధ్యమైనంతవరకు సరళ హృదయ ముతో నెరవేర్చుచుండవలెను. శీలము విషయమందుకాని జీవితాదర్శమునకు భంగము వాటిల్లినప్పుడుగాని, యొకరి నొకరు విమర్శించుట సహజము. విమర్శించునప్పుడుకూడ సౌమ్యముగ మెలగవలెను. ఎవరియందు లోపమున్నను, వెంటనే గ్రహించి సక్రమముగ నడుచుకొనుటకు ప్రయ త్నించవలెను. సాధారణముగ పురుషులు స్త్రీలకన్న అను భవముకలవారై యుందురు. తెలివితేట లిరువురికి సమా నముగ నుండవచ్చును; విజ్ఞానము సంపాదించుట కిరువురు సమానముగ కృషిసలుపవచ్చును; కాని అనుభవమునందు మాత్రము పురుషులగ్రస్థానము వహించగలరు. దీనికి కార

ణము లేకపోలేదు. స్త్రీలకన్న, పురుషులకు ప్రపంచముతో ఎక్కువ సంబంధముండును. వారెప్పటికి జీవనోపాధిని ఆర్జించుటకు ప్రయత్నింతురు. గనుక వారికెంతమందితోనో సంబంధమేర్పడును. ఒకరికొకరి కష్టసుఖములు తెలియును. పురుషులకుగల కష్టసుఖములేవి ? జీవనోపాధి విషయమై ప్రతివానికి కష్టసుఖము లుండియేయుండును. అవిగాక గృహ సంబంధములైన కష్టసుఖములుండుట సహజము. నిత్యము కలిసిమెలిసి పాటుబడువారియందు సంఘీభావమేర్పడుట గొప్పకాదు. పరిచయస్థుల మధ్య రహస్య ప్రసంగము జరుగుచుండును. అందరి కష్టసుఖములొకే తీరుననుండవు. కనుక నొకరివి ఇతరులకు క్రొత్తగదోచును. ఇతరుల గృహపరిస్థితులను, వాటిని సద్దుకొనిపోయిన మార్గములను వినుటవలన పురుషునికి అనుభవము కలుగుచుండును. స్త్రీలలోనుగూడ ఒకరి కష్టసుఖము లొకరికి చెప్పకొని, ఉపాయములన్వేషించుట జరుగుచుండును. కాని ప్రస్తుత సాంఘిక పరిస్థితులనుబట్టి పురుషులకున్నంత బహిరంగ ప్రచారము స్త్రీలకు లేదు. గనుక, పురుషులకే ఎక్కువ అనుభవముండును. ఇతరుల గృహసమాచారములను వినుచుండుటవలననేనా అనుభవము సంపాదించుటకు వీలగునని ప్రశ్నించవచ్చును. గృహవిషయములందు మాత్రమే అనుభవము కలుగును. అంతేగాని ప్రపంచమునందు జరుగు వివిధములైన సమాచారము లెరుగుటకు వీలుపడదు. ప్రపంచ సంఘటన లెరుంగుటకు విద్యముఖ్యావసరము.

విద్యలేనివానికి లోకజ్ఞానమే లేదని చెప్పవచ్చును, విద్యా వంతునకబ్బు విజ్ఞాన మపారము. ఈ 'అపార' శబ్దమునందు విశాలమైన అర్థముకలదు. విద్యాభివృద్ధికి గడించినకొలది, తద్వారాలభించు విజ్ఞానము పెరుగుచుండును. పురుషులకు విద్యోపార్జనకు గడంగుట కెన్నియొ సదుపాయములు లభించినవి.

# తొమ్మిదవ మజిలీ.

మానవత్వము నిలబెట్టుకొనినవాడే మానవుడనని చెప్పుకొనుటకు, నలుగురిచేత పిలిపించుకొనుట కష్టము. దానిని పోగొట్టుకొనినవాడు పశుత్వము ఆపాదించును. ఈలాటి పశుతుల్యు లెందరో కలరు ప్రతిదేశమునందు. వారికి పూర్వ సాంప్రదాయములనినగాని, వంశానుగతముగ వచ్చు ఆచారములనినగాని, ఈశ్వరారాధన మనినగాని, వేదమంత్రోచ్చారణయనినగాని, ధర్మకార్య నిర్వాహణ మనినగాని, విషపానమొనర్చినంత వెగటు. వారి దృష్టిలో అది నవీననాగరికత కాదు. వారికది 'ఫేషనబుల్'గా గనిపించదు. వారి ఆలోచన లెంతసేపటికి దేహసౌఖ్యమనుభవించుటయందే నిమగ్నమైయుండును. దేహసౌఖ్యవర్జితు లుండుట [illegible]. అట్టివారికి బ్రహ్మచర్యమే ముఖ్యము కాని సాధారణ మానవులకట్టి మనోనిబ్బరముండుట కష్టము. వారికి విషయలాలసత మెండుగానుండును. గృహస్థాశ్రమ విధులను సక్రమముగ నెరవేర్చుచు, శీలమును కాపాడుకొనుచు, దుర్మార్గప్రవర్తనకు గడంగక, దేహసౌఖ్యములనుభవించుటకు ప్రతిగృహస్థునికి హక్కుగలదు. ఆ హక్కులను దుర్వినియోగపర్చుట మహాపాపము. అక్రమమార్గప్రవర్తకులకు పాపపుణ్యముల వివక్షతతో పనిలేదు. బుద్ధికెంతతోచిన నంతే. ఇతరులసలహాలను తృణీకరింతురు. చెడు

కార్యములను చేసినపాపము, మంచికార్యములను చేసిన పుణ్యముకలుగునని ప్రతివానికి తెలియును. ఆచరించు కార్యములందెంతవరకు మంచిచెడ్డలుకలవో ఆలోచించి ప్రవర్తించుటయే విజ్ఞానము. చెడ్డపనులేవియో మనపూర్వులు నిర్వచించియేయుండిరి. వ్యభిచారము, దొంగతనము, అసత్య ప్రలాపము, జీవహింస మొదలగునవి చెడుకార్యములనియు, భగవదారాధన, సత్యవాక్య పరిపాలనము మొదలగునవి సత్కార్యములనియు, పెద్దలువచింతురు. సత్కార్యాచరణ మునకన్న అక్రమప్రవర్తనకు గడంగుట చాలసులభము. యౌవనము ప్రాప్తించినతరువాత ప్రతివానికి కామేచ్ఛ యుండుట సహజము. ఒకరికి యెక్కువగా, మరియొకరికి తక్కువగా కామేచ్ఛయుండు ననుకొనుట పొరబాటు. ప్రాణులన్నియు ప్రకృతి గర్భమున నుద్భవించినవే. వాటికి సమానముగ పంచభూత సంబంధముండును. నిర్ణీతమైన వయస్సునకే కామేచ్ఛకలుగును. ఇకతారతమ్య మెచట నుండివచ్చును ? కాని ఈతారతమ్యము సృష్టిగతముగాక, వ్యక్తిగతముగానుండును. పూర్వజన్మ పరిపాకమువలన నేమి చిన్నతనమున ఒసగబడిన క్రమశిక్షణవలన నేమి, చేసినసావాసదోషమున నేమి, నేర్చుకొనిన విద్యాప్రభావమున నేమి, కొందఱు దౌష్ట్యమునకే ప్రాధాన్యమిత్తురు. వారికిన్యాయాన్యాయములతో పనిలేదు. కొందరు సజ్జన లక్షణముల నలవరచుకొనుటకు ప్రయత్నింతురు. నిరంతర విషయసౌఖ్యలోలునికి కామేచ్ఛయెక్కువగా నుండక యేమగును? యౌవనారంభమైనప్పటినుండి విషయసౌఖ్యములనే కాంక్షించు

వ్యక్తికి సచ్ఛీల మెట్లలవడును? అతని కెప్పుడాలాటి భావములే కలుగుచుండును గనుక, వాటియొత్తిడికి తట్టుకొనలేక ధర్మాధర్మముల నాలోచించక వ్యభిచారమునకుదిగును. జారత్వదోషమునకు గురియైనవ్యక్తికి పాపపుణ్యముల తారతమ్యము నెఱుంగ సాధ్యమగునా? చోరత్వమునకన్న జారత్వమువలన ప్రాప్తించుమహానర్థకము భయంకరమైనది. దొంగతనముచేసిన వ్యక్తిని శిక్షించుటకువీలుకలదు. కాని ఎవటి కెరుకకుండ జారత్వమొనర్చిన వ్యక్తినిశిక్షించుటకష్టము. దొంగతనముజరిగినవాని యింటిలో తాత్కాలికముగ మాత్రమే దారిద్ర్య దుఃఖమనుభవింపబడును. అంతేగాని అతనికి సంఘమునందు అగౌరముకలుగదు. దొంగపట్టువడినచో, అతను దొంగిలించిన సొత్తును మరల పొందుటకు వీలున్నది. వానిని శిక్షింపవచ్చును. జారునివిషయ మటులకాదు. చోరత్వముకన్న జారత్వమువలన నెక్కువ హానికలుగుటకు వీలుకలదు. గనుకదానికిపాల్పడువ్యక్తికూడ యితరులకు తెలియకుండానే పరివర్తింపవలెను. పట్టువడని దొంగతనమువలన సొమ్ము నష్టము మాత్రమేకలుగును. కాని పట్టువడని జారత్వము వలన వంశగౌరమునకు తీరనిహానికలుగును. మానాపహరణముకాగలదు. గాన దానిని తిరిగిరాబట్టుటకు వీలుకాదు. మానమును దొంగిలించినవానికే శిక్షవిధించినను తక్కువయే శిక్షానంతరమైనను లభించునది శూన్యమే. జారత్వమునకు పాల్పడిన వ్యక్తులకపయశము ప్రాప్తించుట తప్పనిసరి. దొంగతనమువలన దానికి గుఱికాబడినవారికి మానసిక వేదన అంతగా నుండదు. జారత్వమునకు దిగినవారి బంధువుల కాత్మహత్య గావించుకొనునంత మనోవేదన కలుగును.

కనుకనే జారత్వమును మహాపాపముగ పరిగణించిరి పెద్దలు ఇదికానేచ్చనువిపరీతముగ పెంచుకొనినవారొనర్చుదుష్కృత్యము. జారుడు మహానుభావుడనిపించు కొనుచున్నాడు. వాడొనర్చునది ఘనకార్యమను భావము ప్రబలిపోయినది. ఈ విపరీతభావము నలుగురి హృదయములందు బాగుగ పాతుకొని పోయినందున వ్యభిచారమెచట చూచినా నిరాఘాటముగ ప్రచ్ఛన్నముగనో, బహిరంగముగానో సాగుచున్నది. మంచిదికాదని యాక్షేపించువారు మొరటువారుగపరిగణింపబడుచున్నారు. వారు 20 వ శతాబ్దమునకు దగిన నాగరికులుకారు. బూడిదలో పొరలాడు గాడిదకు, తోడివారలనుచూచిననే జాతిప్రేమ కలుగును కాని, ఆవిధముగా నొనర్చని తక్కినజాతులమీద నుండగలదా? ఇంత హానికరములుగాక పోయినను, ఏదోవిధమగు నష్టమును గల్గించునవియే తక్కిన పాపకార్యములు. ఇకపుణ్యకార్యములసంగతి. ఈశ్వరారాధనమువలన ఇతరులకు నష్టముకలుగుట అసంభవము. సృష్టికర్తను స్మరించి, ఆరాధించుట వలన సృష్టిగతమైన మానవుల దివ్యశక్తి మేల్గాంచును. వారిలోని అవిద్య నశించును. విజ్ఞానమలవడును. పాపపుణ్యకార్యవిచక్షణ నెరుంగుటకు సాధ్యపడును. ఇంద్రియచాపల్యమునకన్న ఈశ్వరారాధన నాగరికతాలక్షణముకాదా? ఏమి కాలమైనైపరీత్యము సంభవించినది? అనృతాలాపముల వలన మానవుని హృదయము పాషాణసమానమైపోవును. వానిలో కరుణాభావము మరుగుపడును. జాలిగుండెలేని వాడే హింసకైన పాల్పడును. దుష్కృత్యమువలన నష్టము,

సత్కృత్యమువలన ఆత్మోన్నతి కలుగుచుండును. ఆత్మోన్నతి వ్యక్తిపరమైనను దానివలన నితరులకు లాభమేగాని అపకారముకలుగదు. పాపకార్యములవలన వ్యక్తిపరమునేగాక తక్కినవారికిగూడ చెప్పరాని హానికలుగును. బుద్ధిమంతులకు పాపపుణ్యముల తారతమ్యమెఱుగుటకు వీలున్నది. బుద్ధిహీనులకు బూడిదలోపొరలాడు గాడిదెస్వభావమే లభించును. విధ్యుక్తధర్మముల నెరుగుటకు విజ్ఞానముండవలయును. విజ్ఞానమును సంపాదించుటకుగాని, దానిని వృద్ధిజేసుకొనుటకుగాని విద్య నేర్చుకొనవలెను. విద్యావంతుల సత్క్రియాచరణయే ప్రతిజాతియొక్క నాగరికతా సౌధమునకు సోపాన నిర్మాణమొనరించును. తొలుత మనవిద్యావిధాన మెట్లున్నది విచారింతము.

మన దేశమునందు పూర్వము గురుకులాశ్రమములందు విద్యాదాన మొసంగబడుచుండెడిది. ఆధ్యాత్మికవిజ్ఞాన సంపన్నులయి, లోకకల్యాణమును వాంఛించు మహాపురుషులు విద్యాదాతలు. నియమము తప్పకుండ ధార్మిక జీవితమును గడుపు సద్గృహస్థుల సంతానము విద్యార్థిబృందము. విద్యార్థుల తల్లిదండ్రులకు పాధ్యాయులమీద భక్తివిశ్వాసము లుండెడివి. ఆత్మోన్నతికి పాటుబడవలసిన మార్గముల నన్వేషించిన ఋషిపుంగవులమీద గౌరవముండుట గొప్పవిషయముకాదు. కారణనేమనిన గౌరవనీయులను గౌరవించినవారికేలాటి సంతోషము కలుగబోదు. వారు తమకర్పింపబడు వినతులను స్వీకరించి, యొసగినవారిని హృదయపూర్వకముగ నాశీర్వదింతురు. అదేగౌరవమును సామాన్య

మానవులకొసగినచో వారుదానిని కోతికి కొబ్బరికాయ దొరికినవిధముగా సంతసించి, వ్యోమపథ సంచారానంతర మహంకార పూరితులగుదురు. సామాన్యమానవు లితరుల ప్రశంసలకర్రులు చాచుచుందురు. కాని పూజ్యులు మాత్రము దూషణ భూషణలను పాటింపక తమ ధర్మము లను తప్పకుండ నేరవేర్చుచుందురు. వారిలో ద్వంద్వభావము నశించి సమత్వమేర్పడును. అత్యధిక ప్రతిభాశాలురై, భూత భవిష్యద్వర్తమానముల జాడనెరిగినవారై, నిరంతర భగ వద్ధ్యాన తత్పరులై, ప్రశాంత స్థలములందు నిష్కాములై అవ్యాజానురాగమును జూపుచు జీవితములను గడుపు ముని సత్తములయెడ గౌరవమెవరికి గలుగకుండును ? వారియాశ్ర ములే పాఠశాలలు. వారు బోధించినదే బ్రహ్మవిద్య. విద్యనేర్చి ప్రయోజకులై, మానవజాతి కళ్యాణమునొన గూర్చవలెననే భావముతో తమ వద్ద శుశ్రూషసల్పు బ్రహ్మచారులకు విద్యాదాన మొసగుచుండిరి. గురుశిష్యు లిరువురు పవిత్రాశయములతో నుండవలయునుగదా ? కనుక తపమాచరించి ఆత్మోన్నతిని గనినవారు శిష్యులుగ నుండవలెను. విద్యకును బ్రహ్మచర్యమునకును సంబంధ మేమి ? గృహస్థుడు విద్యోపార్జన గావింపనర్హుడా ? యను ప్రశ్న వేయవచ్చును. బ్రహ్మచారి మనస్సు చాల నిర్మల ముగానుండును. అతనికి విద్యమీదనే యెక్కువ అభిలాష కలుగును. ఇంద్రియ చాపల్యమునకులోను గాడు గనుక వాని దృష్టి చదువుమీదనే కేంద్రీకరింపబడుటకు వీలుండును. ఇంద్రియ నిగ్రహములేక దేహసౌఖ్యముల కాసించు వానికి

మనోనిబ్బరముండదు. అదిలేనప్పుడు సుశిక్షితమైన విద్య ప్రాప్తించదు. అందువలన విద్యార్థిదశలో నున్నంతవరకు ప్రతి పురుషుడు బ్రహ్మచారిగ నుండవలెనని మనవారు శాసించిరి. అభ్యసించునది బ్రహ్మవిద్య గనుక బ్రహ్మచర్యము పాటించుట తప్పనిసరి. అందరికి బ్రహ్మవిద్యయే బోధింపబడినదా? లేదు. బ్రాహ్మణులకు మాత్రమే ఆధ్యాత్మిక విద్య లేక బ్రహ్మవిద్య ప్రసాదింపబడినది. తక్కిన వర్ణముల వారికట్టి యర్హత నొసగబడలేదు. పూర్వము మనవారు భారతజాతిని నాలుగు వర్ణములక్రింద విభజించిరి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులని. ఈశ్వరుని యెరుగుట కాధ్యాత్మిక విద్య ముఖ్యము. దానికర్హులగు వారిని బ్రాహ్మణులనిరి. వారికీశ్వరారాధన తప్ప వేఱొండు వ్యాసంగముండెడిదికాదు. నిరంతరము తపోనిష్ఠయందుండి దేహమును శుష్కింపచేయుచుండిరి. కనుక వారికి ప్రపంచ విషయము లందుత్సాహము లేకుండెడిది. మానసిక వికాసము లభించిన తరువాత దేహసౌఖ్యముల నాశించు మూర్ఖుడుండబోడుకదా? బ్రాహ్మణులకుగల సునిశితబుద్ధి, తపోచరణనిరతి, మానసిక వికాసము, త్యాగము లేక బాహుబలముచే తక్కినవారిని స్వాధీన పఱ్చుకొని రాజ్యస్థాపన మొనరించుకొనినవారిని క్షత్రియులనిరి. వారు బ్రాహ్మణుల తరువాత గొప్పవారిగ పరిగణింపబడిరి. అరాచకము పెచ్చరిల్లకుండ బాహుబలమున శాంతి నెలకొల్పి, ధర్మకార్యములను సక్రమముగ నెరవేరు పరిస్థితులను గల్పించిన వారియండవలననే దేశక్షేమం

స్థిరపడును గనుక, వారికి ద్వితీయ స్థానమొసంగబడినది. వ్యాపారమొనర్చి ప్రజలకు కావలసిన వస్తుసముదాయము నంతయు సమకూర్చువారిని వైశ్యులను తెగక్రింద పరిగణించిరి. సేద్యమొనర్చి, పైమూడు వర్గములవారికి తిను బండారములను పండింపచేయు కృషీవలులను శూద్రులని పిలచిరి. ఈనాలుగు వర్ణములవారు కలసిమెలసి ఉచ్చనీచ భావములు లేక సామరస్యముగ జీవితము గడిపిననేగాని దేశసౌభాగ్యము సక్రమముగా వృద్ధిజెందదు. ఇందులో ఒకరు యెక్కువ, ఒకరు తక్కువ అను విచక్షణలేదు. ఎవరి వృత్తిలో వారు పరిపూర్ణులే. దేశసౌభాగ్యమునకు కారకులే. వృత్తులయందుమాత్రమే భేదముకలదు. నిర్ణయింపబడిన, లేక వంశపారంపర్యముగవచ్చు, వృత్తిని జరుపుచు జీవనోపాధిని సంపాదించుకొనువారు గౌరవనీయులనిపించుకొనెదరేగాని వారికేలాటి అగౌరవము కలుగబోదు. బ్రాహ్మణులు తమ నిజవృత్తి—ఆధ్యాత్మిక విద్యా ప్రబోధము—నెరవేర్చనిచో దేశమునందు పాపకార్యములే ఆచరింపబడును. దోర్బలముచే శత్రువులనుకాని, లేక దుండగీండ్రనుకాని క్షత్రియులు శిక్షించనిచో అరాచకము ప్రబలిపోవును. వ్యాపారము స్థంభించినచో కావలసిన వస్తుపరికరములు అందుబాటులోనుండవు. సేద్యము సకాలమున సాగనిచో పంటలులేక ప్రజలల్లాడిపోదురు. దేశసౌభాగ్యమునకు చాతుర్వర్ణములవారు తమతమ వృత్తులను నిర్విఘ్నముగా కొనసాగించవలెను. మనపూర్వులు భారతీయులను నాలుగువర్ణములక్రింద విభజించుటయేగాక వారివారి విధు

లనుకూడ నిర్ణయించిరి. వారు కావించిన విద్యావిధానము మహత్తరమైనది. ఆశ్రమములందేవారు తమ శిష్యులకు జీవితోపాయములను నేర్పిరి. విద్యోపార్జనవలన మానవులయందు సృష్టిగతముగ నణగియున్న విశిష్టగుణ సంపత్తియంతయు బహిర్గతమగుటకు వీలుకలదు. అట్టిపరిణామము కలుగుటయే విద్యవలన మానవులకు లభించు సహాయము. విద్యవలన సాధింపదగినది విజ్ఞానమని మనపూర్వులు నిర్వచించిరి. పూర్వకాలమునందు విద్యాదానమొసంగువారి దృష్టిలో నైతిక విజ్ఞానము ప్రధానస్థానము కలిగియుండెడిది. మోక్షజ్ఞానమే వారి ఆశయముగానుండెను. కనుకనే భారతదేశము, ఆధ్యాత్మిక విజ్ఞాన సంపదగల దేశములందు మిన్నగనెన్నబడెను. కాలముగడిచినకొలది విద్యయనిన ప్రపంచజ్ఞానముక్రింద పరిణమించినది. ఏమిటీప్రపంచజ్ఞానము? భూమియొక్క వైశాల్యమెంత? ప్రపంచమునందెన్ని సముద్రములు కలవు? వాటిలోతెంత? ఏభాగమునందు గంభీరజలపాతములు కలవు? ఎంత భూమి సస్యసమృద్ధియైయున్నది? ఎన్ని యెడారులు కలవు? ఇదేనా? ప్రపంచజ్ఞానము? లేక భూభాగమునందెన్ని స్వతంత్రదేశములు కలవు? వాటిరాజ్యాంగ విధానమేమి? ఎంతమంది వీరాధివీరులు రాజ్యపరిపాలనమొనర్చిరి? ఆదేశమునందెన్ని పార్టీలుకలవు? శీతోష్ణస్థితి ఎట్లున్నది? ఏయే పంటలు పండును? ఖనిజసంపత్తి యెట్లుండును? ఇదేనా ప్రపంచజ్ఞానము? లేక భూగోళచరిత్రపఠనమా? ప్రపంచ చరిత్రపఠనమా? ప్రతిదేశమునందు ప్రతిపాదింపబడి ఉచ్ఛ

దశకో, క్షీణదశకోవచ్చిన సాంఘికార్థిక రాజకీయ పరివర్తనవిషయ పరిగ్రహణమా ? ఏది ? మనపూర్వుల కీస్వల్ప విషయములతో అవసరములేకుండెను. వారు కూలంకష ప్రతిభానిధులు కనుక చిల్లరవిషయములకై పాకులాడక, నైతిక బలముగలిగిన ఆధ్యాత్మిక సామ్రాజ్య సంపాదనమే తమ ఆశయముగనుంచుకొనిరి. మనకు నేటి ప్రపంచజ్ఞాన వివరణమునందు గొప్పవిషయములు గోచరించుననుట వాస్తవము. అది మనకు ముఖ్యావసరము. కారణము మన యాదర్శములే వేరు. ఆధ్యాత్మిక విజ్ఞానమలవడనందున, లభ్యపడుటకు ప్రయత్నింపవలసిన మార్గము బోధపడనందున, నిరంతర కృషిసల్పుటకు సామర్థ్యములేనందున, బుద్ధితెలిసినప్పటినుంచి మనకొసంగబడు విద్యావిధానము స్వల్పవిషయములమీద నాధారపడియున్నందున, మనకు ప్రస్తుతమమలునందున్న విద్యావిధానమే మహత్తరమైనదిగ గోచరించును. కాని అద్భుతనైతిక విజ్ఞానమును గడించిన మన పూర్వులకది తృణప్రాయము. కాలానుగుణ్యముగ నడచుకొనుట బుద్ధిమంతుల లక్షణమని చెప్పెదరు. గనుక మనము ప్రస్తుత విద్యావిధానమునందలి మంచి చెడుగులను మాత్రమే విమర్శింతము.

సక్రమపద్ధతులమీద విద్య గడించినవారికి, గడింపజాలనివారికి, గౌరవముగ జీవితమును గడుపుకొనుటకు విద్య ఉపకరించవలెను. ప్రతి దేశమునందు గరుపబడు విద్య వలన నా దేశస్థులకు జీవనోపాధి లభ్యపడుట తప్పనిసరి. కాని నేడొసంగబడు విద్యవలన సర్ జార్జిబర్డ్వుడ్ చెప్పిన

ప్రకారము విద్యార్థులకు తమవాఙ్మయమునందుండవలసిన ప్రీతి, ఆధ్యాత్మిక విషయైక విజ్ఞానము, ప్రాచీనశిల్ప విద్యాది నాగరికత లక్షణములందుపజ్ఞత, స్వమతాభిమానము, లేక వాటిని విమర్శించుటకు తోడ్పాటు లభించినది. వారి స్వగృహములపైన, తల్లిదండ్రులపైన, అక్కచెల్లెండ్రపైన, కడకు భార్యపైన ఒకవిధమగు నిరాదరణ కలిగినది. ప్రతిగృహము నందు ప్రస్తుత విద్యావిధానమువలన నసంతృప్తి కలిగినది. బర్ట్రుఫ్ మహాశయుడు చెప్పినది నూటికి నూరుపాళ్లు సత్యమని అంగీకరించక తప్పదు. మనమెంతమంది హూణభాషా ప్రవీణులను స్వగృహములందుసైతము తల్లిదండ్రులు, అక్కచెల్లెండ్రు, భార్యలు తద్విద్యావిహీనులలని ఏవగించుకొనుట చూడలేదు. ఎంతమంది క్లబ్బులలోచేరి నానాకూళ్లుగుడిచి, యిల్లువళ్లు గుల్లకావించుకొనుటలేదు. ఎంతమంది హూణభాషరాని భార్యలు బుద్ధిహీనలని యుపోహపడి వారిని యగచాట్లపాలు కావించుటలేదు ? ఎంతమంది పూర్వాచారముల ననుసరించు బంధువులను — తల్లిదండ్రులసైతము — సిగ్గులేక తీవ్రముగ విమర్శించి వారి మనస్సులను క్షోభపెట్టుటలేదు? ఎంతమంది మాతృభాషలో సంభాషణ గావించుటకుగాని, ఉత్తర ప్రత్యుత్తరముల జరుపుటకుగాని సిగ్గుపడుటలేదు ? ఎంతమంది పరమత స్వీకారమున బంగారు మేడలు కట్టగలమని యూహాపడుటలేదు ! మనమందర మెరుగని సంగతులేమాయివి ? ఈవిధముగ పరిస్థితులు విషమించినప్పుడు గృహమర్యాదలు నిలుచుటకు తావుకలదా ? ఎల్లప్పుడూ [illegible] నాగరికతాభిప్రాయములను స్మరించుకొంటూ కాలం

గడిపే మగవారియిండ్లలో శాంతి నిలువగలదా ? క్రమశః భోజనపాత్రలలో, తేనీటి పానీయములలో, ఆహారవిహారములలో, వస్త్రధారణములో, భూషణధారణలో సైతము విపరీత నాగరికతకు లోనైరి. జాతి వైలక్షణ్యమును బోధించు విద్యయే శ్రేయస్కరము. జాతి బలహీనతను నిరూపించు విద్యవలన మంచికలుగక చెడుగుప్రాప్తించును. కనుక నే నేడు మనకు జాతికి సంబంధించిన ప్రతివిషయముపై యేవగింపు కలిగినది; కలుగుచున్నది. అనాదినుంచి వచ్చు నాగరికతను భద్రపరచుకొనుచు, నాగరికతా ప్రపంచమునందు మిన్నయనిపించుకొనిన ప్రతి దేశమునందు జాతి గౌరవమును బోధించు విద్యా సంస్థలను నెలకొల్పి, అభివృద్ధిజెందుట ముఖ్యావసరము. యువతులందరు సక్రమ పద్ధతులమీద విద్యనభ్యశించి, తమ దేశ గౌరవమును, జాతియొక్క గొప్పదనమును, తక్కిన దేశములందు ప్రచారమొనర్పవలెను. ప్రతియొక్కక్క దేశ మీవిధముగ, అధికారమును చలాయించు దుర్బుద్ధిని విడనాడి, పరస్పర జాతిగౌరవ ప్రచారము సాగించిననాడు సర్వమానవ సౌభ్రాతృత్వము సంఘటిల్లును. మన నాగరికత ఎటువంటిది ? క్రీస్తు పుట్టుటకు పూర్వమెన్ని వేలేండ్లక్రితమో ప్రపంచమున కాధ్యాత్మిక విజ్ఞానమును బోధించిన యొక మహదాశయ గర్భిత జీవిత విధానము. భారతీయుల విజ్ఞానసంపద కంతులేదు. అది నవీనముకాదు. సృష్ట్యాదినుండి దినదిన ప్రవర్ధమానమై ఐహికవిషయలాలసులు సక్రమ ధర్మమార్గమున నడచుటకు మార్గదోతకమై, నాస్తికుల నిరాధార వాదములను

భేదించు దివ్యశక్తియై, ఆధ్యాత్మికులకు పట్టుగొమ్మయై ఆత్మశక్తి నెరింగి తద్వారా పరమాత్మ స్వరూప వైభవమును గాంచుటకు ప్రాణగొడ్డమై, సర్వతోముఖ మానవ ధర్మ ప్రబోధమునకు ప్రధానసాధనమై యొప్పుదివ్య విజ్ఞాన సందేశమును పాశ్చాత్త్యుల కొసంగుట భారతీయుల జన్మ హక్కు. ఎన్ని అవాంతరములు సంభవించినను, కాలవైపరీత్యమువలన భారతీయులెంత స్వధర్మదూరులైనను, పశుబలోపయోగ మందత్యద్భుత ప్రావీణ్యమును సంపాదించి, బలహీనులనోడించి స్వీయమత ప్రచారమునకు పాటుపడు విజయుల విపరీత సిద్ధాంతముల నాచరించుట యందభిమానము కలిగినను, శారీరకముగ విపత్పరంపరలకులోనై దాస్యభారమున క్రుంగవలసివచ్చినను, దేశసౌభాగ్యము క్రమశః క్షీణదశనందుచున్నను, స్వాతంత్ర్యాలోచనకు దావొసంగబడక వివిధజాతి మత సాంప్రదాయముల ననుకరింపవలసిన దౌర్భాగ్యదశ ప్రాప్తించినను, భారతీయులను మేల్కొలిపి కర్మవీరులనుగ నొనర్చు దివ్యశక్తియగు వారి విజ్ఞాన భాస్కర తేజముమాత్రము తగిపోదు. వారికి జీవన ప్రభాతమును కలిగించుచునేయుండును. అది యెప్పటివలెనే మార్గద్యోతకమై, ఆత్మప్రబోధకారణమై, అజ్ఞానాంధకారమును తొలగించునదియై ప్రతిభారతీయుని లలాటఫలకమునందు ప్రకాశించుచునేయుండును. దానిని పోగొట్ట నెవరితరముకాదు. నిద్రాణమైయున్న భారతీయుల దివ్యశక్తిని పురికొల్పునది ఈమహత్తర సాధనమే. అజ్ఞానదశయందు [illegible]ంచు భారతీయులకొకప్పుడైన తెలివిగాంచుట కదియే.

ప్రభాతసమయమును జేకూర్చును. కనుకనే స్వర్గీయు రాలగు అనీ బిసెంటమ్మగారు హిందూమతమును గురించి వకాణించు సందర్భము నందీవిధముగా వచించినది.

*" Are men so strong, do you imagine, that they can turn the car of evolution against the will of Ishwara ? Amidst the jarring wills, the foolish deeds, the mistakes, the blunders and the sins of mankind, one Divine will is working out in its unchangeable purpose, moulding even men's follies and crimes to the working out of its own supreme purpose. "*

(ఈశ్వరుని సృష్టిచక్రమును వ్యతిరేకముగ త్రిప్పుటకు మానవులంతటి శక్తి సంపన్నులని తలచెదవా ? కృత్రిమ స్వభావులమధ్య ; అసంగత ప్రవర్తనము, దోషములు పాపములమధ్య భగవదేచ్ఛ యథాప్రకారముగ, మానవుల తప్పిదములను, ఘోరకృత్యములను సైతము మహాత్కార్య మొనర్చుట కనుగుణ్యముగ మార్చుచు, పనిచేయుచునే యుండును.)

ఈ విజ్ఞాన సంపద భారతీయుల జన్మహక్కు. గనుకనే తక్కిన ప్రపంచజాతు లజ్ఞానదశయందున్నప్పుడు భారత దేశము ఆధ్యాత్మిక దివ్యసందేశమునందిచ్చినది. తాత్కాలికముగా, కాలమైపరీత్యము ననుసరించి, అనుకరణ మోసమెరుంగని స్థితిలో భారతజాతి నేడు తద్దివ్యసందేశ మును ప్రపంచమునందు నాలుగుమూలలకు ప్రాకించక పోయినా, భగవంతుడనుగ్రహించిన శుభసమయములభించి నప్పుడు తిరిగి భారతదేశము మానవధర్మమును మరచి,

ఉత్తమపథచ్యుతి లభించి పరస్పర విద్వేషానల దందహ్యమానులై యాతనగరచుచున్న నితరజాతులకు, విజ్ఞానసందేశము నొసంగగలదని నిస్సంకోచముగ నెలుగెత్తి చాటవచ్చును. ఈనాడేమి? ప్రస్తుత మగుపడుచున్న భారత జాతి సంచలనము కలుగనినాడే అని బిసెంటమ్మ బోధించినది.

*" Spirituality is India's special charge in the world's future. "*

(భావి ప్రపంచ వ్యవస్థయందు ఆధ్యాత్మిక సందేశమే భారతదేశముయొక్క ప్రత్యేక బాధ్యత.)

ఈనాడు భారతజాతి దాస్యభారమున క్రుంగిపోవుచున్నంత మాత్రమున తనవిజ్ఞానమును గోలుపోయినదని చెప్పుట వెఱ్ఱితనము. గ్రుడ్డువచ్చి పిల్లనెక్కిరించినవిధంగా " హరిఃఓం " అను ప్రారంభదశలోనే ఆధ్యాత్మిక విజ్ఞాన భిక్షకు " దేహీ! " యంచు జేతులుజాపిన జాతులు భారతదేశమునందు స్వమత ప్రచారమునకు గడంగుట మరింత హాస్యాస్పదము. మీవిజ్ఞానము, మీధీశక్తి, మీశౌర్యము మీనిర్మాణ కౌశల్యము చెక్కుచెదరకుండ, నిర్జీవముగాకుండ వృద్ధిజెందుచున్న పక్షముననిట్లు నిస్సాహాయులై పడియుండుటకు కారణమేమని మనల నితరులు ప్రశ్నించవచ్చును. దీనికి సమాధానము లేకపోలేదు. దుర్నిరీక్ష్య ప్రతిభా ప్రదర్శనావసరము కలిగినప్పుడు అంతవరకర్ధనిమీలితనేత్రములతో దుర్గమారణ్యమధ్యస్థ పర్వత గృహాంతర్భాగమున విశ్రాంతినందుచున్న కేసరిసహజ ప్రతాపమును ప్రకటింప

కుండునా ? నివురు గప్పినంత మాత్రమున నిప్పుకణమును జేతబట్టిన కాలకుండునా? లీలామానుష చర్యలను ప్రదర్శించి నంతమాత్రమున నీశ్వరుడాది మధ్యాంత స్వరూపుడు కాకుండునా? అట్లనే తాత్కాలిక పరాధీనస్థితియందున్నప్ప టికి భారతజాతి నిర్వీర్యము కాజాలదు. శక్తివిహీనము కాజాలదు. తచ్ఛక్తి దేహసంబంధమైనదికాదు. ఆత్మ సంబంధమైనది. దేహము లశాశ్వతములు. అట్లనే దేహ పటుత్వముకూడ నస్థిరము. భారతీయుల కాత్మశక్తి మెండు. పరిస్థితులఁబట్టి రణరంగమందు పరాజయము బొందెదరేమో గాని ఆత్మశక్తి ప్రయోగమునందు వారప్రతిభులు. శక్తి ప్రయోగవిరమణములుండుట భగవచ్చిత్రము తప్ప వేఱు కాదు. సముద్రమున కాటుపోటు సహజమైనట్లు, సింహ మున కద్వితీయ పరాక్రమ శౌర్యములు సహజమైనట్లు, హాస్తిమస్తిష్కమునందు ముత్యములుండుట సహ జమైనట్లు, నిర్మలాకాశ పథమునందు నిశీథము నక్షత్ర పంక్తులు గోచరమగుట సృష్టిరహస్యమైనట్లు, షోడశకళా పరిపూర్ణుడగు సుధాకరుని కిరణములాకర్షణీయమైనట్లు, పర మేశ్వరునికి దుష్టశిక్షణ, శిష్టరక్షణము లనివార్యమైనట్లు, భారతీయుల కాత్మశక్తిసహజసంపద, సృష్టిరహస్యము లని వార్యము. ఐతే, యింతగొప్పగానుల్లేఖింపబడుచున్న భార తీయుల విజ్ఞానవిధానమేమి? అది సర్వోత్కృష్టమని నిరూ పించుటకే యాధారమున్నది? అందువలన నేర్చుకొనవలసిన విశిష్టతయేమి? మున్నగు ప్రశ్నలు బయలుదేరవచ్చును. కనుక మనము కొంతవరకు వివరించి, విశాలదృష్టుల నిప్పు

క్షుపాత విమర్శనకు వదలెదము. ప్రప్రథమమున పూర్వులు విధించిన జీవితనియమములనుగురించి ముచ్చటింతము. ప్రతి మానవుని జీవితదశను నాలుగు భాగములుగా వివరించిరి, వాటినే ఆశ్రమములని పిలుచుచుందురు. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము. ఈనాలుగు ఆశ్రమములందు వరుసగా, నియమబద్ధముగా, జీవితమును భగవత్ప్రీతికరముగా గడిపినవారి కైహికాముష్మిక సౌఖ్యము కరతలామలకము. బ్రహ్మచర్యగార్హస్థ్యాశ్రమ జీవితమును గడుపువారికి, జీవిని ప్రవృత్తిమార్గమునందు ప్రవేశింపజేయువిధాన మెరుకబడును. ఈప్రవృత్తిమార్గము ననుసరించేయావద్విశ్వము జరుగుచుండును. వానప్రస్థ సన్న్యాసాశ్రమస్వీకారులకు ప్రపంచవిషయ చపలత్వమునుండి విముక్తి గడింపవీలయి, నివృత్తిమార్గగాములగుటకు సాధ్యమగును. ఈనాల్గుగు ఆశ్రమములను స్థాపించి, తన్నియమబద్ధ జీవిత విధానమును సూచించి, మనపూర్వులెంతో విజ్ఞానమును ప్రదర్శించిరి. ఐహికాముష్మిక సౌఖ్యమును జీవితకాలమునందే యనుభవింప వీలుకలిగించిరి. తలమాసూడినదాది ప్రాణములను విడచునంతవరకు మానవుడీవిధముగ నియమబద్ధజీవితమును గడుపజాలినచో ప్రపంచమునం దేయితర మతమునందిట్టి మహత్తరోపదేశ మాచరణయోగ్యముగా నున్నదని యుదాహరింపజాలదు. ఈమహత్తర విధానమొక భారతీయులకుమాత్రమే ఆచరణీయమైనది కాక, సర్వత్రప్రతి జాతినిస్సందేహముగ నాచరించవచ్చును. ఆహా! ఆశ్రమ విభాగజీవితమెంత సౌఖ్యదాయకమో, ఆధ్యాత్మిక విజ్ఞాన

సంపాదనకెంత యుపయోగకరమో, తదాచారపరునికి విదితము. జీవితమందర్ధభాగము విద్యోపార్జనయందు, శాస్త్రజ్ఞానసంపాదనయందు, భగవత్కైంకర్యార్థముగావించు అతిథి అభ్యాగత సేవలయందు, ఆత్మశక్తిమహాత్మ్య నిరూపణయందు, స్వదేశమానవసేవా పరత్వమునందు చాకచక్యములతో, అభిలాషతో, ఆనందోత్సాహములతో, కార్యనిర్వహణమునందు పట్టుదలతో గడుపుటయును, మిగతా అర్ధభాగమును సంసార తాపత్రయములనుండి విడివడి, అరిషడ్వర్గముల బారినుండి తప్పించుకొని, ఆముష్మిక చింతనాభివృద్ధిని గడించి, ఆత్మసంయమమునుబడిసి, నిరంతర భగవద్ధ్యానతత్పరుడై, ఆత్మార్పణమొనర్చి పునరావృత్తి కారకముగా శాశ్వతపరమపద ప్రాప్తికి బ్రయత్నించు సదవకాశము గల్పించుకొనుటయును వీలగుచున్నది. పూర్వము భారతీయ లీసక్రమ పథమునందు జీవితమునుగడిపి యశశ్చంద్రికల నలుదిక్కులబరుపజాలినారు. కనుకనే వారిమహత్తరజీవిత ఘట్టములను మనమునిత్యము స్మరించి ఆదర్శకములుగ దృష్టిపథమునందుంచుకొనగలిగినాము. గతమహోద్వైభవమును స్మరించి కర్తవ్యతామూఢులమై నిత్యజీవితమును నిస్సారముగా, నిష్ప్రయోజనముగా, నిష్టారహితముగా గడుపవీలులేదు. పూర్వులవలె మనము భారతమాత గర్భముననే జన్మించినాము. వారనుసరించిన సాంప్రదాయములు మనకునుగలవు. ప్రాచీన విజ్ఞాన మట్టులే చెక్కుచెదరకుండనున్నది. అధికారము, పరిస్థితులుమారినను, సృష్టినిర్మాణమునందు భారతదేశమున కబ్బిన సమాజసంపద యట్టలేయున్నది. కాని మనమెంత

దూరదృష్టితో నవలోకింపజాలకున్నాము. మనదృష్టిమంద గించినది. మన ఆశయములు క్షణభంగురములై పోయినవి. మానసిక పరివర్తనమునందు విషమపరిణామము దాపురించి నది. స్వతంత్రాలోచన పోయినది. స్వధర్మత్యాగ మొనర్చి పరధర్మానుసరణమునకు పాటుపడుచుంటిమి. కనుకనే నేడు భారతజాతి నలుగురిచే చులకనగ జూడబడుచున్నది. నిర్వీర్యమనియు, నిరర్థకమనియు పరిగణింప బడుచున్నది. "అంగడిలో అన్నీ ఉన్నవి, అల్లునినోట్లో శని ఉన్నదన్నట్లు" అనేసామెత మనకువర్తించును. ఇంతవిజ్ఞానముకలిగినప్పటికి, ఇట్టి దేశసౌభాగ్య ముండినప్పటికీ, పూర్వఋషిగణముల నిరంతర తపోమహిమ వంశానుగతముగ ప్రాప్తించినప్పటికి మనమీవిధముగ దివాంధమువలె అజ్ఞానాంధకారమునందే మెలగ నుబలాట పడుచున్నాము. వంశానుగతముగ సంక్రమించిన ఆధ్యాత్మిక దివ్యవిజ్ఞాన సంపద నుపయోగించుకొను సక్రమపద్ధతులనే గ్రహింపజాలనిచో, మనమిక ప్రాచీననాగరికతా సాంప్రదాయముల విశిష్టతను తక్కినజాతులకెటులబోధించి ప్రచార మొనర్పగలము? నిర్లక్ష్యభావముతో తృణీకరించి, స్వధర్మమును విస్మరించి క్రొత్తగా నెలకొల్పబడిన పాశ్చాత్య విజ్ఞానమును గ్రహింపనెంతకాలము ప్రయత్నించెదము? ఇతరులకు బోధింపవలసిన దివ్యజ్ఞానమెంతో మనకు పూర్వులనుండి సంక్రమించినప్పుడు దానిని వినియోగపర్చుకొనలేక పరధర్మములకు ప్రాకులాడుచుండిన మనకేమైన లాభమున్నదా? ఆదరణలభించునా? మనవిజ్ఞానము, మనసాంప్రదాయము, మననాగరికత, బూజు

పట్టిపోవలసిన దేనా ? ఆత్మవినాశనమున కాసపడుట కాదా? రాజకీయముగ గాకపోయినను, అధ్యాత్మికముగ నైనను ప్రపంచ జాతులందు భారతజాతికి ప్రత్యేకోన్నత స్థానముగలదని గర్వించుటకు వీలుకలదా ? నైతికదాస్యమునుకూడ నాశించుట తగునా ? మననాగరికతను గప్పిపుచ్చి, ధీశక్తులనడచిపెట్టి, వ్యక్తిత్వమును గోల్పోయి, దేశద్రోహ మొనర్చుటయేగాక, విజ్ఞానసంపదను గొల్లగొట్టుకొని పోనిత్తుమా ? ఊరక జూచుచునిటులే నీళ్లునమలుచూ మిన్నకుండవలసిన దేనా ? షుమారు నూరేండ్లుదాటి పోకుండగనే స్వామి వివేకానందుడు పాశ్చాత్యఖండములందు గావించినభారత నాగరికతా సందేశమును నిరర్థకమని నిరూపించుట న్యాయమా? నేటిమనస్థితి యింతకన్న ఏమిబాగున్నది ? యువకులు, నడివయస్కులు, వృద్ధులు స్వాభిమానరహితులై, యిష్టము వచ్చినట్లు నియమ ధ్ధముకాని జీవితమును గడుపుచుండుట జరుగుచునేయున్నది. ఎట్టిస్థితియందున్నాము ? విద్యోపార్జనకాకముందే, బ్రహ్మచర్యాశ్రమ త్యాగమునకర్థ్మా తలభింపకముందే, బాలురకు వివాహముజరిగి సంసారతాపత్రయబాధలకు గురిగావలసిన గ్రహచారముపట్టినది. నేడుబ్రహ్మచర్యమనిన నేతిబీరకాయవలెనున్నది. నిజమైన బ్రహ్మచారి నూటికి కోటికొకడైన దొరకడు. వివాహము కానివాడే బ్రహ్మచారి యనిపించుకొనదగునా ? అట్లనే వృద్ధాప్యమునందున్నవారు ప్రాపంచిక సంబంధములనుండి విముక్తులై, ఆధ్యాత్మిక చింతనగావించుకొను మహాద్భాగ్యము నొందజాలక యింకను ధనార్జనకై పాటుపడుచు, అక్రమప్ర

వర్తకులై, ఇష్టపూర్తిగా వదలుటకు సిద్ధపడనిదంతయు మృత్యుదేవత బలవంతముగ స్వాధీనమునుండి తప్పించునంత వరకు ప్రాకులాడుచునేయున్నారు. ఏమిలాభము? దైనందినాభివృద్ధి గడించుటకుమారుగా మననాగరికత మాంద్యముఖముపట్టుచున్నది. నాలుగు ఆశ్రమధర్మములను వరుసగా విమర్శింతము. మొదటిది బ్రహ్మచర్యాశ్రమము. ఈ ఆశ్రమనిర్వహణమున కలుగులాభమేమి? సృష్టినిర్మాణమున కనుగుణ్యముగ, స్వభావముననుసరించి, విజ్ఞానప్రదానము గావించుటకై బాలురను గురువులకడ కంపుచుండిరి. గురువులకడ వేదపఠనము సలుపుచుండిరి. మతవిషయములను గురించి, మతగ్రంథముల ప్రాశస్త్యమును గురించి, నిత్యజీవితమునందు మతసాంప్రదాయానుసరణమును గురించి బోధింపబడుచుండెను. శ్రీరామచంద్రుడు వేదపఠనమునేగాక త్రికాల సంధ్యావందనముగూడ నాచరించుచుండెననియు, నాధ్యాత్మికవికాసోదయ ప్రాప్తికి నుపకరణములగు మతసాంప్రదాయముల ననుసరించుట కేమరలేదనియు మనము చదివినసంగతే. విజ్ఞానధనుడగు వశిష్టమహర్షికడ శుశ్రూష సలిపి అహింసావిధానమును, ఆత్మానాత్మ విచారమును, కూలంకషముగ గ్రహించి, తదనుగుణ్యముగ జీవితమునంతయు నాదర్శప్రాయముగ గడిపిన మహనీయుడు శ్రీరామచంద్రుడు. శుశ్రూషసల్ప నవసరములేకుండానే ఇతరులకెరిగింపగల భగవదవతారమూర్తియగు దాశరథి ఏలనట్లాచరించెను? సమకాలికులకు, భావిభారత సంతానమునకు, స్వీయ ప్రవర్తనమాదర్శ ప్రాయముగ నుండదలచియేగదా

ఆవిధముగ ప్రవర్తించినది. అందుకనేగదా విశ్వామిత్రుని యాగసంరక్షణ గావించినది. రావణునిచే దొంగతనముగ నెత్తుకొనిపోబడిన ఆదిలక్ష్మీస్వరూపిణి సీతామహాదేవికొఱకు భార్యావియోగ దుఃఖపరిదర్శన మొనర్చినదందులకేగదా! బ్రహ్మచర్యాశ్రమ స్వీకారానంతరము బ్రహ్మవిద్య నభ్యసించుటవలన గలుగు ప్రథమఫలితము ఉదాహరణమునుబట్టి స్పష్టమగుచున్నది. భారతనీతి ననుసరించి జీవితమునుగడుపు విధమేగాక, ఆత్మవిచారమునుగూడ బోధించుచుండిరి పూర్వము ఋషులు. పెద్దలకనువర్తనతోను, మర్యాదతోను, సత్యసంధులుగను, ధైర్యోత్సాహులుగను, మాతాపిత గురుజనులను గౌరవించునట్లు, స్వార్థరాహిత్య మార్గమవలంభించునట్లు, జీవితమునందు త్రమాశయములు ఫలింపజేయునట్లు, ప్రవర్తించు విధానమును బోధించుచుండిరి. ఇతరుల క్షేమము నాకాంక్షింపుచు,ప్రజాహిత జీవితము గడుపులాగున శిష్యులకుపదేశించుచుండిరి. బ్రహ్మచర్యాశ్రమశిక్షణమునందు మానవున కనుగ్రహింపబడు విశిష్టోపదేశములందిది అమూల్యము. కేవలము ఆత్మకు సంబంధించిన. ఉపదేశమేగాక, శరీరపరిశ్రమకూడ గావింపబడుచుండెడిది. బ్రహ్మచర్యమునుగుఱించి మనకు సమకాలికుడును, నలువదేండ్లకుపైగా బ్రహ్మచర్యము నాచరించు మహత్తర వ్యక్తియునగు గాంధీమహాత్ముఁడు బోధించినదిట వివరింతును.

"బ్రహ్మచర్యమనిన సర్వేంద్రియములపైన, అవయవములపైన సంపూర్ణాధికారము సంపాదించుట. శాస్త్ర

ఇది సులభసాధ్యముకాని యొకమానసికావస్థ" (*Young India October 13, 1936*) మనోవాక్కాయ కర్మములందు బ్రహ్మచర్యము నవలంబింపవలెను. దీనిని నిత్యమాచరణయందుంచవలెను. శ్రీమద్భగవద్గీతలో జెప్పబడినట్లు, మనము నిత్యజీవితమునందు జూచుచున్నట్లు, బుద్ధిహీనుడు శరీరావయవములను స్వాధీనపఱచుకొనఁ బ్రయత్నించుచు మనస్సునందు దురభిప్రాయములను బ్రోదిరొయొనర్చుచుండును. అందువలన వానికావంతయు లాభముకలుగదు. మనస్సు స్వాధీనపఱచుకొననంతవఱకు శరీరమును శుష్కింపజేయుట నిరర్థకము. మానసిక పరిణామముననుసరించి శరీరపరిస్థితులు మారుచుండును. మనమొక వ్యత్యాసమును గమనించవలసి యున్నది. ఒకటి, మనసునందు చెడుతలంపులను కలుగనిచ్చుట రెండవది ఎంతప్రయత్నించినను మనసు పరిభ్రమించుట. ఇష్టమువచ్చినట్లు మనస్సును పరిభ్రమింపకుండ నణచిపెట్ట గలిగినచో జయముకలుగకతప్పదు. శరీరావయవములను స్వాధీనపఱచుకొనఁ గలిగియు, మనస్సును స్వేచ్ఛావిహారమొనరింపకుండ నాపివేయజాలని దుస్థితిని మనము నిత్యజీవితమునందనుభవించుచున్నాము. కనుక మొదటశరీరావయవములను స్వాధీనపఱచుకొని, మనస్సును చిక్కబట్టి నడచుటయే మనము చేయఁగలపని. మనస్సును స్వేచ్ఛావిహారమొసంగితిమో, మనస్సు శరీరావయవములు రెండు వేఱువేఱురీతులలో సంచరించును. చెడుతలంపులను కలిగింపకుండుకొననంతవఱకు రెండింటిని స్వాధీనములో నుంచుకొనుట కవకాశముకలదు. బ్రహ్మచర్యము నవలంభించుట కష్టమని

యు, అసంభవమేయనియు నూహింపబడుచున్నది. ఈ ఊహా కుగారణమేమనిన బ్రహ్మచర్యమును విశాలదృష్టితో సమన్వయపఱచుకొనలేక పోవుటయే. కామప్రకోపము నణచుటయే బ్రహ్మచర్యావలంబనమని తలపబడుచున్నది. కాని ఈ ఊహనిరాధారమైనది. ఏయొక యవయవమునో స్వాధీనపఱచుకొని, తక్కినవాటిని స్వేచ్ఛగ వదలిపెట్టుట బుద్ధిహీనత. సూచకార్థములగు కథలనువినుట, దృశ్యములను గాంచుట, ఉద్రేకింపజేయు పదార్థములను చవిజూచుట, వస్తువులను స్పృశించుట మొదలగునవి జరుపుచు, విషయలోలత్వమునుండి తప్పించుకొన ప్రయత్నించుట నిప్పులో చేయిబెట్టి తప్పించుకొను వెఱ్ఱిపనివలెనుండును. విషయలోలుడుగాకుండ నుండుటకు సర్వావయవములను స్వాధీనపఱచుకొనవలెను. బహ్మచర్యమను శబ్దమునకు సంకుచితార్థమును జెప్పుటహానికరము. అన్నివిధముల మనము సంపూర్ణప్రయత్నమొనరించుచో ఇంద్రియనిగ్రహము సులభముగ సాధింపవీలగును. బహుశా జిహ్వాచాపల్యదోషమే అన్నిటికి మూలకారణమని తోచుచున్నది. కాబట్టి దానిని ప్రప్రథమమున నిరోధించవలెను. బ్రహ్మచర్యమనిన నేమోపరిశీలించెదము. సత్యాన్వేషణకు గడంగువిధానమే బ్రహ్మచర్యము ఈశబ్ద వ్యుత్పత్త్యర్థమునుండి ఇంద్రియనిగ్రహమను విశిష్టార్థమును గ్రహింపవలెను. బ్రహ్మచర్యమనిన సంభోగవిసర్జనమను అసంపూర్ణనిర్వచనమును గావింపరాదు. ”

**(FROM "YERAVADA MANDIR" PAGE 19)**

"బ్రహ్మచర్యమనిన శరీరావయవములను శుష్కింపఁ జేయుటకాదు. అంతకన్న విపులార్థము జెప్పవలెను. పంచేంద్రియములను స్వాధీన పఱచుటయని యెఱుగవలెను. చెడ తలంపులవలన బ్రహ్మచర్యమునకు భంగము కలుగును. క్రోధమువలన గూడనదే ఫలితమబ్బును. ప్రాణోత్పత్తికి కారణభూతమైన వీర్యశక్తిని పదిలపఱచి ఉత్కృష్టమొనర్చుటవలన దివ్యశక్తులుత్పన్నమగును. వీర్యమును విషయాసక్తిచేత దుర్వ్యయమొనర్పకుండ మితముగ వ్యయము చేయుటవలన మహత్తరమగు దివ్యశక్తులను సాధింపగలము. వీర్యమును చాలమంది చెడుమార్గమున సంచరించియో, లేక దురభిప్రాయములను నిరంతరము స్మరించియో, దుర్వ్యయమొనరించెదరు. ప్రసంగమునకు, చేష్టలకు భావమే ప్రధానము. కనుక, చెడుతలంపులను విసర్జించుట ముఖ్యము. కాబట్టి దురభిప్రాయములను మనస్సునందు కలుగకుండ జేయుటయే గొప్ప విజయమును సమకూర్చును. నిశ్చలహృదయముతో భగవత్ప్రార్థన గావించుట దీనికొఱకే అని నాకు స్ఫురించుచున్నది. భగవదాకృతినే ఆరాధించువానికి ఆభావమునందే మనస్సు లగ్నమైయుండును. బెజ్జముండిన పంపులో ఆవిరిని (Steam) బట్టిన అది ఏలాటిశక్తినెట్లు ఇవ్వజాలదో, అటులనే హృదయైక్యత వీర్యశక్తిని దుర్వినియోగమొనర్చువానికి లభింపదు. సంతానోత్పత్తికొఱకే వినియోగింపవలసిన వీర్యమును, నిర్లక్ష్యముగ తప్పుడు త్రోవలందు వ్యయపఱచుట మహానర్థదాయకమగును.

ఇంద్రియ నిగ్రహశక్తి భగవత్ప్రసాదిత మనవలెను. భగవద్గీతలో ద్వితీయాధ్యాయమునందిట్లు చెప్పబడినది. "ఉపవాసమున్నప్పుడుగాని, లేక బలమైనగాయము తగిలి నప్పుడుగాని, విషయవాసన తాత్కాలికముగ మరుగుపడి యుండును. కాని దానిని పూర్తిగ నిర్మూలించుటకు, భగవత్సాక్షాత్కారమవసరము." ఈ నిగ్రహశక్తి తాత్కాలికముకాదు. ప్రయత్నములేకుండ సులభముగా సాధింపదగినదికాదు. ఒకసారి సమకూడినచో ఎన్నటికిని పోదు. అట్టిస్థితి యందేవిధముగానైనను వీర్యశక్తి దుర్వ్యయ పరుపబడదు. బ్రహ్మచర్యము సాధ్యపడుచో అది కొండగుహలలో తపమాచరించువారికే లభ్యమగునని చెప్పుచుందురు. బ్రహ్మచారి యెన్నడును స్త్రీని చూడకూడదు. తాకరాదనెదరు. నిజమే! కాంక్షాపూరితుడై బ్రహ్మచారి స్త్రీని గురించి మాట్లాడకూడదు. చూడకూడదు. స్పృశించకూడదు. కాని మనము గ్రంథములద్వారా తెలిసికొన్న నిషేధము సరియైనదికాదు. కారణమేమనిన మానవుడు ఎప్పుడూ విషయవాసనకు లోనగునో నిర్ణయించుట కర్హుడుకాడు. కనుక మన్మథాగమనము దురూహ్యము. ప్రపంచముతో సంబంధముగలిగియుండియు, తీవ్రకృషివలన, ఇంద్రియ నిగ్రహమును సాధించినవానికన్న, కట్టడవులందు నివసించి తపస్సమాధివలన సాధించినవాడుత్తమవ్యక్తి అనిపించుకొనడు."

(హరిజన్ — జూలై, 23, 1938.)

"సర్వసంగ పరిత్యాగము, సంపూర్ణమగు ఇంద్రియ నిగ్రహశక్తి సాధింపవలెను. అట్లు చేతకానిచో, వివాహ మాడి నిగ్రహజీవితమును గడుపుట వాంఛనీయము."

(హరిజన్, సెప్టెంబరు 7, 1935.)

బ్రహ్మచర్యమునకొక ప్రత్యేక నిబంధనలేదని నా యభిప్రాయము. స్త్రీపురుషు లిరువురు సమానముగ నవలంబించవచ్చును. ఇరువురి కధికారముకలదు. బ్రహ్మచర్యము నవలంబించుటవలన ఆయుర్వృద్ధి ప్రాప్తించును. వీర్యశక్తిని దుర్వ్యయమొనర్చినచో అన్నివిధముల హాని కలుగును. కనుక ప్రతి సోదరుడు, సోదరి, మహాత్ముని యుపదేశము నాలించి జాగరూకతతో మెలగుట ముఖ్యావసరము.

బ్రహ్మచర్యాశ్రమమైన పిదప మానవుడు గృహస్థుడగుట కనుజ్ఞ కలదు.

బ్రహ్మచారియై, ఆధ్యాత్మిక విద్యోపార్జన గావించి, విజ్ఞానమును గడించిన అనంతరము, పురుషునికి వివాహము చేసికొను అధికారము కలదు. వైవాహిక జీవితమును గడుపుటయే గృహస్థాశ్రమ ధర్మము. అగ్నిసాక్షిగ బరిణయమాడిన స్త్రీతో, ధర్మబద్ధముగ జీవితమును గడుపుచు సత్సంతానమును బడయవలెను. సంతానప్రాప్తి లేనిచో వంశాభివృద్ధి కానేరదు. పున్నామనరక విముక్తి లభింపదు. అనపత్యుల కధోగతి ప్రాప్తించునని శాస్త్రములు చెప్పుచున్నవి. అతిథి అభ్యాగతులను, విద్యార్జించుచు నిర్జి

తేంద్రియులై ప్రవర్తించు బ్రహ్మచారులను, సన్న్యా
సాశ్రమ స్వీకారులను, ప్రేమతో గౌరవించి, ఆదరించి,
పోషించు భారము గృహస్థులమీదగలదు. మనువుచెప్పిన
ప్రకారము, పురుషుఁడనిన నొక పురుషవ్యక్తియేగాక,
అతఁడు చేపట్టిన భార్యయును, ఆమెవలన గలిగిన సంతాన
మనియు నెఱుగవలెను. కుటుంబపోషణ భారమంతయు
వహించుటవలన, జాతియను ఓడయొక్క ముఖ్యస్తంభమున
కెదుట బిగించికట్టు త్రాడువంటి వాడగును. గృహస్థ జీవి
తము, సంఘసేవ — యీరెండింటివలన — పురుషుఁడు నిర్ణీత
గమ్యస్థానమును జేరగలడు. ప్రతి మనుష్యుఁడు మానవ
కల్యాణముకొఱకు పనిచేయవలసియుండును. శ్రీమద్భగ
వద్గీతాకారుడు సెలవిచ్చినట్లు, 'స్వార్థపరుఁడై సంఘసేవ
నుంచి దూరముగ నుండకూడదు. మనమందఱు నొకరి
కొకరికి సహాయ మొనర్చుకొనవలెను. అవసర పరిస్థితు
లందు స్వసౌఖ్యములనుగూడ వదలుకొని, ఇతరుల క్షేమ
లాభములకొఱకు సర్వము త్యాగ మొనర్పవలెను. వ్యక్తి
పరముగ కుటుంబమునకు, కుటుంబము గ్రామమునకు,
గ్రామస్థులు జాతికి, జాతి ప్రపంచమునకు దోడ్పడుట
ముఖ్యావసరము. ఇటువంటి మహాకార్యములను సాధిం
చుటకై వర్ణవిభజనమెంతయో లాభకరముగనుండి, నాలుగు
వర్ణముల వారొకరిమీద నొకరు పరస్పర సహాయమును
వాంఛించి ఆధారపడియుందురు. దానివలన సంఘనియ
మముల నెల్ల పాలించుటకు వీలగునో, ప్రత్యేకముగ వ్యక్తి
గత మనోభీష్టములను నెరవేర్పనగునో ద్యోతకమగును.

మానవుడు స్వార్థమును వీడి తక్కినవారి సేవకై జీవితమును గడుపుటకు నేర్చుకొనును. కష్టపరిస్థితిలందున్న తోడి మానవునికి సాధ్యమైనంతవఱకు సహాయము జేయవలెనను ధృఢ సంకల్పము కలిగినప్పుడు స్వార్థము నశించిపోవును. అతనిలో నణగియుండిన త్యాగశక్తులు వికసించును. గృహస్థాశ్రమమునందే మానవుడు ధర్మార్థ కామముల పరిణామమును నెఱుగుటకు వీలగును. మనోనిబ్బరములేని సామాన్య మానవులకు తపోనిష్ఠ విధింపబడలేదు. సంతానమును బడసి, తద్వారా వంశాభివృద్ధి, దేశాభివృద్ధి చేయుటకు సంభోగార్హత నొసగబడెను. సంతానము కలిగిన తరువాత స్త్రీ పురుషులు కాముకులై శరీర సౌఖ్యముల ననుభవించుట కనుమతిలేదు. సంతానకాంక్షతో గావించిన సమాగమమువలన మానవుని ఆత్మశక్తి ఏలోటును కలుగబోదు. కారణ మతనిలో శరీర సౌఖ్యములను నియమనిర్బద్ధముగ ననుభవింపు దురుద్దేశము కలుగబోదు. కనుక సంతానము కలిగిన తరువాత స్త్రీ పురుషులు భగవద్ధ్యాన తత్పరులై, జీవిత శేషమును ఆధ్యాత్మిక చింతనతో ధర్మ మార్గమున గడుపవలెను.

గృహస్థ జీవితమునుగుఱించి గాంధీమహాత్ముఁడిట్లు వ్రాసినాడు:—

“ధర్మబద్ధముగ గృహస్థ జీవితమును గడుపు వారు భార్యాభర్తలైనను సంభోగసుఖము ననుభవింపగోరుట శోచనీయమని ఘంటాపథముగ జెప్పగలను. వివాహము వలన స్త్రీ పురుషులలో గల విషయలోలతను బోగొట్టి

భగవంతుని సన్నిధానమును జేరగల మార్గముద్యోతక మగును. కామతృష్ణలేని ప్రేమ భార్యాభర్తల హృదయ ములందు జనించుట అసంభవముకాదని నాయభిప్రాయము. మానవుడు పశువుకాడు. పశుజన్మ లెన్నిటినో యెత్తి కాని మానవుడుగ జన్మించడు. ఆత్మకు, జడపదార్థమునకెంత దూర వ్యత్యాసముకలదో, మానవునికి పశుత్వమునకంత వ్యత్యాసముకలదు."

( Young India, Aprial 29, 1926. )

"వివాహము మతమును సంరక్షింపఁగలదని నామనవి. సంరక్షణోపకరమగు వివాహమే నిరర్థకమైనప్పుడిక మత మెట్లు సురక్షితముగ నుండగలదు? మతమునకు పునాది ఇంద్రియ నిగ్రహము. వివాహమువలనగూడ ఇంద్రియ నిగ్రహము లభింపవలెను. ఇంద్రియనిగ్రహము లేని మానవునికి ఆత్మవికాసము కలుగబోదు. నిరీశ్వరవాదులకు, ప్రకృతియే మూలాధారమని వాదించి దాని నారాధించు వారికి, ఇంద్రియ నిగ్రహావసరము విషయమై నమ్మకము గలిగించుట కష్టమని నేనొప్పుకొనెదను. కాని దేహమనిత్య మనియు, ఆత్మ శాశ్వతమనియు నెఱిగినవాడు మాత్రము ఆత్మవికాసము కలుగవలెననిన నింద్రియ నిగ్రహావశ్యావ సరమని తప్పక గుర్తించును. శరీరము విషయలోలతకు ప్రధానకారణముగ నుండవలెను; లేదా ఆత్మవికాసము గలుగుట కాధారభూతమైనదిగానైన నుండవలెను. విష యలోలతకే ప్రాధాన్యత నొసగినచో, ఆత్మవిముక్తికే

చోటుండదు. ఆత్మవికాసము కలుగవలెననిన-చో, ఇంద్రియ నిగ్రహమును సాధించవలసియుండును."

(యంగిండియా, జూన్ 3, 1926.)

"సంతానోత్పత్తికై మాత్రమే సంభోగమొనరింప వలెనను విషయము నాకొకనూత్న సిద్ధాంతముగ దోచుచున్నది. ఇంతకు ముందివ్వవలసిన ప్రాముఖ్యత నొసగకుంటిని. అదొక పవిత్రాశయమని మాత్రమే నిన్నమొన్నటి వరకు తలచియుంటిని. కాని యిప్పుడది గృహస్థులకు ముఖ్య సూత్రము అనుభావము కలుగుచున్నది. సంఘమునందీ ముఖ్యసూత్రము నాచరణ యందుంచు విషయమై కట్టుదిట్ట మొనర్చినచో నాఆశయము నెరవేరగలదు. నాకుమాత్ర మిది ప్రాణాధారమగు ధర్మము. దానిని మనము విస్మరించి కలుగు నష్టముల ననుభవించుచుందుము."

(హరిజన్, ఏప్రియలు 25, 1926.)

గాంధీమహాత్ముండు పురుషోత్తముడను సంగతి క్రొత్తగ తెలుప నక్కరలేదు. ఆయన భారతీయులకే మార్గదర్శకుడుగాక, ఖండ ఖండాంతర కీర్తినిగాంచిన అంతర్జాతీయ విఖ్యాత పురుషుడు. గృహస్థ జీవితమును విపులముగా వర్ణించియున్నాడు. భారతీయులా సుద్బోధ నాలకించి ధర్మపథమున నడచుకొనగలరని నాయాశయము.

గృహస్థాశ్రమ జీవితమును గడిపిన తరువాత మానవుడు మూడవదియగు వానప్రస్థాశ్రమమును స్వీకరించవలెను. గృహస్థాశ్రమమునందే ఆత్మనిగ్రహమును, భగ

నద్ధ్యాన తత్పరతను, నిష్కామ యోగమును సిద్ధించుకొనిన తర్వాత మానవుడు భార్యాసమేతుడై ప్రపంచ సంబంధమును త్యజించి ప్రశాంత ప్రదేశమునందు స్థిరచిత్తుడై మోక్షమును సాధించుటకు వీలగు భగవద్ధ్యానము నొనర్చుచుండవలెను. బ్రహ్మచర్యాశ్రమమునందు సంపాదించిన ఆత్మవిజ్ఞానమును, గృహస్థాశ్రమమునందు గడించిన ప్రపంచానుభవమును సక్రమముగ నుపయోగించుకొని వానప్రస్థాశ్రమ జీవితమును గడుపవలసియుండును.

వానప్రస్థానంతరము సర్వసంగ పరిత్యాగము నొనరించి సన్యాసాశ్రమమును స్వీకరించవలెను. ఈయాశ్రయమునందు మానవుడు తానుగడుపు జీవితముద్వారానే తక్కినవారికి మార్గద్యోతక మొనరింపవలెను. అతనిలో పూర్తిగ ద్వంద్వభావము నశించి, సంబంధ త్యాగము ప్రాప్తించి, బిక్షాటనములద్వారా జీవితమును గడుపుచు విముక్తి నొందవలెను.

ఇటువంటి పవిత్రాశయములతో మనపూర్వులు మానవ జీవితమును నాలుగుభాగములుగ విభజించి, ఆయాసమయములందు నడచుకొను విధానమును నిర్ణయించిరి. అయితే కొంతమంది మహాపురుషు లీయాశ్రమక్రమమును పాటింపకయే బ్రహ్మచర్యాశ్రమమునుండి నేరుగా సన్యాసులగుట దేనికని ప్రశ్నించవచ్చును. అటువంటి వారు చాల అరుదు. ఒక్క జన్మలోనే మోక్షమునుజెంద నర్హులగు మహాపురుషులువారు. వారికసాధ్యమగునది లేదు. వారు కారణజన్ములని నాయభిప్రాయము. మత

త్రయస్థాపకులగు శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానంద స్వామి సామాన్యులా? శ్రీ శంకర, రామానుజ, మధ్వాచార్య గురుశ్రేష్టులు సామాన్యులా? వారుపుట్టుకతోడనే సన్న్యాసులు. యతిరాజులు. వారికాశ్రమ విధానముతో పనిలేదు. కాని మానవులందరు మహాపురుషులు కాజాలరు. క్రమశః జీవితముక్తిని సాధించు ప్రయత్నములను సలుపవలెను. ఈసంగతిని గుర్తించియే మనపూర్వులు మానవ జీవితమును నాలుగు భాగములుగ విభజించిరి. వారు నిర్ణయించిన విధుల ప్రకారము జీవితమును గడుపగలిగిన నెంతయో బాగుండెడిది. కాని భగవానుని లీలలద్భుతములు. సృష్టిక్రమము నిర్విఘ్నముగ సాగవలదా? మానవులందరు పరమపదగాములగుచో జగన్నాటక రంగమునందు వివిధవేషములను ధరించు వారి సంఖ్యతగ్గిపోదా? కనుక భగవంతు డేకొలదిమంది పుణ్యులకో తప్ప తక్కినవారందరికి పవిత్రజీవితమును గడుపుబుద్ధి పుట్టించడు. బుద్ధిః కర్మానుసారిణీ యనుప్రమాణమురీత్యా బుద్ధి పుట్టినట్లు మానవులు నడచుచుందురు, కర్మననుసరించి బుద్ధి పుట్టుచుండును. ఈజన్మలో చేసిన పనులకుత్తరజన్మలో వాటిఫలితమనుభవింపవలసి యుండును. కర్మవిముక్తి గలుగుటెన్నడో? గతజన్మమునందాచరించిన పనులకు, గడిపిన జీవితమునకీజన్మలో వాటి ఫలితము ననుభవింపవలెనన్నప్పుడీ జన్మలో పూర్వజన్మసంచితమునుబట్టి జీవితమును గడుపునప్పుడు సుకృతముల నాచరించుట వీలెట్లున్నది? ముందుజన్మలో విముక్తి ప్రయత్నములనెట్లు చేయ

గలము? ఈకర్మ ప్రసక్తిని గావించుట సాధ్యముకానిపని. దానిని మహామహులే తర్కించి, సిద్ధీకరించి, నిశ్చయ విధానమును నిర్ణయించుటలో పూర్తిగ కృతకృత్యులుగా లేకపోయినారు. మనకది యసాధ్యము. అయినప్పటికి మనము ముఖ్యముగా గ్రహించవలసినదే మనగా సాధ్యమై నంతవరకు, నిత్యజీవితమును సక్రమమార్గమున నడుపుటకు ప్రయత్నించుటయే. మధ్యమధ్య అంతరాయము లుండుట సత్యము. కానివాటిని ధైర్యముతో నెదుర్కొని ప్రవర్తించు టబుద్ధిమంతుల లక్షణము. అంతరాయము లెలాంటివో, వాటినెటుల నెదుర్కొనవలెనో వివరించి చెప్పుట దుస్సాధము. కారణము మానవుల జీవితములు వివిధములు. ఏక ముగా నుండవు. వారివారి పూర్వకర్మానుసారము జరుగుచుం డును. సక్రమమార్గమును త్యజింపక, సాధ్యమైనంతవరకు ధర్మమును విడిచిపెట్టకుండుటయే ధైర్యముతో నెదుర్కొ నుట. అంతరాయములు, వాటిని తప్పించుకొనుటకు భగవ ద్ధ్యానమే ముఖ్యసాధకము. కర్మప్రాబల్యము విశేషముగ నున్నచో భగవద్ధ్యాన మొనర్చుభాగ్యమెట్లు పొసగును? దీనికి జ్ఞానపూర్ణులగు మనపూర్వులు వివిధములుగ నానతి చ్చిరి. శ్రీవైష్ణవులకు పన్నిద్రాళ్వారులలో నొకరగు కుల శేఖరాళ్వారు తనముకుందమాలలో నిట్లు సెలవిచ్చియున్నారు.

శ్లో॥ నాస్థాధర్మే నవసునిచయే నైవకామోపభోగే
యద్యద్భవ్యం భవతుభగవన్! పూర్వకర్మానురూపమ్
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేపి
త్వత్పాదాంభోరుహయుగగతానిశ్చలాభక్తిరస్తు.

దీనిని నేను తెనిగించినవిధమిది.

గీ॥ పుణ్యసంపాదనమునందు; భోగసుఖము
లందులేదాశ-పూర్వకర్మానుసార
మంతయు ననుభవింతు భయంబులేక
త్వచ్చరణలగ్న భక్తిభావంబుజన్మ
జన్మంబులకు నొసగుము విశ్వస్వరూప!

పుణ్యసంపాదనమునందుగాని, భోగసుఖములందు కాని నాకాశలేదు. పూర్వకర్మ ననుసరించి సుఖ దుఃఖముల నైన, కలిమిలేములనైన సంతోషముగా ననుభవింతును. జన్మజన్మములకు నిన్ను భక్తితో ధ్యానించు మహాద్భాగ్యము మాత్రము ప్రసాదింపుము. అని కులశేఖరుడు శ్రీకృష్ణునిగురించి ధ్యానమొనర్చెను. పూర్వకర్మానుసారము జరుగబోవు సుఖదుఃఖములను సంతోషముతో నెదుర్కొని జీవితము గడుపగలనని చెప్పటలో యెంతయో ఆత్మవిశ్వాసముకలదు. దీనిని భగవద్గీతలో శ్రీకృష్ణుడుయేమనినాడు.

త్రైగుణ్యవిషయా వేదా
నిస్త్రైగుణ్యోభవార్జున !
నిర్ద్వన్ద్వోనిత్యసత్త్వస్థో
నిర్యోగక్షేమఆత్మవాన్
(2 అధ్యాయం 45-వ శ్లోకము.)

నిర్ద్వన్ద్వో అంటేఏమి? ద్వంద్వభేధబావము లేకుండుట ఇంగ్లీషులో Pairs cf Cpposites అని చెప్పవచ్చును. ఏమిటీ ద్వంద్వభేధభావము? మానవునికి జీవితములో కష్టసుఖములను, ఆహ్లాద దుఃఖములను, కలిమిలేముల నెదుర్కొన

వలసియుండును. అదితప్పదు. కలిమిలేముల బాధలేక పోయినను, కష్టసుఖములు తప్పకవచ్చును. వాటిని సమ భావముతో గడుపుటయే ద్వంద్వభేదభావమును పాటించ కుండుట. ద్వంద్వమనగా రెండు. జంట.కష్టసుఖములొకజంట. ఆహ్లాదఖేదములొకజంట.కలిమిలేములొకజంట. ఈజంటలలో ఒకటికల్గిన సంతోషము సంతృప్తిప్రాప్తించును. మరొకటి ప్రాప్తించిన దుఃఖము కలుగును. ఈభావభేదమే పనికిరాదు. చెప్పుటకు సులభమేగాని ఆచరణయందుంచుట మహాకష్టము మహాకష్టమైన పనిని సాధించుటయేగదా గొప్పవాని లక్ష ణము అతనిలో నలుగురికి గోచరమగువైశిష్ట్యము. లేనిచో సాధారణమానవుని క్రిందనే పరిగణించెదము. ద్వంద్వవిభేధ భావమేలేనివాడు సాధారణుడా? అతనికి ఆత్మవికాసము లభించిననేకాని భేదభావ రాహిత్యము సాధ్యపడదు. కర్మా నుభవమును తప్పించుకొనుట సాధ్యముకానిపని గనుకను మానవునికి జన్మరాహిత్యమే దృష్టిలో ప్రధానాశయము గను కను సాధ్యమైనంతవరకు పూర్వులు విధించినమార్గమున నడచుటయే శ్రేయోదాయక విషయము. ద్వంద్వభావ విభేద మును పరిగణింపని మహనీయుడు గనుకనే ధైర్యముగా నీపాదపద్మ సంస్మరణభాగ్యము నొసగుమని శ్రీకృష్ణుని ప్రార్థించినాడు. అంతేగాకుండ సంసారాబ్ధియందు మునిగి దరిదాపుగానక తబ్బిబ్బులాడు మానవునికి క్రిందివిధముగా సలహానిచ్చినాడు.

శ్లో॥ భవజలధిగతానాం ద్వన్ద్వవాతాహతానామ్
సుతదుహితృకళత్రత్రాణభారార్దితానామ్
విషమవిషయతోయే మజ్జతామప్లవానామ్
భవతిశరణమేకో విష్ణుపోతో నరాణామ్ ॥

అనగా సంసారసముద్రమును పొందినవారును, ద్వంద్వము లనెడిగాలిచే కొట్టబడిన వారును, పుత్రకళత్రాదుల భారముచే పీడింపబడినవారును, విషమంబులగు విషయము లనెడి యుదకమునందు మునిగినవారును, తెప్పలేనివారును అగునరులకు విష్ణువనెడి యోడయొకటియే శరణ్యమగును. ఇందులో మనము గ్రహింపవలసిన ముఖ్యవిషయమేమనగా అనుభవించుటకు ఇంద్రియములు, అనుభవింపఁడుటకు విషయములు, మొదలగువానిని భగవంతుఁడొసంగి నప్పటికి, భగవద్గీతలో రెండవ అధ్యాయము 65 శ్లోకములో చెప్పబడి నట్లు రాగద్వేషములు త్యజించి, విషయముల ననుభవింప వలెను. కాని ఇంద్రియములకుమించి విషయమున ప్రవేశింపచేయు స్వభావములేదు. అదిదుర్మార్గముననే పోవును. వాటిని స్వాధీనమందుంచుకొని, పుణ్యకార్యముల నొనర్ప వలయుననిన ప్రతిపనియు భగవదార్పణమని సలుపవలసి యుండును. భగవదర్పితములుగ గావింపబడు పనులు దుష్కృతములనిపించుకొనవు. మానవుడంతటి పశువర్తనుడు కాజాలడు. నాస్తికుడై స్వేచ్ఛావిహార మొనర్చు వానికి భగవంతుడొకడు కలడనేచింతయుండదు. కానిభగ వద్భక్తి కుదిరినవాడు భగవంతుని పేరిట దుష్కృత్యములను సలుప సాహసింపడు. కనుకనే ప్రతిపని భగవదార్పణ

ప్రొనరింపవలెనని శాస్త్రములు విధించినవి. సుకృతములనే ఆచరించునప్పుడు పాపమువచ్చుననను భీతియుండదు. పాపపంకిలమునందు తగుల్కొనినవానికి భక్తి కుదురదు. భగవద్భక్తునికి మోక్షము కరతలామలకము. కులశేఖర నృపుడు సంసార జలధినిమగ్నులకు విష్ణువనెడి యోడయొకటియే శరణమగునని చెప్పినాడందులకే.

వర్ణాశ్రమ ధర్మములను స్థాపించి, మానవజీవితమును సంఘక్షేమమును చక్కగా సాగించు ప్రయత్నమునందే కలదు, మనపూర్వుల సునిశిత మేధాశక్తి. వర్ణధర్మములందుకాని, ఆశ్రమధర్మములందుకాని వ్యత్యాసమును పాటించుటకు వీలులేదు. అన్నియు సక్రమముగా నెరవేరిననేగాని పూర్ణత్వము సిద్ధించదు. బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య, శూద్రజాతులలో నేది గొప్పయని నిర్ణయించుటకు వీల్లు ఎట్లుండదో, అట్లనే విభాగములందుకూడ చిన్నదని గొప్పదని విడదీసి చెప్పుటకు వీలుండదు. ఒకదానికి మరొకటి యుపకరణముగ భావింపవలసి యుండును. ఏయొక యాశ్రమమునందు జీవితమును గడిపినను మానవుడు మోక్షమునకర్హుడే. ముఖ్యముగ పరిగణించవలసిన దతని ఆచరణయే-

నేడు భారత దేశమునందు వర్ణ ధర్మములు చెల్లాచెదరై పోయినవి. నాలుగు వర్ణముల వారలలో ఎక్కువ తక్కువల పోట్లాటలు చెలరేగినవి. ఆశ్రమ ధర్మములు పూర్తిగనశించినవి. ఒక్క గృహస్థాశ్రమము తప్ప తక్కినవి పేర్కొనకైనలేవు. వాటిని తలచేవారే లేరు. గృహస్థా

శ్రమ ధర్మములనైన సక్రమముగా నడిపేవారు చాల తక్కువగా నున్నారు. గృహస్థాశ్రమ స్వీకారార్హతను గలిగించునది వివాహము. వైవాహిక ధర్మమే పూర్తిగ విస్మరింపబడినది. నేడు వివాహమనిన స్వల్పకార్యమని తలప బడుచున్నది. వివాహ బంధమును ద్రెంచుట దుస్సాధమని మన పూర్వులు విధించి యుండిరి. పరిణయ మొనర్పబడిన స్త్రీపురుషులకు తద్బంధమును విచ్ఛేద మొనర్చి విడివడుట కేవో కొన్ని ప్రత్యేక విషమ పరిస్థితులందో తప్ప అనుజ్ఞ లేకుండెడిది. సంతానము కలుగకుండి, యికముందు కలుగునను ఆశ లేక పోయినప్పుడు కేవలము సంతానమును వాంఛించి వేరొక యువతిని చేబట్టుటకు పురుషుని కనుజ్ఞ నొసగబడినది. అదేయభిప్రాయముతో సతీవియోగము ననుభవించిన వానికి ద్వితీయ వివాహమున కనుజ్ఞ యీయబడినది. అంతేగాని శరీర భోగములనుభవించువారికి, పశువృత్తికి పాల్పడువారికి, ద్వితీయ వివాహము జేసికొనెడి యర్హత లేదు. భార్య యెంత పతివ్రతలైనను సచ్ఛీలలైనను దుర్మార్గుడై, విపరీతమగు కామవాంఛను కలిగి దుష్ప్రవర్తనకు పాల్పడిన భర్తను విడనాడుటకు స్త్రీల కనుజ్ఞ నొసగబడినది. ఇదేవిధముగా మరికొన్ని ప్రత్యేకవిషమ పరిస్థితులందు వివాహితులగు స్త్రీ పురుషు లొకరి నొకరిని వీడుటకు వీలుండెడిది. ఇప్పుడటులకాదు. భార్యాభర్తలలో నేయొకరి కిష్టములేక పోయినను వైపరీత్యామేమినను యొకవ్యక్తికైనను ఇతరజాతికి సంబంధించిన వ్యక్తిపైన కామవాంఛయున్నయెడల విడిపడుటకు అవ

కాశము లేదని పొగులుచుండుట మనము చూచుచునే యున్నాము. ఈదురలవాటు పాశ్చాత్య ఖండముల యందాచరణలో నున్నది. ఏ కారణములవలననో, ఏ సంఘోద్ధారకుని బుద్ధివైపరీతత్యమువలననో ఈ విడాకుల చట్టము బయలు దేరదీయ బడినది. ఆ దేశములందు వివాహమే చులకనగ చూడ బడుచున్నది. ఇష్టమున్నంతవరకు వివాహితుల స్త్రీ పురుషు లొక చోట కలసియుందురు. కాని యెప్పుడైతే మనస్పర్ధలు బయలు దేరునో అప్పుడుమట్టుకు వియోగమునకు ప్రయత్నింతురు. బహుశా వారి పూర్వులీ చట్టమును నిష్కారణ బాధితులగు వ్యక్తుల మనోవిచారమును, శారీరక బాధలను మాన్పదలచి, దుష్టులబారినుండి తప్పించు నుద్దేశముతో ప్రతిపాదించి యుండవచ్చును. ప్రతిదేశము నందాచార విషయము నందు లోప మేమాత్రము లేకపోయినను, ఆచరణ యందుం చుటలో మహాలోపమును సలుపుచుండుట సర్వసాధారణమైపోయినది. అదేవిధముగ విడాకులచట్టముయొక్క ముఖ్యోద్దేశమును మరచి నేడు పాశ్చాత్యులు కామ ప్రకోపితులై లేక ఈర్ష్యావేశపరులై భార్యాభర్తల వియోగమున కుపకరించులాగున యీచట్టమును అమలునందు పెట్టుచున్నారు. పైగా వారి నావిషయమై ప్రస్తావించినచో చెప్పు సమాధానమే విచిత్రము. స్త్రీ పుష్పమువంటిది. దాని నాఘ్రాణించుటకు పురుషుడను తుమ్మెదకు సర్వ హక్కులు కలవు. ఈ విచిత్రవాదన పశుప్రవృత్తికి బాల్పడు వ్యక్తులు మన దేశమునందున్న వారుకూడ చెప్పుచుందురు.

పాశ్చాత్యుల దృష్టిలో స్త్రీ ఒక పుష్పముతో సమానమై పోయినది. ఒకరి భార్యను మరొకడు స్పృశించును. అది ఏభావముతోనైననుసరే. వీలుండిన పక్షమున చాటుగ నైనను, బహిరంగముగనైనను, సంభోగమొనరించినను తప్పిదముక్రింద పరిగణింపబడదు. అట్లు చేసినప్పుడు స్త్రీ పురుషులలోనే యొకరైనను మరొకరిని మందలించినచో, వెంటనే సంబంధ విచ్ఛేదమునకై ప్రయత్నింతురు. వారికి విడాకుల చట్టము వజ్రాయుధము. సివిల్ కోర్టులో ముందుగా విడాకులకు దరఖాస్తులిచ్చి, ఆరునెలల ముద్దతు పూర్తియైనతర్వాత న్యాయాధికారి అనుజ్ఞాపత్రమును బడసి విడివడిపోవచ్చును. భార్యయే వెళ్లునప్పుడు పిల్లలతో పనియేమని యనుకొనిన పురుషుడు భార్యాపిల్లలను సైతము విడనాడవచ్చును. సంతానముండిన భార్యాభర్తలు విడాకులిచ్చుకొనినచో పురుషునివద్దనే పిల్లలనుంచి స్త్రీ లేచి పోవచ్చును. ఈసంబంధ విచ్ఛేదమున కనుజ్ఞబడసిన మరుక్షణమునుండి అంతవరకు ప్రేమతో సంసారముచేసిన స్త్రీ పురుషులు వేరువేరు వ్యక్తులుగ పరిగణింపబడుదురు. దీనిని మనము 'ఎక్స్చేంజ్' అని అనవచ్చునేమో? తొలుత వాంఛ తరువాత, సంభోగము అటుపిమ్మట పరిత్యాగము. వీటితో వివాహధర్మముయొక్క ప్రతిబంధకమును త్రెంచుకొనుటకు వీలుకల్పింపబడినది. సిగ్గెగ్గులులేకుండా ఒకరితో కాపురము చేసి వ్యభిచారిణియై కామవాంఛకు లోనయి దుర్మార్గ ప్రవర్తనకు గడంగు స్త్రీకి మానవత్వమేలేదు.

మనపూర్వులు నిర్ణయించిన వైవాహిక ధర్మవిధు లెంతటి విశిష్టార్థగర్భితములో నేటి సంఘసంస్కర్తలు అర్థము జేసికొనకుండ నున్నారు. ఆధర్మమేదియో మనమాలో చించి ప్రవర్తించవలెను.

పురుషులతోబాటు గృహలక్ష్మలని గౌరవముగ పిలిపించుకొనిన స్త్రీలుకూడ పాశ్చాత్య నాగరికతా పిశాచమునకు దోసి లొగ్గి నడచుచున్న విషమ పరిస్థిలందు, వాటిని పోగొట్టి మరల భారత జాతీయ నాగరికతను పున రుద్ధరించవలసిన విద్యార్థికుల కర్తవ్యము మహత్తరమైనది. స్వేచ్ఛావిహారమును సాగించు, సాగించుటకు కుతూహల ముండి అవకాశమునకై వేచియుండు, స్త్రీ పురుషుల సంఖ్య దినదినమువృద్ధియగుచున్నది. దేశసౌభాగ్యమునువాంఛించు వారినిప్పుడుపాతదృష్టికీసంగతి సత్యమేననిగోచరింపకతప్పదు.

అసలే పరాధీన స్థితియందున్న భారతజాతి నుద్ధరించు టకు విద్యార్థికులు ప్రయత్నించవలెనని పైన తెలిపి యున్నాను. ఆర్థికముగ, రాజకీయముగ, సాంఘికముగ భారతజాతి దుస్థితిలో నున్నసంగతి ప్రతివారికి తెలియును. ఇక మిగిలిన సుగుణమేమి? అది నైతిక శక్తియే. భారతీ యుల నైతికశక్తివిశేషము జగద్విదితము. నేటిదికాదా గొప్ప విశేషము. పాశ్చాత్యదేశము లంధకార పరిస్థితి యందు లెన్ను గానక హీనావస్థ యందున్న నాడే భారత దేశ మాధ్యాత్మిక సందేశమును చాట బంచినది ప్రాచ్యపా శ్చాత్యదృక్పథ విభేదమును శ్రీవివేకానందస్వామి యీరీతిగ వేదాంత సొసైటీ,సమక్షమున న్యూయార్కు నగరమునందు "My master" అను విషయముపై నుపన్యసించెను.

" పాశ్చాత్యుల దృష్టిలో విషయ సుఖాత్మకమగు ప్రపంచ విధాన మెంత గొప్పదో ఆధ్యాత్మిక విజ్ఞానశక్తిని పెంపొందింపచేయు ప్రపంచ విధానము ప్రాచ్యుల దృష్టిలో యంతగొప్పది. ఆధ్యాత్మిక శక్తియే ప్రాచ్యునికి కావలసిన సర్వస్వము. దానిని సంపాదించుటకు సర్వము త్యాగమొనరించును. కాని, పాశ్చాత్యున కదియంతయు స్వప్న భ్రాంతిగా దోచును. పాశ్చాత్యుడు వినశ్వర పదార్థములను చూచి మురిసి జీవితమంతయు వాటిని తయారు చేయుటకు ధారపోయునని పరిహసించును. ప్రపంచాభివృద్ధికి ప్రాచ్య పాశ్చాత్య దృక్పథములు రెండు కావలెను. బాగుగ నాలోచించినచో ఆధ్యాత్మిక శక్తియే ముఖ్యముగా ప్రతి మానవుడు వృద్ధిచేసుకొనవలెనని నాయభిప్రాయము. యంత్ర నిర్మాణమువలన ప్రజాభివృద్ధి కాజాలదు. యంత్ర నిర్మాణ కార్యమునందు మానవునికి శాంతి లభింపదు. అయితే యీయంత్రనిర్మాణ కార్యవిధానమేమి ? ఒకతీగె ద్వారా విద్యుచ్ఛక్తిని బ్రసరింపచేయుగలవానిని గొప్పవానిగ, మేధావంతునిగ గౌరవించవలెను. మానవుడు సమకూర్చు దానికన్న లక్షరెట్టింపులు ప్రకృతి అనుక్షణము సల్పుటలేదా ? ఐనచో ప్రకృతినేల ఆరాధింపకూడదు. భౌతిక ప్రపంచముమీద ఎంతఅధికారమున్నను మానసిక వికాసము కలుగనియెడల నది నిరర్థకమేగదా ? ప్రకృతిని స్వాధీనపర్చుకొనుటకే మానవుడు జన్మించినాడని పాశ్చాత్యుల వాదన నిజమే. కాని వారిది సంకుచితాభిప్రాయము. ప్రకృతియనిన బాహ్యప్రపంచమేగాదు. మానవుని

యందాంతరంగిక ప్రపంచమెంతు కలదు. దానిని వారె రుగలేకపోవుట విచారకరము. ఆకాశపథమును చుంబించు మహోన్నత శిఖరములతో నొప్పు పర్వత పంక్తులును, సముద్రములును, నదులును, తక్కినపదార్థ జాలముతోను దృష్టికి మహాశ్చర్యవంతముగ గోచరించు ప్రకృతి రామణీయకము వర్ణనాతీతమే. కాని దానికన్న మించిన మహత్తర సుందర ప్రకృతి యొకటి మానవునియందు సృష్టిగతముగ విరాజిల్లుచున్నది. అది సూర్య చంద్రులకన్నను నక్షత్ర పంక్తులకన్నను, మనము నివసించు భూమికన్నను, బాహ్య ప్రపంచమునకన్నను విశాలమైనది. దానిగొప్పతనము నెరుగుట కెంతకాలము ప్రయత్నించినను తనివితీరదు. అంతరంగిక ప్రకృతి నెఱుగ గావించుకృషియందు బాహ్య దృష్టిమీదనే యాధారపడు పాశ్చాత్యులను మించగలరు ప్రాచ్య దేశీయులు. కాబట్టి భగద్విశేషములను బోధించు సమయమునందు ప్రాచ్యులే ముందంజ వేయుగలరు. బాహ్య ప్రకృతి నెఱుంగగోరినచో పాశ్చాత్యుల నాశ్రయింపవలసి వచ్చును ప్రాశ్చఖండ వాసులకు.

భారతీయుల దృక్పథమును మీకు వివరింపవలచితిని. వస్తుసామగ్రిని తయారుచేయు ప్రయత్నమునందు సర్వస్వమును ధారపోసి కన్నుమిన్నుగానక ప్రవర్తించి, కడుపారత్రాగి, తిని సుఖించి ఆస్తిపాస్తులను సంపాదించుకొని విషయ భోగములననుభవించి, ఐశ్వర్యమే భగవత్స్వరూపమని స్వేచ్ఛావిహారముతో జీవితమును గడుపుటయే యాదర్శమని భావించి, మరణించు పాశ్చాత్యులు భారతదేశమునకు

వచ్చిననేమి కాంచగలరు ? బీదరికము, మూఢవిశ్వాసము, అంధకారము, భీరత్వము. ఎచటచూచిన నివే ప్రత్యక్షమగుచున్నవి. వీటికి కారణమేమి ? వారికాత్మవికాసమనిన, చక్కనిదుస్తులు, విద్య, సాంఘిక విషయప్రసంగమే యని గోచరించును. తమ ఆస్థి పాస్థులను వృద్ధిజేసికొనగోరి యావజ్జీవితమును ధారపోయుటయందే పాశ్చాత్యులాత్మతృప్తిని జెందెదరు. భారతీయులట్లుకాదు. దేశ సరిహద్దులను దాటి పరరాజ్యాక్రమణకు పాటుపడకుండ, ఇతరుల సొమ్మునపహరింపకుండ, ఉత్తమ ఆదర్శములతో జీవితమును గడుపు జాతి వివిధమానవ జాతులలో నొక భారతజాతియే. వారుచేసిన నేరమేమి ? వారి స్వాధీనమునందుండిన భూములు సారవంతములైనవి. వారిదసాధారణ మేధాసంపత్తి. వారి భాగ్యము స్వార్జితము. ఐనప్పటికి భారతదేశ సౌభాగ్యము పరదేశీయుల నాకర్షించినది. వారు దానిని చూచి యానందపడక దండయాత్రలను సలిపి వినాశనమొనర్ప బ్రయత్నించిరి. ఇతరులు దండెత్తివచ్చి దేశసౌభాగ్యమును కొల్లగొట్టి పరాజితుల నొనర్చినను, పైపెచ్చు అనాగరికులని ఈసడించినను, శాంతముతో సహించి యూరకుండిరి. దానికి బదులుగా మానవప్రకృతి యందణగియున్న మహాత్మ్యమును పాశ్చాత్యులకు బోధించుటకు బూనుకొనిరి. మానవునియందుగల దుష్టశక్తుల నడచుమార్గము నుపదేశించిరి. భోగలాలసతతో కాలముబుచ్చు మానవుని జీవితము నిష్ఫలమని వారికి తెలియును. ఆత్మవికాసములేని జీవితమొక

స్వప్నమువంటిదని వారు గ్రహించుకొనిరి. ఆధ్యాత్మికశక్తి మహత్వమును వారు కృషి సల్పి జీర్ణించుకొనినారు. ఆశక్తిని పాపముకాని, అగ్నికాని, మృత్యువుకాని నశింప చేయలేవని వారినమ్మకము. పాశ్చాత్యులు సంతోషముతో తుపాకిగుండు నెట్లు ఎదుర్కొనగలరో, దేశాభిమానమును పురస్కరించుకొని మహాధైర్యముతో నెంతటి సాహస కృత్యములనైన నవలీలగా చేయగలరో, అట్టులనే భారతీయులు భగవంతునిపేరిట గొప్ప త్యాగశక్తిని ప్రదర్శింపగలరు. దేశమెంతటి దౌర్భాగ్య స్థితియందున్నను ఋషిపుంగవులు జన్మించకపోవుటలేదు. వారొసంగు దివ్య సందేశము భారతీయులకు ప్రాణాధారము. అదియే వారి ప్రాణశక్తి. రాజకీయములందు, పదార్థ విజ్ఞాన శాస్త్ర నైపుణ్య ప్రదర్శనమునందు, పాశ్చాత్యదేశములందెట్టివంటి ప్రముఖు లుద్భవించిరో, భారతదేశమునందు వారికన్న మించిన మేధాసంపత్తి కలిగిన ఆధ్యాత్మిక విజ్ఞాన ప్రముఖు లుదయించిరి. కత్తినిదూసి భయపెట్టినను శతఘ్నికాది మారణ యంత్రములనుపయోగించి నిర్వీర్య మొనరింప బ్రయత్నించినను, కుతంత్రములనుబన్ని ప్రజాకలహమును లేవదీసినను, దేశసౌభాగ్యమెంత కొల్లగొట్టబడినను భారత జాతి నశింపగలదా? ఎన్నటికట్లు జరుగదు. భారతీయుల హృదయములందనాదినుంచి సుస్థిరముగ నిలచిపోయిన ఆయాధ్యాత్మికశక్తి క్షీణించిపోనంతవరకు, వినాశము దాపురించదు. తినతిండిలేక మలమల మాడిపోదురుగాక! కట్టుటకు గుడ్డ, ఉండుటకు చోటు లేక అల్లాడిపోదురుగాక!

జీవితాంతము దుఃఖభాజనమగు జీవితము గడుపవలసివచ్చు గాక! ఏమాత్రము చలించరు. వారికి భగవన్నామ సంస్మరణ మహద్భాగ్యము పోనంతవరకేలాటి చింతయుం డదు. పాశ్చాత్యులు తమ మూలపురుషుడే మహావీరుడో యని, ఏభాగ్యవంతమైన దేశమును కొల్లగొట్టి దాని స రాజ్యముగ మార్చిన గొప్పవాడో యని చెప్పుకొని యెట్లు గర్వింతురో భారతీయులుకూడ విపినప్రదేశములందు ఘోర తపస్సుజేసి విజ్ఞాన బీజములను నలుదిక్కుల వెదజల్లిన ఋషి పుంగవులను తమ మూలపురుషులని చెప్పుకొనుట కట్లు గర్వింతురు. భగవత్సాక్షాత్కార భాగ్యమును గాంచిన వారి సంతతియని చెప్పుకొని గర్వించుటే భారతీయుల జన్మ హక్కు. అది సురక్షితముగనున్న నంతేచాలు. ప్రాపం చిక సౌఖ్యములను జీవితాంతము కొరతపడకుండ ననుభ వింపలేదేయని యేమాత్రము దిగులులేదు."

భారతభూమిని అనేక పేర్లతో బిలుచుచుండుట మనము వినుచుందుము. 'వేదభూమి,' 'కర్మభూమి,' 'తపోభూమి,' 'ఆధ్యాత్మిక విజ్ఞాన చంద్రికలు విలసిల్లిన స్వర్గసీమ' అనియు, 'రత్నగర్భ' యనియు చెప్పుచుందురు. తక్కిన దేశముల నీపేర్లతో మన భారతీయులుగాని, ఆయాదేశవాసులుగాని, పిలచుట మనమింతవఱకు వినియుండలేదు. ప్రత్యేకముగ మన మాతృదేశమునే పిలచుటయేల? ఇతరులుపై పేర్లతో, బిలిచెదరా? యని శంకించవచ్చును. కాని, భారతీయులు తమ మాతృదేశము నావిధముగ్గ సంబోధించి గౌరవించుట లేదా? ఎవరితల్లిని వారు గౌరవించిన రాణించునేగాని

వారు మరచి కూర్చొని ఇతరులు గౌరవించినను లాభమేమి? పై పేర్లతో, లేక భారతీయులు తమ మాతృదేశమును సంబోధించు తక్కిన గౌరవనామములతోగాని, మన దేశమును పాశ్చాత్యఖండవాసులు పిలువకున్నను, ఆధ్యాత్మిక విజ్ఞాన సందేశమును దవ్వుదవ్వులఁ బ్రాకింపజేసిన గౌరవము భారతావనికే అబ్బునని అంగీకరింపలేదా ?

అనేక వేలేండ్లు ఘోరతపస్సుచేసి, భగవత్సాక్షాత్కార భాగ్యమును వడసి, పునర్జన్మరాహిత్య వరమును సంపాదించిన మన పూర్వ ఋషులు ప్రపంచముతో పునః సంబంధమును వాంఛింపక దేహత్యాగమును గౌరవించిరా? లేక, తమకు కరతలామలకమైన ఆధ్యాత్మిక విజ్ఞానమును, భగవత్సాక్షాత్కార మార్గగమన రహస్యమును, దీర్ఘ శ్రమచే సిద్ధించిన తపోయోగ ఫలితమును, హృదయ కుహరమునందు భద్రపఱచుకొని కాంతారసీమలలోనే జీవితములను గడిపినారా? లేదు. ఒకవ్యక్తి సంపాదించిన దివ్య శక్తి కారణముగ జాతిఅంతయు లాభముపొందవలెననియే వారి ఆశయము. తమజాతి బాహ్యశక్తినంత ప్రధానముగ నెంచక, అంతశ్శక్తిమీద నాధారపడవలెననే తలంపుతో తాము సంపాదించిన అనుభవములనుబట్టి సులభోపాయములను బోధించిరి. అంతశ్శక్తి సంపన్నుడగుటకు మానవునికి దౌర్జన్యముతో నిమిత్తముండదు. కనుక, వారు బాహుబల ప్రదర్శనమునకన్న, అహింసకే ప్రధానస్థాన మొసంగిరి. వ్యక్తిగత ప్రత్యేకాభిరుచులను, శక్తిసామర్థ్యములను జాగ్రత్తగ పరిశీలించి, ఆయావ్యక్తుల కనుగుణ్యమైన

పద్ధతులతో ఆధ్యాత్మిక సందేశమును హృదయముల కెక్కించిరి. తీక్షణమైన చూపుతో, పెదవికదలికతో శిరఃకంపముతో, దోసెడు నీళ్లతో, కొమ్ములు తిరిగిన ఎటువంటి బాహుబల సంపన్నులనైనా భస్మీపటలము గావించగల మంత్రశక్తి కలిగియున్నను, వారటుల నాశనముగావింపక క్షమామూర్తులై అహింసనే ప్రదర్శించిరి. ఇందులోనే గలదు వారి విశాల హృదయతత్వము, వారి అసమాన ప్రతిభ, వారి సర్వమానవ సౌభ్రాతృత్వము, వారి మానవ కళ్యాణవాంఛ! ఇటువంటి మహాపురుషులు జన్మించినందుననే భారతదేశమును 'తపోభూమి' 'కర్మభూమి' అను పేర్లతో బిలిచి గౌరవించుట.

భారతదేశ మొకప్పుడెట్లుండెడిది ?

"సుజలాం, సుఫలాం, మలయజ శీతలాం,
సస్య శ్యామలాం,'
శుభ్రజ్యోత్స్న పులకితయామినీం,
ఫుల్లకుసుమిత ద్రుమదళశోభినీం,
సుఖదాం, వరదాం."

ఎచటజూచినను కనుల కానందమును గొలుపు పచ్చని పైరులతోను, అమృతోపమానమగు జలమునొసగు పుణ్య నదులతోను, నిశ్చల తపస్సమాధి సాధనకుపయుక్తమగు ప్రశాంత ప్రదేశములతోను మన చల్లనితల్లి-బంగారు తల్లి-విరాజిల్లుచుండును. ఏభాగమును పరికించినను, అచట మంటిపెడ్డసైతము మృగీమద సువాసనా శోభితమే. ఎచట త్రవ్వినను బంగారురాసులే; వజ్రవైడూర్యములే;

కెంపులు పుష్యరాగములే; నీలగోమేధికములే. మూడు వైపులనున్న అపార జలరాశియందు మున్కలువేయుట తడవుగ చేజిక్కినవి ముత్యాలరాసులే. స్వాతివర్షపు జినుకులుసైతము ముత్యాల పంటనే పండించుచుండెడివి. ఇక నేమి తక్కువ? రత్నాకరునిచే పరివేష్టింపబడిన పుణ్య భూమి 'రత్నగర్భ' కాకుండునా? మహత్తర తపోసంపన్నులగు పూర్వఋషుల శుభాశీర్వాద ఫలితమువలన సస్య శ్యామలోపేతమై యుండకపోవునా? నిత్యకళ్యాణము, పచ్చతోరణమేగదా నాటి మాతృదేశ సౌభాగ్యము! బంగారు బొజ్జగల తల్లి-రత్నాలరాశిని గర్భమునందు దాచుకొనిన తల్లి-యొక్క చల్లని కడుపున జన్మించినవారికి దుర్భిక్షమెక్కడిది? ఆహా! మన భారతదేశము నిండుశోభతో విరాజిల్లుచున్నప్పుడు జన్మించిన పూర్వుల అదృష్టమెట్టిదోగదా!

ఇంతటి కని విని ఎఱుగని సౌభాగ్యమును కలిగిన 'రత్నగర్భ' లో జన్మించియు, మనపూర్వులు ఐహిక సౌఖ్యములు శాశ్వతములని విశ్వసింపక, ధనరాసులే జీవిత పరమావధియని తలపక సర్వసంగ పరిత్యాగులై, దుర్గమారణ్య ప్రాంతములందు నివసించి, ఘోరతపశ్చర్యగావించి, ఆధ్యాత్మిక సందేశము నొసగిరనిన సామాన్యవిషయమా? ఇప్పటివలెనప్పుడు 'ధనమూల మిదమ్ జగత్' ను పనికి మాలిన వాదము వినబడెడిది కాదనుటకు, ప్రాపంచికైశ్వర్యభోగమునకన్న, ఆధ్యాత్మిక విజ్ఞానైశ్వర్యమే వారి నెక్కువగ నాకర్షించినదనుటకిది ప్రబలతార్కాణముకాదా?

వ్యయపఱచినకొలది ధనరాసులు తరుగుచుండును. కాని, విజ్ఞానైశ్వర్యము వృద్ధిచెందుచుండును. ఆకారణమున మన పూర్వులు కష్టపడి సంపాదించిన ఆధ్యాత్మిక విజ్ఞానైశ్వర్యమును తమజాతికి మాత్రమేకాక, తక్కిన జాతులకు పంచిపెట్టిరి. అదియు నెప్పుడు? లేమిచే కొంత వఱకు వెనుకబడియుండి, నాగరికతయననేమో ఎఱుగక, ఆధ్యాత్మిక చింతనయేలేని అంధకారదశయందు. కాని, దురదృష్టవశాత్తు, తక్కినజాతులు కృతజ్ఞతను జూపింపజాలక బోయినవి. బహుశా కృతజ్ఞత పెదవులమీద నుండును గాని, హృదయమునందు లేదేమో! విజ్ఞానైశ్వర్యమును పంచిపెట్టబడినప్పుడు దానివిలువ నెఱుగకయో, లేక తమకు పనికిరాదనియో, దురూహపడి సద్వినియోగపఱచుకొనలేక పోయినవి. క్రమశః భారతీయులు వర్తక వ్యాపారములు సాగించినప్పుడే, వేలలేని పలురకముల రత్నాలరాసులను పాశ్చాత్య వ్యాపారులు చూడగలిగినప్పుడే, వారికి భారతదేశమెంత ఐశ్వర్యవంతమైన భూమియో యెరుకబడినది. దానితో వారికండ్లు మిరుమిట్లుగొనుటయేగాక, జిలజిలమని నవి ఊర్ష్యతో. ఎన్నాళ్లోకాదు. విజయనగర సామ్రాజ్యాధీశుడగు శ్రీకృష్ణదేవరాయుల కాలమునందు భారతదేశముతకు వర్తకము నిమిత్తమై వచ్చిన యొకానొక ఇటలీదేశస్థుడు, తనదేశమువారు ఇచటనుండి లక్షలాది ధనమును వెచ్చించికొనుచున్న రత్నములనుచూచి అచ్చెరువడి రత్నాల వ్యాపారమనుమిషతో భారతీయులు ఇటలీని దోపిడి చేయుచున్నారని వాపోయినాడట! దీనినిబట్టి

తెలియఁగలదు, మన దేశమేల 'రత్నగర్భ' యని గౌరవింప బడినదో. ఒకరు పచ్చగనున్నచో మరొకరు చూచి యోర్వలేకుండుట మానవునిలోనున్న దుర్గుణములలో ప్రధానమైనది. కాని, యిచట యావద్భారతావని పచ్చగానే ఉన్ననిక విదేశీయులకు కడుపునొప్పి లేకుండ నెట్లుండగలదు? ఉపకారమునకుబోతే, అపకారము వెంట వచ్చినదట! ఆధ్యాత్మిక విజ్ఞానసందేశము నందించినందుకు ప్రతిఫలముగ మన దేశ సౌభాగ్యము ఇతరుల కన్నుగుట్టుటకు కారణమైనది. వర్తక వ్యాపారములను మిషతో, భూగోళ పరిశీలనమను పేరుతో, స్వమత ప్రాశస్త్య నిరూపణ ప్రయత్నమను వంకతో, నలుదిక్కులనుండి పండిన జొన్న చేలుమీఁదవ్రాలు ఆకలిగొన్న పక్షులవలె వ్రాలినారు. ప్రప్రథమమున మునిఫంటితో గారికి రుచిజూచు భాగ్యము లభించినది. రుచిమరిగిన కోడి ఇల్లెక్కి కూయదా? ఇక నదేపని. ఎన్నాళ్లు పక్షులు పీకిపాడుచేయు చేలను కంకు లుండుట? కొంతకాలమునకు మొదలంట నాశనమైనది. ఇప్పుడున్ననో కంకివేయు శక్తియే గోల్పోయినది. పోనీ, కష్టపడి పండించుకొనినను, ఏకుమేకై కూర్చొనిన పక్షులు బ్రతుకనిస్తేనా! అహా!! ఎంతటి నికృష్టదశ!!!

గర్భనిర్భేదకమగు దారిద్ర్యము ననుభవించుచున్నను భారతీయులు విజ్ఞానైశ్వర్యమును తాకట్టు పెట్టజాలరను సంగతి జగద్విదితము. దానిని జూచుకొనియే భారతీయాత్మ కలతపడినను సజీవముగనుండ గలిగినది. మనకు కలిగిన ఆర్థిక దుస్థితితోనే విలపిల్లుచు నుండ ఆధ్యాత్మిక విజ్ఞా

నము మాటటుంచి, జాతీయ నాగరికతయే పనికి మాలిన
దని భారతీయులే తలపోయుట, దానియందు నిరాదరణ కలిగి
విదేశీయ నాగరికత క్రులు జాచుచుండుట, మనము
గ్రహించుచున్న విషయమే. ఒకకన్ను గ్రుడ్డిదైన నెట్టులో
జరుపుకొనవచ్చునుగాని, రెండుకండ్లు పోయిన చేయునదే
మున్నది? అంధకారమేగదా! ఈ అంధకారము తెచ్చిపెట్టు
కొనినదేకాని సహజముగ భారత జాతికి సృష్టిగతముగ
సంక్రమించిన లోపముకాదు.

అబ్బాయీ! ఏయే యోగ్యతలను సంపాదింపగలి
గితివని ప్రశ్నించిన, మాతాతగారు తహశీల్దారనియు,
మాతండ్రిగారు జిల్లాకోర్టు హెడ్ క్లార్కు అనియు, చెప్పుకొని
తన యోగ్యతను నిరూపించ దలచుకొను వెఱ్ఱివాని సంతో
షమువలెనున్నది. మనప్రస్తుత పరిస్థితి. మనపూర్వుల కీర్తిని
జెప్పుకొనుచు మనము బ్రతుకుచున్నాము. అంతేకాని,
భారతజాతికి ప్రధానలక్షణములుగ నుండవలసిన ఆకార్యద
క్షత, ధైర్యశౌర్య సత్యశౌచములు, ఆధ్యాత్మిక విజ్ఞానము
మనకలవడలేదు. గీతాకారుడు సెలవొసగిన ప్రకారము
పుట్టుకతోగాక నడవడివలననే మానవుడు బ్రాహ్మణుడని
పించుకొనును. తాత తహశీల్దారుడయితే మనమడు కాగ
లడా! పూర్వుల కీర్తిచంద్రికలు నల్దెసల బ్రకాశించినమాట
వాస్తవమే. కాని వారిసంతతి వారమగు మనమెట్లుంటిమి?
అరిషడ్వర్గమునకు దాసులమై, ధర్మచ్యుతులమై, మాతృ
దేశారాధన కార్యవిముఖులమై, కర్తవ్యతా విమూఢులమై
అకారణానుకరణ జాడ్యపీడితులమై, వ్యక్తిత్వమునుసైతము

గోల్పోయి యుంటిమి. మనకుగూడ ప్రత్యేక విజ్ఞాన మున్నదనియు, నాగరికత కలదనియు, సంస్కృతి సంప్రదాయములు ఆనువంశికముగ వచ్చుచున్నవనియు, గ్రహింపజాలని విషమపరిస్థితిలో నున్నాము. మనసామగ్రిని మనము పదిలబరచు కొనుటకు బదులు పనికిరాదని బూజుపట్టునట్లు మూలపారవైచి, ఇతరుల వస్తువులను చూచి మోజుపడి వాటిని కాపలాకాయుటలో శక్తిని, కాలమును, వృధా బుచ్చుచున్నాము. తల్లికి లేదుగాని పినతల్లికి పెట్టరా పిండప్రదానమన్నట్లున్నది. స్వధర్మ త్యాగము, పరధర్మ స్వీకరణము మహాదోషమని శాస్త్రములు ఘోషించుచున్నను దానినే మనము ఆచరించు చున్నాము. ఇకమనకు వ్యక్తిత్వ మెక్కడిది? వ్యక్తిత్వమును నిరూపించుకొనజాలని జాతి కీర్తిని కోల్పోయి దీనావస్థయందుండుటలో ఆశ్చర్య మేమున్నది? రానురాను మన ఆచారములు సాంప్రదాయములు, పురాతనములనియు ప్రస్తుత కాలమునందాచరణ యందుంచుటకు పనికిరావనియు వెఱ్ఱివాదనలు బయలుదేరుచున్నవి. వేఱొక స్త్రీమీద మనసుపోయిన వ్యభిచారికి కట్టుకొన్న భార్యమీద అనుమానము, వెగటు, నిరాదరణ, కలుగకుండునా? తెల్లవారుఝామున నే నిద్రలేవడము, శీతలోదకమున శిరస్స్నాన మొనరించడము, సంధ్యావందన మొనరించుకొనడము, దైవప్రార్థన గావించడము, యీ పనులెంతకష్టమో చూడండి సోమరిపోతులకు? పూర్వులు వీటిని నియమానుసారముగ నెరవేర్చెడివారు. శతసంవత్సరములు ధర్మతత్పరులై జీవితములను గడిపెడివారు. వారిది పూర్ణాయుర్దాయము. కాని నేడుప్రొద్దు

న (8-30 గంటలకు ముందు కాదు) లేవగానే మొగము కడుగుకొనినను. కడుగుకొనకపోయినను, కాఫీ లేక టీ గొంతులోపడిన నంతేజాలును, ఆ కట్టుదిట్టము లిచట లేవు తెల్లవారుఝామున నిద్రమేల్కొన నక్కఱలేదు. చల్లని నీళ్లలో తలనుముంచ నవసరము లేదు. పరగడుపున గ్రుక్కెళ్లకొలది చల్లనినీళ్లను మ్రింగపనిలేదు. ముక్కుమూసి నుటగాని, కాళ్లుతిమ్మిరెక్కినను ముడుచుకొని కూర్చొనుటకాని, జరుప నక్కఱలేదు. ఈ 'లేదు' లన్నియు పాశ్చాత్య నాగరికతానుకరణమువలన సిద్ధించిన ఫలితములు. చివరకేమి తేలినది? సోమరితనము. దానినే మనమాశ్రయించినాము. అది మనలను వెచ్చని బ్లాంకెట్టు మడతలలో జోకొట్టుచు ప్రక్కమీదినుంచి లేవనీయదు. ఆహా! ఏమి సౌఖ్యము! ఏమి ఆనందము! ఏమిసౌకర్యము! ఆసౌభాగ్యము చెప్పవలెనా?

సోమరిపోతుల వలన దేశారాధన జరుగదు. ప్రస్తుత దేశదారిద్ర్యమునకు మనసోమరితనమే ముఖ్యకారణము. దొంగలువచ్చినారు, గుర్రుమానవయ్యా ప్రభూ! అంటే, వచ్చిన వచ్చుగాక, పండంటినిద్రను పాడుచేయవద్దని గద్దించు బుద్ధిమంతుని ఫక్కీమనది. కొల్లగొట్టుకొని పోతున్నది సర్వము. ఒకప్పుడుండిన ఆ భాగ్యరేఖలు వెలవెలబారి అస్తమించురోజు వచ్చినను, పరాకుతోనున్న మన వలన దేశమెట్లు బాగుపడును? ఏమిజరుగుచున్నను కాలచక్రభ్రమణ మాగదుకదా! పరిస్థితులు విషమించి తారుమారయినవి, ఉన్నది ఊడ్చుకొనిపోయినది, చింతామణి

లోని సుబ్బిశెట్టిస్థితికి వచ్చినాము. ఇకబయలుదేరినది నైరాశ్యముతోబాటు వైరాగ్యము. ఎచటజూచినను శుష్కాస్థిపంజరములే! క్షుద్బాధాపీడిత ఖిన్నవదనములే! విపరీతజాడ్యపీడితులే! చిన్నమ్మకనుసన్నల నానందించిన దేశము పెద్దమ్మపెడబొబ్బల కాకరమైనది. 'రత్నగర్భ' శుష్కగర్భమైనది. దీనికి కారకులెవరు? మనమే. కారణము మన సోమరితనమే, మనతిరస్కారమే, మన స్వధర్మత్యాగమే. ఐనప్పటికిని మనకండ్లకు గప్పినపొరలు విడిపోలేదు. ఈ స్థితినే జూచుకొని మురియుచున్నాము. ఎంతటి దుస్థితియని నిట్టూర్పు విడిచిన వారినిజూచి కొందరు పైతరగతి సోమరిపోతులు ఆవేశముతో కాలముయొక్క మార్పున కనుగుణ్యముగ ముందంజ వేయుట కిష్టపడరు. వారికది అసాధ్యము. ఎంతసేపటికి వెనుకచూపేగాని ముందుచూపులేదని వెక్కిరించి కళ్ళుకుంటారు లోనున్న చేతకానితనమును. ఎవరికి లేదో ముందుచూపు? మన దేశము, జాతి, నాగరికత, విద్య, ఐశ్వర్యము నాశనమైతే, దాని పునరుద్ధరణకు ప్రయత్నించక పోవడము బహుశా వారిదృష్టిలో ముందుచూపేమో? లేక ఏదెట్లు నాశనమైనను పరధర్మానుష్టానమునకు ప్రాణములొడ్డుటయే ముందుచూపేమో! ఏమనవలెలో తెలియకుండా నున్నది వీరి యానందావేశములను పాపము! వారిదదొక విచిత్రసిద్ధాంతము.



# పదియవ మజిలి.



ప్రాక్పశ్చిమ దేశవాసుల దృక్పథము లీవిధముగ భేదించి యుండును. జీవితా దర్శములే వేరయినప్పుడు, జీవిత విధానమే నాగరికత యనిపించుకొను నప్పుడు భారతీయులు పాశ్చాత్య వేషభాషలను, స్వధర్మమును పరిత్యజించియైన, ముక్తిదాయకములను భ్రమతో అవలంబించుట ద్రోహముకాదా? వెనుక చెప్పినట్లు వివాహమొక పవిత్ర కార్యము. దానిని మనముచులకనగ చూచి మరొక వ్యక్తిని చేపట్టచూచుట మహాపాపము. వారికి శాంతి ఆత్మతృప్తికలుగునా? తొలుతనొకరిని చేపట్టి, ఏదో నెపముమీద పరిత్యజించి మరొకరి సాంగత్యమును గోరుట నీతిదాయకమా? ఇట్లు పరిత్యజించువారు బుద్ధిలేనివారని నాయభిప్రాయము దేహసౌఖ్యముల ననుభవించు నుద్దేశముతోనే కదా యితర వ్యక్తిసంబంధమును కలుగజేసికొనుట—వారి యాదర్శమంత టితో నిలచిపోవును. సాధారణముగ స్త్రీ పురుషులు సౌందర్యమునకు జోహారులిచ్చుచుందురు. ఏలాటిదీ సౌందర్యము? కన్ను, ముక్కు, మూతి, నోరు చక్కగానుండి దేహ సౌష్టవము కొద్దో, గొప్పోయున్నంత మాత్రమున సౌందర్యమినుమడించునా? అది శరీర సౌందర్యము. అంతే బాహ్యాంగ సౌందర్యము. దానికేనా ఈ పెనుగులాట? చేపట్టిన వ్యక్తిమీద ఈసడింపు, అసహ్యము? సంబంధ విచ్ఛే

దనకు ప్రాకులాడుట ? మానవ జీవితమంతయు విషయసౌఖ్యముల నానందించుటకు మాత్రమేనా యుపయోగింప వలసినది ! ఇదేనా భారతీయులమగు మన విజ్ఞాన సంపద ? ఆత్మవికాసము కలిగిన వ్యక్తుల హృదయ పరిణామమెంత సుందరముగానుండునో యీవిషయలోలురు వెఱుగరుగదా ? వారిలో యెంతమార్దవము కలదో, సౌజన్యతకలదో, యెటువంటి ఔదార్యము కలదో, ఏలాటి సహనశక్తికలదో, గ్రహింపగలరా ? ఇతరుల తప్పిదములను మన్నించి బుద్ధిఃకర్మానుసారిణీ యను తత్వమును స్మరించుకొని జాలిపడుట యెంతటి గొప్పసంగతియో యూహింపగలరా ? వారిహృదయ మెంత విశాలమైనదో, వారు దేనిని బడయుటకు జీవితమంతయు ధారపోయుచున్నారో, వారి యాదర్శములెవ్వియో ? వీరికి గ్రాహ్యములగునా ? కాజాలదు. బాహ్య సౌందర్యమునే వాంచించి దానిననుభవించుటకు దుష్కృత్యము లెన్నియైన సలుపుటకు వెనుదీయని తుచ్ఛహృదయముల కాంతరంగిక సౌందర్య మెట్లుగోచరించును ? కూపస్థ మండూకములవలె వారిబుద్ధి వికసించదు. వారిజీవితము లోక యాదర్శమును సాధించుటకుకాదు. బుద్ధికెట్లుతోచిననట్లు నడిచెదరు. పాప పుణ్యములతో పనిలేదు. కామవాంఛతీరిన నంతేచాలు. శ్రీ వివేకానందుడు న్యూయార్కు ఉపన్యాసములో చెప్పినట్లు వస్తుసామాగ్రిని తయారుచేయు ప్రయత్నమునందు సర్వస్వము ధారపోసి కన్నుమిన్ను గానక ప్రవర్తించి కడుపార తిని త్రాగి సుఖించి, ఆస్తిపాస్తులను సంపాదించుకొని, విషయ భోగముల ననుభవించి, ఐశ్వర్యమే భగవత్స్వరూపమని

స్వేచ్ఛావిహారముతో జీవితమును గడుపుటయే ఆదర్శమని భావించి మరణించుజాతి పాశ్చాత్యజాతి. కానిభారతీయులో? భోగలాలసతతో కాలముబుచ్చు మానవుని జీవితము నిష్ఫలమని వారెఱుంగుదురు. ఆత్మవికాసము కలుగునని జీవితమొక స్వప్నమని వారుగ్రహించుకొనిరి. ఎన్ని పాపములను జేసినను క్రీస్తునే నమ్ముకొని ప్రతి ఆదివారము ప్రార్థనలను జఱిపినచో నరకబాధల భయముండదు. వాటినన్నిఁటిని క్రీస్తుక్షమించి తీరునను దుర్భావ మొకటి పాశ్చాత్యుల హృదయములందు రేకెత్తినది. ఇఁక నేమి? వారేపని చేసినను పాపమురాదుకదా? నానాటికి వారిప్రవర్తన హీనస్థితికి వచ్చుటకీవిపరీత భావమేప్రధానకారణము. క్రైస్తవమతము చెడ్డది యాయని పొరబడుటతప్పు. దానిని మొదటస్థాపించిన మహాపురుషుడు జీసస్‌క్రైస్టు. ఆయన యూద దేశమునందు జన్మించి అచ్చట పరిశుద్ధధర్మమును స్థాపించెను. ఆయన భగవదవతారమని క్రైస్తవులు విశ్వసించెదరు. క్రీస్టుబోధించినది ముఖ్యముగా అహింసాతత్వము.'' ఎవరైన హింసించినచో వారినితిరిగి హింసించకుండ ప్రేమతోనే మంచి చేసికొనుము. నీమీదవారికిగల అసహ్యమును, క్రోధమును ప్రేమద్వారా పోగొట్ట ప్రయత్నింపుము ''అనిబోధించిన మహాత్ముఁడు నూటికి నూరుపాళ్లు క్రైస్తవమత ముఖ్యసూత్రమును ఆచరణ పూర్వకముగ మన్నించినాడు కాని నేడు నూటికి తొంబది తొమ్మిదిమంది క్రైస్తవులు హింసాపద్ధతుల నవలంబించు చున్నప్పటికి, క్రీస్తుబోధించినదంతయు అహింసా సూత్రముమీద నాధారపడి యున్నది.

మొదట ఆయనజన్మించిన దేశముయూదులదని తెలిసికొని యుంటిమి. అది రోమనులపాలనలో నుండెను కనుక రోమనుల స్వాధీనములోనుండిరి యూదులు. వారిలో జన్మించి, క్రొత్తధర్మమును బోధించిన క్రీస్తునుగొప్పవానిగభావించి అనుకరింపమొదలిడిరి. రోమనుల దృక్పథమే వేరు. వారిమతగురువులు మతము పేరిటచాల దౌర్జన్యములను గావించుచుండిరి. ఈ నవ్యధర్మమువలన వారిఆటలు సాగనట్లు కనిపించినవి. దానితో కోపగించి ధార్మికప్రవక్తయగు క్రీస్తుపైన లేనిపోని ఆరోపణలను గావించి, రోమను పాలకులనాశ్రయించి, ఆయనకు మరణదండన విధింపజేసిరి. పాపమాయనను చిత్రవధజేసిరి. దేహమును గోడకుజేర్చి చేతులకు మేకులు దిగగొట్టి మరణశిక్ష నములుపఱచిరి. ఆతీతిగ తన్నవమానపఱచి, నిండుప్రాణములను బలిగా గైకొనినప్పటికి, జీసనుక్రీస్తు ప్రతిహింసను జఱుప నిష్టపడలేదు. పైగా వారినిక్షమించవలసినదిగా భగవంతుని బ్రార్థించెను. ''తండ్రీ! వారేమొనర్చుచున్నది తెలిసికొనజాలనిస్థితిలో నున్నారు, వారిని కరుణించి క్షమించవలసినది.'' అని మరణావస్థనందుచున్నప్పటికిని ప్రార్థించెను. ఇటువంటి మహావ్యక్తినివధించి ఆకాలపు రోమను పరిపాలకులు తమపశుత్వమును ప్రదర్శించిరి. తిరిగి క్రీస్తు భూస్థాపితుఁడైన చోటనుంచి పునర్జీవితుఁడై వచ్చి మానవలోకము నుద్ధరించెనని క్రైస్తవుల విశ్వాసము.

ఆయన బోధించిన ధర్మసూత్రములు ముక్తిమార్గ సోపానములని యొప్పుకొనవలసి యుండును. అహింసాత్ర

వక్తయనఁబడదగు గాంధీమహాత్ముఁడే అతని శిష్యవర్గములో తానొకడనని పలుమారులు చెప్పకొని గర్వించిన రష్యాను మహాపురుషుఁడగు టోల్‌స్టాయి క్రైస్తవ మతవిశిష్టధర్మ ములను కొన్నిటిని నుడివెను. వాటినీక్రింద బొందు పఱ చితిని.

"క్రోధమును చంపివేయుము. ఎవరియెడలను కోపముకలిగి యుండకుము" కారణములేకుండ కోపింపకుము అనిసామాన్యముగ బైబిలునందు వ్రాయబడియున్నది. కాని "కారణములేకుండ" అనుపదములు జీసను చెప్పలేదనియు అదిభాషాంతరీకరణమునందలి దోషమనియు టోల్‌స్టాయి నిరూపించెను. ప్రతిక్రోధికిని తాను కోపించునప్పుడు కారణమున్నటులనే గాన్పించును; నిజముగ అకారణముగ కోపించు వారరుదుగ నుందురు. ఎప్పుడును ఏసందర్భము లందును కోపముచెందకుండ నుండనలయుననియే జీసను యొక్క అభిప్రాయమయియుండును.

2. "వ్యభిచరింపకుము స్త్రీలను చెడ్డతలంపుతో ఎవరు చూచుచున్నారో వారుహృదయమునందప్పుడే వ్యభిచరించిరని గ్రహించి స్త్రీలయెడ చెడ్డతలంపు లేకుండ చేసికొనుము. స్త్రీకొకభర్తయు పురుషుడు ఒకేభార్యయు కలిగి యుండుట ధర్మము. వివాహవిచ్ఛేదము పాపము. సామాన్యముగ బైబిలునందిట్లే యుండును. వ్యభిచారిణియయినప్పుడు తప్ప ఎవడుతనభార్యను వదిలివేయుచున్నాడో వాడుఆమెను వ్యభిచారమునకు పురికొల్పుచున్నాడు. "కాని వ్యభిచారిణి ఆయినప్పుడు తప్ప" అనుమాటలు మూలమునందు లేవనియు

భాషాంతరీకరణమునందు చేర్పబడినవనియు, వివాహ విచ్ఛేదము వ్యభిచారమును వృద్ధిచేయునుకాన అది ఎప్పుడును ఏసందర్భములందునుగూడ ఆచరణీయము కాదనియు అదే జీసను ఉద్దేశమనియు టోల్‌స్టాయి చెప్పెను.

3. "ఎప్పుడును ఆనతీసికొనకుము. క్రోధమును చంపుము, వ్యభిచరింపకుము, అనుఉపదేశముల తరువాత బోధింపబడిన ఈయుపదేశము అత్యల్పవిషయముగ కాన్పించును. కాని దీనిఅర్థము బహుగంభీరము. పాశ్చాత్యదేశములందు సేనలలో చేరుటకుముందు ప్రతిమనుష్యుడును తనపై అధికారుల ఇచ్ఛానువర్తనముగ నడచుకొందుననని ఆన తీసికొనవలయును. ఒకరునుడివినట్లు నడచుకొనెదనని ఆన తీసికొనుటవలన మన భవిష్యత్కార్యములమీద మనస్వాతంత్ర్యము కోల్పోవుట. ఆనతీసికొనినవారు తమబుద్ధిని, తమ ఇచ్ఛను, తమఅంతరాత్మను, చంపివేసికొనుచున్నారు. ఈశ్వరేచ్ఛను అనుసరించి నడచుకొనుట మనవిధియనియు, ఈశ్వరేచ్ఛయు, మానవేచ్ఛయు నెల్లప్పుడు నేకీభవించవనియు, కావున ఒకరియిచ్ఛననుసరించి ఎల్లప్పుడును నడచుకొనెదమని ఆన తీసికొనుట అధర్మమనియు, జీసీసు బోధించెనని టోల్‌స్టాయి చెప్పెను.

4. దౌర్జన్యమును దౌర్జన్యముచేత ఆటంక పరుపకుడు. ఎవరైనమీపడి చెంపమీద కొట్టినయెడల వారికి మీ ఎడమచెంపకూడ చూపుడు "Resist not evil" దౌర్జన్యమును ఆటంకపరుపకుడు—అనువాక్యమునకు అర్థము చెప్పుటలోనే టోల్‌స్టాయియొక్క బుద్ధిస్వాతంత్ర్యమును నిష్కపటసత్యా

న్వేషణాభిలాషయు తేటపడుచున్నవి. ఈ ఉపదేశమునందు గొప్పభావమే యున్నను, జీవితమునందు దానియాచరణము అసంభవమనియు, అది అనుసరించుటకు ప్రయత్నముచేసిన యెడల మనసంఘసంస్థాపనము నిర్మూలమగుననియు క్రైస్తవులందఱు నింతవఱకు చెప్పుచుండిరి. కాని టాల్‌స్టాయి నిర్భయముగా, నిష్కపటముగా, ఈవాక్యమును అర్థము జేసికొని జీసను ఉపదేశమునందు సంపూర్ణ విశ్వాసము కలిగిన వాడగుటచేతను, యదార్థజ్ఞానము కలవాడగుట చేతను, క్రైస్తవసంఘము జీససుయొక్క ఉపదేశమునకును భిన్నముగా నేర్పఱుపబడిన దనియు, కావున నే దౌర్జన్యము ప్రపంచమందు అంతరింప లేదనియు, ఎప్పుడు జీసను ఉపదేశించిన ధర్మమును జీవిత మందనుసరించెదమో అప్పుడు దౌర్జన్యము రూపుమాయుననియు, యుద్ధములు తుదముట్టుననియు, ప్రపంచమందు శాంతిరాజ్యము చేయుననియు, భూమిస్వర్గముగామారిపోవుననియు, చెప్పెను.

5. 'జాతివివక్షతలేక అందరిని సమానముగ ప్రేమింపుము.' ఈశ్వరునికి సర్వజాతులును సమస్తమానవులును సమానులే. అతడందరిని సమానముగ ప్రేమించును. అట్లేమనుష్యులు జాతివివక్షతలేక అందరిని ప్రేమింపవలయును. "నీశత్రువులను ప్రేమింపుము" (Love your e.emies) అనువాక్యమునందు "శత్రువులను" అనుపదము విదేశస్థుల తెలియజేయుట కుపయోగింపబడినదనియు సామాన్య విరోధులని కాదనియు కావున దేశాభిమానము హృదయములను సంకుచిత పఱుపనీయక ప్రతిజాతివారిని సమానముగ

ప్రేమింపవలయుననియు శత్రుత్వవినాశమే మతమనియు విశ్వజనీనమగు ప్రేమయే క్రైస్తవమతమునకు ప్రాణమును ఆత్మయునవి యున్నవనియు టోల్‌స్టాయి బోధించెను.''

ఈ ఉపదేశ పంచకమునందే మతముయొక్క సారమును ఆనందముయొక్క రహస్యమును కలవని అతని ధృఢ విశ్వాసము. మనుష్యులు కోపములేక, పరిశుద్ధహృదయము కలిగియుండి, దాస్యప్రతిజ్ఞ తీసికొనక, దౌర్జన్యమును దౌర్జన్యముతో ఆటంకపఱుప ప్రయత్నింపక, జాతివివక్షత లేక అందరిని సమానముగ ప్రేమించిన, శాంతిరాజ్యము భూమిమీద స్థాపితమగునని ఆయనబోధించెను. ఇదియే జీసను సందేశముయొక్క సారాంశమని అతనునుడివెను. అహింసాధర్మమును ప్రతిపాదించి టోల్‌స్టాయి పాశ్చాత్యభావ ప్రపంచమున ఒకనూతన యుగమునకు కర్తయయ్యెను.

(ఎం. వి. యస్. సుబ్బారావుగారు ఎం. ఏ. రచించిన
"పాశ్చాత్య భావప్రపంచము" నుండి)

చూచితివా? క్రీస్తుగావించిన సందేశమునందలి గూఢార్థము. దానిని నేడు పాశ్చాత్యులు తమఅభిప్రాయముల కనుగుణ్యముగ, బలహీనజాతుల నోడించి నిరంతర దాస్యమున నుంచుటకు వీలగునట్లుగా, విపరీతార్థములను గల్పించి మహాసత్యముగ బోధించుచుండిరి. ఆత్మోన్నతి గాక, రాజ్యాంగ విధాన నిర్వహణమునకు మాత్రము వారు మతమును వినియోగించుకొనుచున్నారు. పేరుకు మూలపురుషుడు జీససే. ఆయనబోధించిన మతమే వారవలంభించునట్లు కన్పడునది. కాని ఆచరణయందు మాత్రము

వ్యతిరేకముగ నున్నారు. జర్మనీదేశస్థుడును, అతనిని మించినవాడు పందొమ్మిదవ శతాబ్దమున పాశ్చాత్య దేశములందెవరు లేరని కార్లయిలుచే ప్రశంసింపబడినవాడు నగు గెటిమహాశయుడు (Goethe) "ఏమతము ఆత్మగౌరవమును ప్రబోధించుచున్నదో, అదియే ఉత్కృష్టమతము" అని విశ్వసించి ఎలుగెత్తిచాటినాడు. ఆత్మగౌరవమనిన అహంకారము కాదు. మానవునకెన్నడు తనఆత్మమీాద గౌరవము కలుగును? దానిగొప్పతనమును, దానినెఱిగినపిదప లభించు దివ్యశక్తిని గ్రహించిన పిదపనే గౌరవము కలుగును. అనగా ఆత్మవికసించినప్పుడు ఆత్మవికాసమైన తరువాత మానవుడు సర్వోత్కృష్టుడగును. టోల్‌స్టాయి చెప్పినప్రకారము బైబిలులో కొన్ని విపరీతార్థములు కల్పింపబడినవి. ఇవి కేవలము స్వార్థమును అభిలషించి చేయబడినవి.

"వ్యభిచరింపకుము. స్త్రీ ఒకేభర్తయు, పురుషుడొకేభార్యయు కలిగి యుండుట ధర్మము. వివాహావిచ్ఛేదము పాపము. "అనిజీససు బోధించిన దానిని భాషాంతరీకరణమునందు "వ్యభిచారిణి అయినప్పుడు తప్ప ఎవడు తన భార్యను వదలివేయుచున్నాడో వాడు ఆమెను వ్యభిచారమునకు పురిగొల్పుచున్నాడు" అనిమార్చివేసినారు. వివాహవిచ్ఛేదము పాపము అనువాక్యమునకు బదులు "వ్యభిచారిణి అయినప్పుడు తప్ప" అను సవరణచేసి విడాకుల చట్టము నేర్పరచుటకు వీలుకలుగ జేసికొనినారు. ఇంతవఱకైనా మంచిదే. వ్యభిచరించని స్త్రీలను సైతము నేడువారు పరస్త్రీవ్యామోహముచేత వదలివేయుచున్నారు. బహుశా

యీ మార్పుదలకు దేశపరిస్థితులు కారణమేమో? క్రీస్తు "వివాహవిచ్ఛేదము పాపము" అని బోధించు నాటిపరిస్థితులు వేఱుగా నుండవచ్చును. ఏమతము నందైనను, శాస్త్రకారులు మతగ్రంథములందు ధర్మనిర్ణయమును గావించినప్పుడు, తరువాత విషమపరిణామ మనుసరించి పరిస్థితులు మారినట్లు కాకుండ, దేశపరిస్థితులు ధర్మబద్ధముగనే యుండియుండును. కనుకనే వారు ధర్మమార్గమున నెట్లు నడవవలసినది పాపపుణ్య విశేషము నెట్లు పాటింపవలసినది నిరూపించి యున్నారు. క్రమశః దేశకాలపరిస్థితుల ననుసరించి ఆయా మతములను స్వీకరించిన జాతులు తమ వీలున కనుగుణ్యముగ శాస్త్రములను మార్చుకొనిరి. వ్యభిచార మొనరించిన స్త్రీలను పరిత్యజింప వలసినదని మన మనువుకూడ చెప్పినాడు. అట్లనే బైబిలును భాషాంతరీకరించునప్పుడానాటి దేశపరిస్థితుల కనుగుణ్యముగ వ్యభిచారిణులను పరిత్యజింపవచ్చునని మూలమును మార్చియుండవచ్చును. పరిత్యజింపబడిన స్త్రీలకు సంఘమునందు గౌరవము లేకుండ ఏలాటిసంబంధము కలుగుటకు కవకాశములేకుండ జేయుటయే వ్యభిచారమునకు విధింపబడిన శిక్ష. అంతేకాని ఒకనితో వివాహవిచ్ఛేదన గావించుకొనినంతనే మఱొకని చేపట్టుట కర్హత కల్గింపకూడదు. భారతదేశమున సందటువంటి కఠినశిక్ష విధించుట నేటికిని పాశ్చాత్య నాగరికత ముదరని గ్రామములందు జఱుగుచున్నది. విడాకుల చట్టమువలన కలుగు అనర్థకములలో ముఖ్యమైనది వ్యభిచారమును ప్రోద్బలపఱచుట. అదేకదా నేడు మనము పాశ్చాత్య దేశ

కాని స్వేచ్ఛావిహారమునకు వీలుండదు! ఒకచిన్న ఉదాహరణ. ఇరువురు స్నేహితులున్నారనుకొనుము. ఒకడు పాపభీతికలవాడు. అతడు వీలయినంతవఱకు మంచి మార్గమున నడచుటకు ప్రయత్నించుచుండును. రెండవవాడు దుర్మార్గుడు. వానినడత చెడ్డది. విషయలోలుడు. స్నేహితమున్నప్పటికి, తన నడతకు తాళము వేయడు. కనుక కొంచము వెనుక ముందాడును రెండవవాడు. అతనికి వ్యభిచార రోగమున్నదనుకొనుము. ఇతరులు చూచుచుండగ బిడియము, సిగ్గులేకుండా నెవడు వ్యభిచారమును సలుపడు. తానున్న గదిలోనికే వ్యభిచారిణిని తీసికొనివచ్చి దౌష్ట్యమునకు బాల్పడడు. ఎందువలన? తనస్నేహితుడట్టి పనికి బూనుకొనడు కనుక. అటులగాకుండ దుర్మార్గులగు స్నేహితులొకచోట జేరినారనుకొనుము. ఇరువుర దేపనికి సంసిద్ధులు గనుక వారిలో వారికి దాపరికముండబోదు. ఒకరినిచూచి మఱొకరు మోమోటపడవలసిన యగత్యముండదు. ఒకగదిలో స్వేచ్ఛావిహారులై దౌష్ట్యమునకు గడంగవచ్చును. అట్లనే పురుషులు తమ భార్యలు బ్రతికియున్నను, కేవలము విషయతృష్ణ నుపశమింపజేసికొనగోరి, పరస్త్రీ సంపర్కమును వాంఛింపవచ్చును. లేక బహిరంగముగ వివాహమొనర్చుకొనవచ్చును. ఇంకను స్త్రీలు బహిరంగ వివాహములకు బాల్పడలేదు. వయసుచెల్లని వితంతువులకు వివాహమొనర్చుటవలన సంఘక్షేమమేగాని, సంఘద్రోహము కలుగదు. భర్తలు సజీవులైన స్త్రీలు మఱొక వివాహమునకు దిగుట సంఘద్రోహ కారణ

మగును. రహస్యముగ పరపురుష సంపర్కమును గలిగిన స్త్రీలనే సంఘము పరిత్యజింపవలసినదని శాస్త్రకారులు విధించినప్పుడిక బహిరంగ వివాహములను వారనుమతింప గలరా? పురుషులకుగూడ భార్యలు బ్రతికియుండినప్పుడు మఱొక వివాహమునకు అనుజ్ఞ నిచ్చియుండరు. కాని తరువాత వాటికి వ్యాఖ్యానమును రచించినవారు మాత్రము బైబిలు భాషాంతరీకరణమువలె మార్చియుందురు. ఏమైనను భారతదేశమునందు విడాకుల చట్టము నమలు పఱచుట జాతికంతకు తీరనిహాని, అపయశస్సు వాటిల్లును. ఇప్పటికే సంతాన నిరోధప్రయత్నములతో చచ్చిపోవు చున్నాము. బహిరంగ వివాహమున కనుజ్ఞ లేదు గనుక, స్త్రీల దుర్నడత కదియొక దుర్భేద్యమైన బంధనముగా నున్నది. విడాకుల చట్టమువలననది తుత్తునియలు కాగ లదు. అట్లు జఱిగిన తరువాత పాశ్చాత్య సంఘనియమము లకు, మనసంఘ నియమములకు భేదమావంతయునుండదు. పురుషుల దుష్ప్రవర్తనను మాన్పుటకుఁగాని స్త్రీలను చెడగొట్టుట న్యాయమేనా? దెబ్బతగిలి ఒకకన్ను పోవుటకు సిద్ధముగనున్నప్పుడు, రెండవ కన్నెందుకు బాగుగనుండవలె నని బలవంతముగ పొడగొట్టునట్లున్నది. నేటి విపరీత నాగ రికశిఖామణుల సంఘోద్ధరణోద్యమ స్వభావము! సంఘ సంస్కారమనిన చెడిపోయినవారిని బాగుచేయుటకాని, దానికి తారుమారు కాదేమో!!

# పదకొండవ మజిలీ.



కొంతమంది నవీననాగరిక శిఖామణుల (స్త్రీ పురుషులున్నారు) తీవ్రాందోళనకు దాళజాలక, ప్రభుత్వమువారు హిందూసంఘ నియమములను పునరుద్ధరించదలచి 'రావు కమిటీ' నొకదానిని స్థాపించిరి. దానికధ్యక్షుడు మన భారతీయుడే, సభ్యులందరు భారతీయులే. ఆశ్చర్యమేమనిన, ఈలాటి సమస్యలను పరిష్కరించు నిమిత్తము బాగోగుల జవాబుదారి ప్రభుత్వము తమమీద నుంచుకొనక, వెఱ్ఱి సిద్ధాంతములు మొలకలెత్తుచున్న మేధానిధులమీదనే రుద్దెదరు. ఈ రావు కమిటీవారు విడాకుల చట్టవిషయమై కొన్ని షరతులను విధించి ప్రజాభిప్రాయమును సేకరించుచున్నారు. ఆషరతులివి:—

1. ప్రతివాది కనీసము (7) సంవత్సరాలగానైనా మతి చెడిఉండాలి.

2. కుష్టు లేక సుఖరోగాలతో ప్రతివాది (7) సంవత్సరాలు బాధపడుతూ ఉండాలి. అయితే ఈవ్యాధి వాదినుంచి సంక్రమించి ఉండరాదు.

3. ప్రతివాది కనీసము (7) సంవత్సరాలు వాదినుంచి విడిపోయి ఉంటుండాలి.

4. ప్రతివాది అన్యమత స్వీకారంచేసి, హిందువు కాకుండా ఉండాలి.

5. ప్రతివాది భర్త ఐతే, మరొక స్త్రీని ఉంచుకుంటూ ఉండాలి.

6. ప్రతివాది భార్యఐతే, మరొక పురుషునితో వ్యభిచారము చేస్తుండాలి — లేదా జారిణిగానుండవలెను.

లక్షలాది జనులు క్షుద్బాధచే మలమలమాడి మరణించుచున్నప్పుడు, నూరు నూటయాభై బస్తాల బియ్యము సప్లైచేసిన కాటకము నెంతవరకు తగ్గింపగలమో, అటులనే సంఘమంతయు విషకీటకములచే డొల్లజేయబడుచున్న యీ విషమపరిస్థితులందు పై షరతులు కలిగిన విడాకు చట్టమువలన కలుగు లాభముకూడ అత్యల్పము.

పైన విధించబడిన షరతులు విడాకుల చట్టము కావలెనను వాదననభినందించు పక్షమున సక్రమముగనున్నవని ప్రత్యేకముగ వ్రాయనక్కఱలేదు. అవి ఏఅభిప్రాయములతో ప్రతిపాదింపబడినవో, ఆయభిప్రాయము లభినందనీయములే కాని వాటి నాచరణయందుంచుట, ప్రభుత్వ శాసనములేగాక, ప్రజల సహాయ మెక్కువగ గావలెను. ప్రజలు విముఖత్వమును జూపుపక్షమున, ఏప్రభుత్వ శాసనముగూడ వ్యర్థమే. ప్రజల సానుభూతి లభించుటకు, వారిలో క్రొత్త ప్రతిపాదనల లాభనష్టములను ప్రచారమొనరింపవలెను.

మొదటి రెండు షరతుల విషయమును గుఱించి మనమాలోచింపనలసిన దేమనిన, పతిపాధి మతిచెడి ఉండుటకు— అందులో ఏడుసంవత్సరముల దీర్ఘకాలము — కారణములేవి?

ఔషధసేవ వగైరా ఉపచారములవలన మతిచెడిపోవు రోగము తగ్గి సక్రమారోగ్యము కలుగగలదా, లేదా? మనసుచెడి, పిచ్చియెత్తగల కారణములతో గుమఃలు వ్యక్తులకేలాటి సహాయము సంఘనాయకులవలనగాని, లేక ప్రభుత్వ మీచట్టము జవాబుదారినహించుచో దానివలన గాని, కలుగగలదు? ఔషధసేవ వగైరా ఉపచారములు సకాలమున లభించు నదవకాశమెట్లు, ఎవరివలన కలిగింప బడును? వాదివాదముల నాదరించి, ప్రతివాదివలన కలుగు మానసికవ్యథనుండిగాని, అసంతృప్తినుండిగాని, తప్పించు నిమిత్తము మాత్రమే ఈచట్టము సహాయకారిగ నుండరాదు. వివాహితులగు స్త్రీ పురుషుల సంబంధము త్రెంపబడుట కనుజ్ఞ నిచ్చుటకుముందు, సంఘముకాని, ప్రభుత్వముకాని, వారిసహజమానవాభిరుచులనుగూడ మన్నింపవలెను. సాధ్యమైనంతవఱకు గడువుకాలమునందు ప్రతివాదికి తగుసహాయము కలిగించి, మతిస్వాస్థ్యము ప్రాప్తమగునట్లు ప్రయత్నించవలెను. లేనిచో పెట్టబడిన గడువుకాలము దీర్ఘమేమో యను సందేహము కలుగుటకు వీలుండును. కుష్టు, లేక, సుఖరోగాలతో ప్రతివాది బాధపడుచున్నప్పు డతనికి సర్వవిధముల సహాయమొనరింపవలెను. వ్యాధివలన కుష్టుగాని సుఖరోగములుగాని సక్రమించినచో ప్రతివాది నుండి విడివడుట కనుజ్ఞనొసగబడదనుట మంచిదే కాని దానికి నిదర్శనమో? వాది ప్రతివాదులిరువురు పైరోగములతో బాధపడుచుండుటయేనా? ఇరువురు బాధ పడుచున్నప్పుడు, ఎవరివలన నెవరికి రోగములు సంక్రమించినవో నిరూపించుట

కష్టమేమో? అన్యతమున కిరువురు సంసిద్ధులగుచో చేయు నదేమి? పరస్పర సంబంధ విముక్తికనుజ్ఞయేనా? విడివడిన తరువాత వారిగతియేమి? ఈ రోగములుకాని, సంబంధ విచ్ఛేదనగాని యౌవ్వనములోనే ప్రాప్తించినవారు తమ జీవితముల నెట్లు గడుపగలరు? వారికి సంఘముగాని, ప్రభుత్వముగాని, చేయబూనుకొనిన సహాయమేమి? వాది ప్రతివాదులు పైరోగములతో బాధపడుచుండిన మరొకరిని పెండ్లియాడుట ఎట్లుపొసగును? కుష్ఠుగాని, సుఖరోగములుగాని అంటువ్యాధులు గనుక, అంటువ్యాధులొకరినుండి మఱొకరికి వెంటనే సంక్రమించును గనుక, ఏడుసంవత్సరముల కాలము బాధపడిన తరువాత విడాకుల కనుజ్ఞగైకొనడమే మంత సమంజసమో బోధపడుటలేదు. ఇంతకాలమట్లు నోరు మూసికొని కష్టపడవలసిన అక్కరయే లేకుండిన బాగుగ నుండదా? వాదినుండి ప్రతివాదికిగాని, ప్రతివాదినుండి వాదికిగాని, అంటువ్యాధులు సంక్రమించుటతోడనే విడాకులకొఱకు ఏయొకరైన దరఖాస్తుపెట్టుకొనగూడదా? వ్యాధులు మొదట ఎవరికి సంక్రమించినను, అవి వెంటనే వ్యాపించును గనుక, మరొకరికి రవాణాచేయబడుటకు ముందే దరఖాస్తి పెట్టుకొనుటకైన, సంక్రమించిననేగదా వాటి మహాత్మ్య మెఱుకబడుట. జోతిషశ్శాస్త్రము ననుసరించి, గ్రహముల ఉనికిని బట్టిగాని, లేక వాటి పరస్పర వీక్షణ ప్రభావమువలనగాని, బొల్లి, లేక కుష్ఠురోగములు రాగలవని నిర్ణయించుటకు వీలుండునేమోగాని, సుఖరోగములు సంక్రమించుటకుమాత్రము ఆలాటి ఆధా

రములేవియు గన్పడవు. అవి వ్యాపించుటలో గ్రహావీక్షణల నవసరము. రాకతప్పవు. ఇక వాది ప్రతివాదులలో నెవరివలన నింకొకరికి సుఖవ్యాధులు సంక్రమించియుండునని తీర్మానించడమెట్లు ? పైకమిటీ సభ్యులే యీతీర్మానము నొనరించగలరేమో ? వారికేఎఱుక !

మూడవషరతు చాలముఖ్యమైనది. అన్యమత వ్యామోహము ప్రధానకారణముగాదు ఈ మతాంతర వివాహములకు. కేవలము వ్యక్తుల కామవాంఛయే! బాహ్య సౌందర్యము నాశించి మతవివక్షత సలుపుచుండుటయే!! స్వమత విసర్జనమువలన హిందూమతమునకు, సంఘమునకు జాతికేలాటి ద్రోహము కలుగగలదో ఊహించకపోవడమే!!! జాత్యంతర వివాహములు జఱుగుట భారతీయులలో ఆచారముగ పరిణమించినప్పుడు హిందువైన వ్యక్తిపరమత స్వీకరణముగాని, మతాంతర వివాహముగాని వాంఛింపరాదని, విడాకులచట్ట ప్రతిపాదనమందైనా ఒకషరతుగ విధించుట ముదావహమే! దీనిని హిందువులు - ముఖ్యముగ మతాంతర వివాహముల కర్రులుసాచు నవీననాగరిక శిఖామణులు- ఎంతవఱకాదరించి, ఆచరించెదరో, కాలమే నిర్ణయించగలదు.

ఇక ఐదు, ఆరుషరతుల విషయము: ప్రతివాదియైన స్త్రీకాని, పురుషుడుకాని, జారత్వమునకు బాల్పడి యున్నచో వాదికి విడాకుల కనుజ్ఞ నొసగబడునను షరతు కల్పింపబడినది. నేడొక భారతదేశమునందేకాదు, యావత్ప్రపంచమునందు లక్షలాది జనులను పట్టి పీడించునదీ జారత్వమే. దీనినుండి తప్పించుకొని తిరుగువారు వందల

సంఖ్యలోనుందురేమో! వ్యభిచారము విచ్చలవిడిగా ప్రచారమునందుండుటకుగల కొన్ని కారణములను ముందు వివరించెదను. ఐతే ప్రతివాది జారత్వమునకు బాల్పడినచో, వాది విడాకుల నొసగవచ్చుననుట విపరీతముగ గోచరించును. బహిరంగముగనో, రహస్యముగనో, నిగ్రహశక్తి లేని వ్యక్తులు వ్యభిచారమొనర్చుట మనమెఱుగని సంగతి కాదు. ప్రతివాది జారత్వమొనర్చుచుండినచో అతనికి లేక ఆమెకు లభించు శిక్ష, వాదితో సంబంధమును త్రెంచుకొనడమేనా? వాది తరఫుననే సంబంధ విచ్ఛేదనకై చర్య తీసికొనబడవచ్చునుగాక! అంతమాత్రమున ప్రతివాదికి నష్టమేమి? సంబంధమే లేని వ్యక్తికి, వాదినుండి విడివడుట వలన సంతోషమే కలుగునుగాని, చింత ఆవంతయు కలుగబోదు. ప్రతివాదికి వాదితో తెగతెంపులు చేసికొనవలసివచ్చునేమో అను భయమెట్లు కల్గించబడును? వ్యభిచారియైన పురుషుడు, తనభార్యతో సంబంధము త్రెంపుకొనవలసివచ్చినను లెక్కచేయడు. విడాకుల చట్టము ధర్మమాయని ఎగిరి గంతిడి తానిదివఱకు రహస్య సంబంధముకలిగియున్న వ్యక్తితో తదుపరి బహిరంగముగనే సంబంధము కలిగించుకొనును. వ్యభిచారిణియైన స్త్రీ అదేవిధముగ సంచరించును. ఈ షరతువలన, విడాకుల చట్టమువలన, పాశ్చాత్యదేశములందువలె మనదేశమునందుకూడ వ్యభిచారమెక్కువగునేకాని, ఏమాత్రము తక్కువకాదు. వ్యభిచారమొనరించు వ్యక్తుల స్వేచ్ఛావిహారమునకే విఘాతముకలుగదు.

కాంగ్రెసు గోత్రీకులు రాష్ట్రపాలనాధికారమును స్వీకరించిన తదుపరి, మద్యపాన నిరోధశాసనమును ఎసంబ్లీలలో సంపూర్ణ విజయమునుగాంచి అమలునందుంచిరి. కాని దానికి విముఖులైన కొందఱు మహనీయులు, ఇతః పూర్వము అమెరికాయందు ప్రతిపాదింపబడి విఫలమైన మద్యపాన నిరోధ ప్రచారము నుదహరించి, భారతదేశము నందటులనే విఫలమగునని ఆశీర్వదించిరి. పాపమువారి ఆశీర్వాదబలమువలన, మద్యపాన నిరోధ శాసనము విఫలముగా పరిణమించకపోయినను, కాంగ్రెసు గోత్రీకులు పరిపాలనాధికారమునుండి విరమించిన తరువాత, ఆశాసనము తారుమారు చేయబడినది. ఈ మహనీయుల అడుగుజాడల ననుకరించి, మనముకూడ భారతదేశమునందు, పాశ్చాత్య ఖండములందు విఫలమైనట్లు విడాకుల చట్టము విఫలము కాకతప్పదని ఆశించుట సాహసమగునా? పాఠకులే దీనిని నిర్ణయింపగోరెదను.

ఇట్టిలోప భూయిష్టమైన షరతులతో విడాకులచట్టము దేశమునందు శాసింపబడుటవలన లాభమేమి? ప్రభుత్వమువారు, ఆరావుకమిటీవారు పునరాలోచించెదరుగాక!

.... వ్యభిచారము జఱుగుటకు కారణములేవియో విచారించెదము. స్త్రీని చెడునడతలో త్రిప్పుటకు, అవసరము తీరిన తరువాత ఆమె ఎట్టి కష్టదశలోనున్నను చూచియు చూడనట్లు నటించుటకు, పురుషుడు ప్రయత్నించుచుండును. తక్కినవిషయములలో నెట్లు ప్రవర్తించినను, స్వార్థమపేక్షించి స్త్రీవ్యక్తితో మెలగుపట్ల మాత్రము పురుషుడు పశుసమా

నముగ ప్రవర్తించుట మనము చూచుచునేయున్నాము. విడాకుల చట్టములను, పునర్వివాహములను శాస్త్రబద్ధముగ జేయుటతో, సపత్నితో సంసార సౌఖ్యముల ననుభవించుటతో సంఘమునందార్థిక, నైతికశిక్షణక్రమమును నిబంధించుటతో, తృప్తిపడక పురుషుడు స్త్రీలననేక విధముల స్వార్థలాభమునకై బాధించును. క్లబ్బులలోను, నాటకశాలలందు, సినిమాప్రదర్శనశాలలందు, గ్రంధాలయములందు, ఉద్యానవనములందు, నిరంకుశముగ బ్రవర్తించు హక్కును స్వాధీనపఱచుకొనెను. కామోద్రేకియై వావివరుసలు లేక నసహ్యముగ బ్రవర్తించును.

ప్రపంచములో కామోద్రేకులవలన సంఘమునకు చాలనష్టము కలుగుచుండును. కారణమేమనిన, కామతృష్ణయనునది అధికారవాంఛకన్న, పరరాజ్యాక్రమణోత్సాహమునకన్న బలీయము. రాజకీయములకన్న చాలదారుణమైనది. అన్యాయముగ బాధించు యితరుల నోటమట్టికొట్టుటకన్న, నిరంకుశత్వమునకన్న నష్టదాయకమైనది. యుద్ధములవలన వేలసంఖ్యలోనో, లేక లక్షల సంఖ్యలోను ప్రజలు మరణించెదరు. కాని శరీరసౌఖ్యాలాలసతవలన జాతికంతటికి ప్రబలనష్టము వాటిల్లును. జాత్యభివృద్ధి అడుగంటును. అక్రమ మార్గములందు విజృంభించు కామవాంఛ నణచుకొనజాలని దేశములో, విద్యానాగరికతలెంత అభివృద్ధిగాంచినను, పదార్థశాస్త్రవిజ్ఞానమెంత ముందడుగిడినను, లాభము ఆవంతయునుండదు.

వేశ్యావాటికలందుగాని, రహస్యస్థలములందుగాని, నిత్యము జఱుగుచున్న ఘోరములను, వాటిననుభవించు

టకు పురుషులు స్త్రీలను ప్రోత్సహించు పద్ధతులను, అవస రము తీరినతరువాత కరుణాహీనులై పెట్టుబాధలను, మోస గింపు మాటలకు దౌర్జన్యమునకు మానసష్టమునకు గురియై బెగడొందు లక్షలాది దిక్కులేని సోదరీమణులను జూచి కంటతడిపెట్టని పాషాణ హృదయులున్నచో వారికి నాసానుభూతి!

స్వాతంత్ర్యము ననుభవించు పాశ్చాత్యయువతికాని, దాస్యభారమున క్రుంగుచున్న భారతస్త్రీకాని, పురుషుని చేతిలో కీలుబొమ్మగా ఉపయోగింపబడుచున్నదనుట సత్య దూరము కాజాలదు. స్వసౌఖ్యమాశించి స్త్రీని మోస గించు మాయలాడితనము పురుషునియందెట్లు కాన్పించునో, అట్లనే త్వరగా మోసపోవు మనోదౌర్బల్యము స్త్రీయందు-విద్యావతియై నైతికబలముకలిగిన సబలతప్ప—కాన్పించును. ప్రస్తుత ప్రపంచసరణి నిరీక్షించిననో సంఘమునందు స్త్రీలకు కలుగుచున్న అన్యాయము మాసిపోదేమో, అను సందే హము కలుగును. ప్రపంచ జాతులన్నియు నాస్తిక వాద మును విశ్వసించి అంధకారమున మెలగుచున్నవి. నైతిక బలము నశించినది. ప్రపంచ సౌఖ్యముల ననుభవించుటయే మానవ జీవిత ప్రధానోద్దేశమైనది. పూర్వమువలె నేడు కూడ చక్కగ నలంకరింపబడిన గృహములకై, మృష్టాన్న మునకై, మధురపానీయములకై, కడుపులోని చల్లకదల కుండ, కండలు పెంచుకొను సుఖవాతావరణమునకై, పాటు పడకుండ, సాధారణ జీవితములను గడుపుచు, దొరికిన దానితో సంతృప్తి జెందుచు, ఆధ్యాత్మిక వికాసమును

గాంచు ప్రయత్నములొనర్చుచు ఈశ్వరధ్యానమొనర్చుచు మానవులు ప్రవర్తించినచో ఇప్పటిదారుణ పరిస్థితులు కలుగకుండ నుండెడివి. నిశ్చింతగ జీవితములు సౌఖ్యప్రదములై జరుగుచున్నంతకాలము నిరుపయోగులై మానవులు కామవాంఛకులొనగుట ఆశ్చర్యపడవలసిన విషయము కాదు.

కామలోలురై ప్రవర్తించువారుముఖ్యముగ ఆగర్భ శ్రీమంతులు. కావలసినంత ఐశ్వర్యమున్నందుకు వారాడనిఆట, పాడనిపాట ఉండదు. ధనాభావముచే కోరికలు ఫలించని వారినికీలుబొమ్మలవలె నాడించుచుందురు. తాత్కాలికముగనైన ధనలాభము కలుగుటచే బీదలు తమ గౌరవమును నిలబెట్టుకొనుటకూడ మఱచి పోవుచుందురు. ధనవంతులని, పేదవారని మానవ సంఘమునం దేనాడు వ్యత్యాసములేకుండపోవునో ఆనాడు నేటివిషమ పరిస్థితులు కొంతవఱకు బాగుపడగలవేమో ? నాడురహస్యముగ గాని బహిరంగముగగాని శరీరము నమ్ముకొను దౌష్ట్యముడుగంటు ను. ప్రపంచమున నేడొకరష్యాదేశమునందు మాత్రమే మానవుల స్థితిగతులు సమానముగనున్నవి.

చాలమంది డాక్టరులు కామోద్రేకము నణగ ద్రొక్కుటసాధ్యము కానిపని యనిచెప్పుచుందురు. కాని అది సత్యసమ్మతము కాదేమో ? మానవునిలో ఒక్క కామోద్రేకమేకాదు, తక్కిన భావములన్నియు సమానముగ విజృంభించును. క్షుద్బాధ, దాహము, క్రోధము, మాత్సర్యము, మోహము, లోభము, మోసము, నిర్దయ, విరంకు

శత్వము మొదలగునవన్నియు కామమువలె సమానముగ హృదయమును బాధించుచుండును. మితిమీరినచో ఇవన్నియు మానవుని పతనమునకు దారితీయగలవు. సంఘమునందు శాంతముగ ప్రవర్తించుటకై ప్రతివ్యక్తి తనలోని లోపములను, ఉద్రేకముల నుపశమించుకొనక తప్పదు. అదే విధముగ కామమును కూడ స్వాధీనమునందుంచు కొనుట ముఖ్యావసరము. లేనిచో సంఘమునకు, కుటుంబమునకు, వ్యక్తిస్వాతంత్ర్య సౌఖ్యములకు నష్టమువాటిల్లుట తథ్యము. ప్రపంచమేమను కొనినప్పటికి, కామతృష్ణను జయించి ప్రవర్తించిన వ్యక్తి శారీరకముగ, మానసికముగ రెట్టింపు శక్త్యుత్సాహములతో నుండగలడనుట నిజము. హద్దుమీరి ప్రవర్తించినచో వీర్యపతనమెంత అపాయకరమో, ఊర్ధ్వముఖమొనరించుట వలన మానవునకది అంత లాభకరముగనుండును. ఊర్ధ్వరేతస్కులనే మనమస్ఖలిత బ్రహ్మచారులని పిలిచెదము. క్రీస్తు, గౌతమబుద్ధుడు, మహమ్మదు ప్రవక్త మొదలగు ప్రపంచ విఖ్యాతమతకర్తలు; శాస్త్ర విజ్ఞానవేత్తలు, మేధావంతులు, సాహిత్యాచార్యులు, బ్రహ్మచర్యము నవలంబించిన వారని చెప్పవలసియుండును. బ్రహ్మచర్యవ్రతమువలన కలుగులాభమును, యావత్ప్రపంచ పూజ్యుడగు మహాత్మాగాంధీగారు వ్రాసినదిదివరకే తెలిపియుంటిని. కనుక పునఃవ్రాయ నవసరములేదు. కాని, సామాన్య మానవుడు వీర్యరక్షణ ఫలితములనెఱుగక, ఇష్టమువచ్చినట్లు సంచరించి నాశనమొందుచున్నాడు. కామోద్రేకమును చల్లార్చుకొనుటకై తానెట్టిఘోరకృత్యముల

నొనర్ప సాహసించుచున్నాడో అణుమాత్రమైనను తెలిసి కొనలేదు. తనతోబాటు, పవిత్రమూర్తియని గౌరవింప బడు స్త్రీవ్యక్తినిగూడ అధోగతికి గొనిపోవుచున్నాడు. ఆమెనులాలించి, ధనాశ కల్పించి, దేహసౌఖ్యానందమును కొండంతలుగజేసి వర్ణించి, తనస్వార్థమునకై వినియోగించు కొనుచున్నాడు. నికృష్టభావములతో ప్రవర్తించు కామ లాలసునివలన ప్రత్యేకస్త్రీవ్యక్తులకేగాక, తద్వారా సంఘ మునకు, దేశమునకు, జాతికి తీరని నష్టము కలుగుచున్నది. త్రాగుబోతుకు మదిరాపానమునందే యావత్సృష్టి యిమిడి యున్నదని గోచరించునట్లు, వ్యభిచారమొనరించు వ్యక్తికి తనచేష్టలలోనే స్వర్గసౌఖ్య మిమిడియున్నదను వెఱ్ఱిభావము కలుగుచుండును. హద్దుమీరిన వీర్యపతనము వలననెట్టి సౌఖ్యము కలుగగలదని మానవుడు భావించునో, అంతకన్న వేయిరెట్టింపుల సౌఖ్యము వీర్యరక్షణమువలన గలుగగల దని యెఱుగవలెను. శ్రీరామకృష్ణపరమహంసయొక్క ప్రియశిష్యుడు శ్రీవివేకానందస్వామి తనస్వీయ చరిత్రలో, కావలెనని లేక జాగ్రదావస్థలోనైన వీర్య బిందువు ఒక సారైన పతనము కాలేదని వ్రాసినాడు. ఇకవీర్యము నూర్ధ్వ ముఖమొనరించుట దుస్సాధమని చెప్పుట నమ్మదగిన విషయ మేనా ? అందఱు శ్రీవివేకానందస్వామివంటి నిర్జితేంద్రియులు కాకపోవుట నిజమేయైనను, తగుజాగ్రత్తతో వీర్యమును కాపాడుకొనుట వీలయిన విషయమేగదా !

పురుషుడుతాను కన్నెత్తిచూచు ప్రతిస్త్రీని తల్లిగానో సోదరిగానో భావించినచో, ఆమె దేహసంపర్కము సతడు

వాంఛింపజాలడు. స్త్రీలవలననే సృష్ట్యభివృద్ధి యగును. దాననే మనపూర్వులు స్త్రీని ప్రకృతితో బోల్చి గౌరవించిరి. పురుషుడే భావములో స్త్రీని దగ్గఱునో, ఆరూపముతో నామెకన్పడును. శ్రీరామకృష్ణపరమహంస, తనభార్య శారదాదేవిని, కాళికాదేవి స్వరూపిణియని భావించి 'మాతా' యని సంబోధించిన సంగతి మనము జ్ఞప్తియందుంచుకొనుటకు ప్రయత్నించిన నెంతబాగుండును. ఆయావేళలను, సంబంధ బాంధవ్యములను బట్టి స్త్రీ పురుషుని మాతృదేవిగను, సోదరిగను, భార్యగను సంతోష శాంతులను కలిగించును. "కార్యేషుదాసీ, కరణేషుమంత్రీ, శయనేషు రంభా, భోజ్యేషు మాతా" యనునానుడి మనము నిత్యము వినుచున్నాము. స్త్రీపతితయై, దేహము నమ్ముకొన్నచో దానికి కారకుడు పురుషుడు కాజాలడా? పరస్త్రీ సంపర్కమును వాంఛించు నపుడుకాని, లేక వేశ్యాగృహము నందడుగిడు చున్నప్పుడుకాని, పురుషుడు తనతల్లినికాని, సోదరినికాని, తలపునకుదెచ్చుకొనినచో చేయనుత్సహించు దుర్మార్గమునుండి విముఖుడు కాకుండునా? ఏదెట్లున్నను, పురుషుడు మానవుడేకాని విచక్షణాజ్ఞానము లేని పశువుకాదు గదా! నమ్మిపూజించు ఈశ్వరునియందు, వెళ్లిపూజలు సలుపు దేవాలయమునందు, మతమునకు మూలాధారమగు పవిత్రగ్రంథము లందెంత పవిత్రభావము కలిగియుండునో, పురుషుడు పరస్త్రీని చూచినప్పుడంతటి ఉదారభావముకలిగి యుండుట చేతకానిపనియగునా? మనసారగాకుండ, బాహ్య ప్రదర్శనమునకు మాత్రమే పాశ్చాత్యదేశము లందాచరించు

నట్లు, స్త్రీని చూడగానే నమస్కరించుట, మందహాస మొన రించుట, లేచి తానుకూర్చొనిన కుర్చీనిచ్చుట, మర్యాదగ సంబోధించి మాట్లాడుట మొదలగునవి జరుపుట కేవలము నిష్ఫలమే. ప్రపంచమునందు పడుపువృత్తిని, రహస్య-బహిరంగ-వ్యభిచారమును నిర్మూల మొనర్ప దలచినచో, పురుషుడు స్త్రీని భోగ్యవస్తువుగా మాత్రమే పరిగణించక, ఆమెలోనుండు సదాశయములను, సద్గుణములను, దాతృత్వ భావమును, ప్రేమను, సేవాతత్పరతను, స్వార్థత్యాగమును పవిత్రభావముతో గౌరవించుట నేర్చుకొనవలెను. తన సోదరిని పవిత్రప్రేమతో దిలకించుట, తనతల్లిని భక్తిగౌరవ ములతో బూజించుట పురుషునికెంత ఇష్టమో అట్లనే పర స్త్రీనిసైతము సోదరిగనో, తల్లిగనో భావించి పవిత్రప్రే మను జూపుట వాంఛనీయము; ధర్మసమ్మతము; శాంతిదా యకము.

వ్యభిచార మనునది మానవప్రపంచము నందనాది నుండి సాంఘికాచారముగ వచ్చుచున్నదనియు, దానిని నిర్మూల మొనర్చుటకు పూర్వులెంత విశ్వప్రయత్నము లొన ర్చినను కృతకృత్యులు కాజాలక పోయిరనియు, అదిసృష్టి ఉన్నంతవఱకు జరుగుచునే యుండును కనుక విచారించ వల సిన విషయము కాదనియు, స్వయముగ నిరుత్సాహులై, ఇతరులను నిరుత్సాహ పఱచెదరు. ఐతే వారివాదన నిజ మేనా ? వ్యభిచార దోషము పూర్వకాలమునందున్న మాట కాదన జాలము. కాని, అదినేటివలె కేవలము బహిరంగ ముగ, వ్యక్తిస్వాతంత్ర్యమను మిషతో, ఎచటపట్టిన నచట

ఎప్పుడు వలయుననిన నప్పుడు జఱుగ లేదు. మతవిశ్వాసము మౌఢ్యమునకు దారితీయు పరిస్థితులందు మాత్రమే అది జఱుగుచుండెడిది. ఇప్పటివలె దానికి ప్రాధాన్యత కలిగింపబడకుండెను. మహారాజులు, శ్రీమంతులు, ఒళ్లుకొవ్వెక్కి బహుభార్యలను కలిగియుండెడివారు. పనిపాటలులేక, జీవనోపాధి లభించుటకై కష్టపడిపనిచేయు అవసరములేక, చపలచిత్తులై కామోద్రేకము పెచ్చరిల్ల స్వీయమాశించి బహుభార్యలను లేక ధనవంతులగుటచే కంటికింపైన జవ్వనులను (భార్య వేరుగా నుండవలసినదే!) ఉంపుడుకత్తెలుగ స్వీకరించెడివారు. ఈదుర్గుణమేగాక, మహారాజులు పరాజితులైన రాజులవద్దనుండి శిక్షగా కూతుండ్రను తెప్పించుకొని స్వోపయోగమునకై ప్రాకులాడెడివారు. ఇందులో మౌఢ్యము నూటికి నూరుపాళ్లున్నది. కారణమేమనిన వారి దృష్టిలో పోషణ బాధ్యత వహింపగల పురుషు డెంతమందినైన భార్యలుగ స్వీకరింపవచ్చును. పురుషుడైనంత మాత్రమున ఈనిక్కు, యీ దౌర్జన్యము, యీస్వేచ్ఛావిహారము ఏలనో అర్థముకాదు. ఇప్పటికిన్నీ, పురుషులలో సిగ్గులేని వారు ముగ్గురు నలుగురు భార్యలను కట్టుకొని కులుకుచూ, వారి శరీర బలమంతయు స్వసౌఖ్యమునకై వినియోగించుకొనుచున్నారు. ఎందుకిట్లు ప్రవర్తించెదవనిన పురుషత్వమని సిగ్గెగ్గులు విడిచి సమాధాన మొసగెదరు. ఏమి పౌరుషము! ఏమి పురుషజన్మ!!! పురుషజన్మ ఎత్తినందుకు సాధించు ఘనకార్యము బహుభార్యాత్వమేనా? వ్యభిచారమేనా? ఇతరమహత్తరాశయములను నిర్వహించు సామర్థ్యమును గడించుట అనవసరమా???

పూర్వము దేవదాసీలపద్ధతికూడ ఉండెడిది. దేవుని దాసీలు దేవదాసీలనిగదా! ఐననిక ఈపద్ధతి వ్యభిచారము క్రిందనేల పరిగణింపబడును? పూర్వము దేవదాసీలే నాట్యము, గానము, అభినయమునందు వంశపరంపరగ అభిరుచిని జూపించి వాటినభివృద్ధికి దెచ్చిరి. ఫలం. పత్రం, పుష్పం, తోయం, అనునట్లు భగవంతునికేది భక్తితో అర్పించినను జన్మతరించునని పూర్వుల ధృఢవిశ్వాసము. అట్టివిశ్వాసము నేటికిని కలదు. కాదనజాలము. అభినయమునందు, పాటయందు, ఆటయందారితేరిన యువతులు తమజీవిత కాలమంతయు భగవత్సన్నిధానమున నిశ్చలభక్తితో గడిపెడివారు. వారిఆశయము చేతనైనంతవఱకు భగవత్సేవ నొనరించుటయే. ఐహిక సౌఖ్యవాసనలను వదలి, దేహమును ఆత్మను భగవదార్పణ మొనర్చిన వారికి పరలోక సౌఖ్యమబ్బుననిగదా పూర్వుల నిర్వచనము. కాని, ఆరీతి జీవితమంతయు భగవత్సన్నిధానమున, దేవాలయములందు, గడిపినవారికి జీవనోపాధి గడించుకొను మార్గమేది? ఆయవకాశమెట్లు చిక్కగలదు? దీనినికనిపెట్టి ఆగర్భ శ్రీమంతులు మహారాజులు, దేవునితోబాటు, దేవదాసీలకుగూడ—భగవత్సేవ జేయుచున్నందున—కొంత భూవసతి గల్పించెడివారు. పూర్వము దేవదాసీలు పవిత్ర భావములతో నుండెడివారు. దాతల హృదయ ప్రవృత్తికూడ నట్టిదే. వారిలో ఎవరో యొకరు కామాంధులున్న నుండవచ్చును. కాని మొత్తము మీద దేవదాసీలయెడ దుష్టబుద్ధితో మెలగు వారరుదుగానే యుండిరి. కొంతకాలము దేవదాసీపద్ధతి ఆయావ్యక్తుల

అభిమతముపై జరుగుచు వచ్చినది. స్వార్పణ మొనరించు కొనువారివలన నేవైపరీత్యము జరుగదుగదా! రానురాను కాల ప్రభావము వలన భగవత్సేవ చేయుట భారమనిపించినదీ దేవదాసీలకు. ఆముష్మిక చింతన దూరమైనది. తమ చక్కదనమును, సంగీత విద్యాభినయములను వృథాగా భగవదార్పణ మొనరించుకొనక, స్వైర విహార మొనరించు కళావంతుల (ఇరువురికి వివాహములు లేవుకనుక) జీవితము వారినాకర్షించినది. వారును ఐహిక సౌఖ్యముల ననుభవింప నువ్విళ్లూరుచుండిరి. దేవాలయములందు నిత్యవిధితో బాటు తప్పని సరిగ ఆటపాటలను జరుపవలెనుగాన, ఇష్టమున్నను లేకున్నను, చేదుమందు త్రాగినరోగివలె, ప్రాణములను బిగబట్టి తమపనిని నెరవేర్చుకొనుచుండిరి. కారణమేమనిన దేవదాసికి వంశ పారంపర్య మనుభోగ్యమైన భూవసతి నియమితకృత్యములను జరుపనిచో మాయమైపోవును కాబట్టి ఇష్టమున్నను, లేకున్నను, ఆటపాటలను జరుపుట తప్పని సరియైనది. ఐహిక సౌఖ్యముల నైపు హృదయము లాకర్షింపబడినందున రహస్యముగ తప్పుడు పనులకు మార్గమాలోచించిరి. దేవాలయ ధర్మకర్తలతోను, పూజారులతోను; పరస్త్రీలను చెరచుటకై వేచియుండు సోమరిపోతులతోను, దేహమమ్ముకొను వ్యాపారమునకుదిగిరి. ఇనాము భూములు పోవుననే భయముతో కొందరు వృద్ధవనితలు తమకూతుళ్లను దేవదాసీత్వ మొనర్ప వలసినదిగా వేధించుచుండిరి. తల్లులమాట త్రోసివేయలేక కొందరు, ఎదురు తిరుగజాలినను జీవనము జరుగదనే భయముతో కొందరు

వంశపారంపర్యము వచ్చు దేవదాసీత్వము నొనరింప మొద లిడిరి. పరిస్థితులు తారుమారైనందున, దేవదాసీలు భగ వత్సేవ సల్పుటకు బదులు మానవసేవ సల్పుచుండిరి. కను కనే దేవదాసి పద్ధతి నేడు కంటకముగ గోచరించు చున్నది.

భారతదేశమునందు దేవదాసి పద్ధతి యున్నట్లే, తక్కిన దేశములందుకూడ ప్రబలమూఢ విశ్వాసములుడెడివి. వాటినెఱిగియున్నను, ఇచట వ్రాయుట సభ్యతాగౌరవము నకు భంగముగనుండును, కనుక వ్రాయజాలను.

ఐతే, ఈవేశ్యావృత్తి వ్యాప్తమెట్లైనది? ప్రతిదేశ మునందు వేశ్యలుగలరు. ఏవేశ్యనైనా వెళ్లి తనవృత్తి కారణమడిగినచో, దారిద్ర్యమనియో, అభిలాషయనియో, కులవృత్తియనియో, క్షుద్బాధయనియో, నిరాదరణ యనియో—వివిధకారణములను చూపించును. ఒక్క మన దేశమునందే తప్ప తక్కిన దేశములందు దారిద్ర్యము ప్రధా నకారణముగ దోచదు. పశ్చిమదేశములందనేకరీతులతో, వివిధకారణములతో, ఇది విజృంభించియున్నది. ఆదేశ ములోని వేశ్యలందు మర్యాద కుటుంబములనుంచి వచ్చి నవారు, పనిమనుష్యులు, వంటలక్కలు, తిండిలేక దౌర్భాగ్యపు వృత్తికి బాల్పడిన వారుకలరు. అచట నలుగురాచరించి ఆమోదించినది గాన రహస్యవృత్తికిదిగిన సాధారణ స్థితిగల స్త్రీలు ధనవంతులైనచో పునః సంఘ మునందు మర్యాదగానే ప్రవర్తింపగలదట! ప్రపంచమిక ధర్మపద్ధతులమీద నడువవలెననిన ఎట్లు పొసగగలదు?

అలంకరణయుక్తలగు సుందరీమణులు; సంగీతము నందు లాస్యము నందభిరుచి కలిగిన యువతులు; అందమైన దుస్తులను ధరించుటయందు, మృష్టాన్నభోజనమందు, స్వైరవిహారమందు, అభిరుచికలిగి అపేక్షించు యువతులు; మాయలమరాఠీలగు యువకుల మోసగింపుమాటలకు, సలుపు చేష్టలకు, ఊరించు స్వర్గసౌఖ్యమునకు, త్వరగా మోసపడిపోవుట సర్వసాధారణమైనది. మోసపోయిన తదుపరి శారీరకముగ, మానసికముగ, నైతికముగ, సాంఘికముగ పతితులై సర్వకష్టనష్టముల ననుభవించెదరు. ఈ విషాద పరిస్థితులను గమనించియే ఉద్రేకపూరితులగు యువకకథకులు అనాథస్త్రీల జీవితములనంత కరుణామయ ముగ వర్ణించుచు కథలనల్లుచున్నారు. పురుషుల లాలింపు లకు మోసపోక, గుండెదిటవుతో, కుక్కకాటుకు చెప్పు దెబ్బ సమాధానమొసగుటయే అట్టియువకుల (కథకులు కాదుసుమా!) రోగమునకు దివ్యౌషధము. గ్రామములందు నివసించు అమాయక యువతులు పట్టణములకు వచ్చినచో అచటతోడి యువతు లనుభవించు స్వేచ్ఛ, ధరించు దుస్తులు, సలుపు ప్రవర్తనము, సేవించు చలనచిత్రప్రదర్శ నము, మెలగుసంఘ వాతావరణమును పరిశీలించి, తన్మ యులై తామూరీతి ప్రవర్తించుట కువ్విళ్లూరుచుండుట మనము ప్రతిదినము చూచుచునే యున్నాము. అమాయకురాండ్ర గుటచే తమవాంఛలను బహిర్గత మొనరించెదరు. వారిలోని హృదయ దౌర్బల్యమును గనిపెట్టి మాయోపాయులగు యువకులు క్షణములో వలలోవేసికొనెదరు. ఇంకేమున్నది ? పాలిడుగూటిలోనికి ఈగలు ప్రవేశించినట్లేకదా!

నైతిక దౌర్బల్యము శరీర దౌర్బల్యమువలన గలుగుచుండును. తక్కువజాతి వేశ్యలలో అందచందములుకలిగిన, శరీర సౌష్టవముకలిగిన, ఆరోగ్యముకలిగిన, ముఖవిలాసము కలిగిన యువతులను చాల అరుదుగ చూడగలము. దీనికి కారణము వారి తల్లిదండ్రుల రోగభూయిష్ట శరీర నిర్మాణమే. తల్లిదండ్రులు దుర్మార్గులైనచో, రోగిష్టులైనచో, వారి సంతానముకూడ బాల్యమునకు రోగములకు గురియగుచుందురు. నాలుగైదేండ్ల బాలుడు సుఖరోగములచే బాధపడుచుండుట చూచుచున్నాము. ముక్కుపచ్చలారని బాలునిదా ఆదోషము ? కాదు, అతనిగన్న తల్లిదండ్రులదే. కనుక ఆరోగ్యవంతులగు సంతానమపేక్షించినయెడల భార్యాభర్తలు జాగరూకతతో మెలగుట ముఖ్యావసరముకాదా ?

మన దేశమునందు దారిద్ర్యమే పడుపువృత్తి నవలంభించుటకు ముఖ్యకారణమను సందేహము కలుగును. భారతదేశమును మించిన భాగ్యవంతమగుదేశము ప్రపంచమునందులేదని, కనుక, 'రత్నగర్భ' యని యొకప్పుడు ప్రతీతికలదు. కాని నేడు దానిని మించిన దారిద్ర్య మనుభవించుచున్న దేశము మఱియొకటిలేదు. ఎట్టి తారుమారుస్థితి! దారిద్ర్యమనిన తక్కిన దేశములందొక హద్దు కలదు. కాని మన దేశమునందేలాటి హద్దులేకపోవుటకు కారణము మానవుని నిర్ణయమునకు అందుబాటులో లేనంతటి దుర్భర దారిద్ర్యమే. నూటికి 80 మంది భారతీయులు నెలకు సగటున పదిరూపాయలైన సంపాదించని వారున్నారు! కొన్ని రాష్ట్రములందు రోజుకు రెండు మూడణాలకన్న

నెక్కువ సంపాదింపలేని స్త్రీ పురుషులుకలరు. నూటికి 20 మందికి మాత్రమే కడుపునిండ తిండి దొరకుచున్నది. కాని భారతస్త్రీలే, తక్కినజాతి స్త్రీలకన్న శీలరత్నముమునంద గ్రగణ్యాలను ఖ్యాతికలదు. కనుక దారిద్ర్యకారణమున స్త్రీ పురుషులు ఈ దౌర్భాగ్యపువృత్తికి బాల్పడుట గొప్ప తనము కాజాలదేమో!



# పండెండవ మజిలీ.



సంఘసంస్కారుల ఆందోళనకు మూలకారణమై, కొన్ని చట్టములను ప్రభుత్వమువారే విధించుట కవకాశ మొసంగిన, ప్రస్తుత హిందూ వైవాహిక సమస్య నొకింత ఆలోచింతము.

సంఘమునందు జరుగుచున్న వివాహములు—ముఖ్యముగా బ్రాహ్మణవైశ్యవర్ణములలో— బాల్యవివాహములని పిలువబడుచున్నవి. బాల్యవివాహములనిన నేమి? బాల్యము నందు కావింపబడు వివాహములనియేగదా! పసికూనయగు బాలికను నడివయస్సునందున్న పురుషునికో, ముక్కుపచ్చలారని పదిసంవత్సరములలోపు ఈడుగల పిల్లను ఏబదియవ పడి దాటినవానికో ఇచ్చి పెండ్లిచేయుట బాల్యవివాహమా? లేక అదే లేతవయస్సుగల బాలికలను, 14, 15 ఏండ్ల బాలురకిచ్చి వివాహముచేయుట బాల్యవివాహమా? ఒకటి అవునని, రెండవది కాదని చెప్పుటకు వీలున్నట్లు కనపడదు. ఈ రెండురకములైన వివాహములు బాల్యవివాహములే! బాలికలు లేతవయస్సులోనున్నప్పుడు చేయబడిన వివాహములు బాల్యవివాహములనియే పరిగణింపబడును. బాలికాబాలురకు చిన్నతనమునందు వివాహమొనర్పబడినదియు బాల్యవివాహము క్రిందనేవచ్చును. బాల్యవివాహము లొనర్చుట యిందుగల మంచిచెడ్డలేవి? ప్రపంచజ్ఞానమెఱు

గని బాలికలను వృద్ధాప్యచిహ్నములగుపడిన పురుషులకిచ్చి ముడివెట్టుట మహాఘోరము! పాతకమనిసైతము చెప్పవచ్చును. ధర్మాధర్మములవిషయమటుండనిచ్చి, ఐహికసౌఖ్య దృష్టితో బరికించిన స్త్రీ పురుషులు పరిణయానంతరము శరీరవాంఛ నాశించెదరని, వారికట్టి సదుపాయము లభించనిచో దుఃఖింతురనియు స్పష్టముకాగలదు. శరీర పటుత్వము క్షీణించు వయసునందుండిన పురుషులకు బాలికల నంటగట్టినచో దేహసౌఖ్యముల ననుభవింప వీలుండదు. దుఃఖించువారు యౌవనవతులగు స్త్రీలు. నలుగురికి తండ్రీ కూతుళ్లవలె గనిపించు వృద్ధపురుష బాలికా వివాహములు హేయముగ గనిపించక సమంజసముగ నుండగలవా? భార్య యీడేరునప్పటికి భర్త జరాభారమున గ్రుంగి మృత్యుగహ్వరమును జొచ్చుటకు సిద్ధముగనున్న కుటుంబము లెన్నిటిని మనము చూచుటలేదు. ఇటువంటి వివాహమువలన సంఘమునకేలాటి దోహదము చేకూరదు. వ్యక్తులకులేని సదుపాయములు సంఘమునకెట్లు కలుగగలవు? స్త్రీ పురుషులందఱిట్టి వివాహములను నిరోధించవలెను. ఇదివారి ముఖ్యధర్మము. ఇక చిన్నతనమునందే బాలికా బాలురకు గావింపబడు వివాహములసంగతి. పైరకపు పెండ్లిండ్లకన్న నివి కొంతవఱకు—గ్రుడ్డిలో మెల్లవలె— సమంజసము లనిపించును. నూటికి కోటి కెచటనో దురదృష్టవశాత్తు వివాహితుడైన యువకుడు మరణించుట జఱుగును. — అంతేకాని, సర్వసాధారణము కాజాలదు. భర్త మరణించిన తరువాత బాలికగాని, స్త్రీకాని వైధవ్య మను

భవించుట క్రొత్తవిషయముకాదు. బాల్యమునందే బాలికా బాలురకు వివాహమగుటవలన ప్రబలనష్టమేమియు కలుగబోదు. ఈడుజోడు లేకుండ జరుపబడు వివాహముల నర్థదాయకములగును కాని యివికావు.

ఐతే, బాల్యవివాహమువలన కలుగునష్టములేవి? స్త్రీ వైధవ్యమేనా? ఎంతచిన్నవయస్సునందు సైతము స్త్రీకి వైధవ్యమబ్బినచో పునర్వివాహమున కధికార మొస గబడదు. దానికి తారుమారుగనున్నది పురుషుల విషయములో వయస్సు ముదిరినను పురుషులకు ద్వితీయ, తృతీయ, చతుర్థ వివాహముల కధికారముకలదు. ఇటులుండుట శోచనీయమని వెనుక చెప్పియుంటిని. స్త్రీలకు వైధవ్యము ప్రాప్తించుట పూర్వజన్మ సంచితమనియు, దైవాధీనమనియు కొందఱు వాదింతురు. ఇవిరెండు నిజమే. భగవదిచ్ఛ ననుసరించియే సర్వము జరుగుచుండును. మఱి భార్యావియోగము కలిగిన పురుషులకు కూడనది పూర్వజన్మ సంచితముకాదా? మనము స్వప్రయత్నములందేమాత్రమైన స్వార్థమున్నచో సర్వము దైవాధీనమని ఉపేక్షించెదమా? మానవసాధ్యమగు కృషినిసల్పుటలేదా? అటులనే సాంఘిక విషయములందుసైతము సాధ్యమైనంతవఱకు పరిస్థితులను సుముఖమొనరించు ప్రయత్నములను సలుపవలెను. వ్యక్తిపరముగ స్వార్థము నపేక్షించినను, సంఘమునకు సంబంధించిన విషయములందుమాత్రము దూరదృష్టితో, స్వార్థత్యాగ మొనరించి పాటుబడుట తప్పనిసరి. ఈడుజోడు లేకుండ చేయబడిన వివాహములవలననే బాలవితంతువుల సంఖ్య

వృద్ధియగుచున్నది. ఈలాటి వివాహములకు బాలికల తల్లి తండ్రులు, వారిసలహాదారులు ముఖ్యముగ బాధ్యులగుచు న్నారు. సాధారణముగ ఛాందసులగు పురుషులే తమభార్యల ప్రతిఘటనను తృణీకరించి. ధనాపేక్షవలననో, దుస్సలహాల వలననో, బంధుప్రేమచేతనో, తమ బాలికలను వైధవ్య దుఃఖమనుభవింపజేయుచున్నారు. ఎవరెన్ని చెప్పినను వినని మూర్ఖులువారు. వితంతువైన కూతురుని 'ముండ' యని తిట్టుటకుకూడ వెరువరీ కఠినహృదయులు. వివాహమనిన వారికి సంవత్సరాది పండుగ జఱిపించినంత సునాయాసము. అంతేకాని భావిదంపతులుకాబోవు స్త్రీ పురుషుల యోగక్షేమములతో పనిలేదు. కడుపునబుట్టిన కూతురు వితంతువైనను లెక్కలేదుకాని, కన్యాశుల్కము క్రింద నొసగబడు డబ్బుకొఱకు వారు ప్రాణములనైన నర్పింతురు. సంతానభాగ్యమబ్బిన భార్యాభర్తలకు, తమ కూతుళ్లు భర్తవియోగ దుఃఖమనుభవించుచుండుట జూచి కులుకుటకు, దేహసౌఖ్యముల ననుభవించుటకు సిగ్గెటుల కలుగదో? ఎవరేమైన ప్రశ్నించినచో "అష్టవర్షాద్భవేత్కన్య" అను ప్రామాణ్యమును, దాని భావము గ్రాహ్యము కాకున్నను, వల్లెవేయుచుందురు. బాలికల కెనిమిదవయేట వివాహము గావించుట శాస్త్రసమ్మతమే ననుకొనినను, వయసుచెల్లిన పురుషులకిచ్చి పెండ్లిచేయుట శాస్త్ర విరుద్ధముకాదా? ఏశాస్త్రము ననుసరించి వృద్ధ వివాహములు సమ్మతములగునో? బాల్యవివాహములవలన కాదు అనర్థకములు కలుగునది; వృద్ధ వివాహములవలన నని చెప్పవచ్చును. భార్యావియోగము కలిగిన పురు

షుడు వంశాభివృద్ధినాశించి సంతానాపేక్షతో ద్వితీయ వివాహము నొనర్చుకొనుట కనుజ్ఞ కావలయునని వాదించ వచ్చును. తనవంశమభివృద్ధి జెందవలెనను కోరిక ప్రతి వానికి ఉండుట సహజమే. అంతమాత్రమున శరీరపటుత్వము నాలోచింపకుండ; తనకొసగి వివాహమొనర్ప బడిన బాలికయొక్క భావిస్థితిగతులనుగాని, ఆమె యభిప్రాయములను అభిమతముగాని, మనోవాంఛలనుగాని తలపకుండ; మఱలనొక బాలికనుచేబట్టు అదృష్టము కలిగెను కదాయని మురియుట భావ్యమేనా? అనపత్యహీనులే ద్వితీయ, తృతీయ వివాహము లొనర్చుకొనుచున్నారనుట సాహసము. ఎంతమంది కామవాంఛాపరులై, సంతానమున్నప్పటికి, రెండవభార్య తనసంతానమును ప్రేమతో జూడదేమోనను సందేహము హృదయమును పీడించుచున్నను, ద్వితీయ వివాహప్రయత్నములను సలుపుటలేదు? వంశాభివృద్ధి నాశించినను, తనకుకాబోవు భార్యయొక్క యోగక్షేమములను భావింపకుండుట క్షమింపదగిన సంగతియేనా? వివాహానంతరము సంతానముకలిగినను, దినదినము వృద్ధాప్యము డగ్గఱ వచుచున్ననందున్న పురుషునివలన నతని భార్యకుకలుగు సంతృప్తి ఎట్టిది? వంశాభివృద్ధి పురుష సంతానమువలననే కలుగగలదు. దురదృష్టవశాత్తు, లేక ప్రాప్తములేకనో, స్త్రీ సంతానమే కలిగిన వంశాభివృద్ధి యగుట కవకాశముండునా? పోనీ, మగపిల్లవాడే కలిగినాడనుకొందము. అతనివలన వంశాభివృద్ధి కాగలదనుకొందము. అంతమాత్రమున నైజముగ పురుషునిలో కాలగతి

ననుసరించి దాపురించు జరాభారము నిర్మూలమగునా? మరల యౌవనప్రాప్తి కాగలదా? మఱి అట్టి పురుషుని పెండ్లియాడిన యువతికి యౌవనోద్రేక మడుగంటిపోవునా? ఇట్టి పరిస్థితులందు కేవలము సంతానాపేక్షతో ద్వితీయ వివాహము గావించుకొనదలచినచో, 20 మొదలుకొని 25 ఏండ్లు—శరీర పటుత్వమునుబట్టి 30 ఏండ్లు—మధ్యవయస్సు గల పురుషునికి ప్రథమకళత్ర వియోగానంతరము పునర్వివాహ మొనర్చుటకు మాత్రమే అనుజ్ఞ నొసగుట సమంజస ముగనుండు నేమోయని నాసూచన. ఆతరువాత వయస్సు బాగా ముదురనందున, పునర్వివాహ యోగ్యత కలిగింప కూడదు. భార్యాభర్తలు సజీవులైయున్నను సంతానము లేని వారెందరోగలరు. వారికికూడ పునర్వివాహమున కనుజ్ఞనీయవలెరా? లేదా? వంశాభివృద్ధికొఱకు సగోత్రీకులగు బాలురను దత్తతజేసికొనుటకూడ మనకు క్రొత్తసంగతికాదు. సంతానము కలుగక, కళత్రవియోగము సంభవించిన ముప్పదేండ్లకు పైగా వయస్సులోనున్న పురుషులటులనే దత్తస్వీకార మొనరించుకొనవచ్చును. పునర్వివాహమువలన వారాకాంక్షించునది సంతానమేయైనచో తద్వారా వంశాభివృద్ధియేనగుచో, దత్తస్వీకారమునవలన నవిలంభింపకుండునా? ఇటువంటి కట్టుబాట్లను సంఘమునందేర్పఱచినచో బాలవితంతువుల సంఖ్యనూటికి తొంబది తొమ్మిదివంతులు తగ్గిపోగలదని నానమ్మకము. ఈడుజోడు గల భార్యాభర్తలతో, భర్తమృతివలన భార్యకు వైధవ్యము దాపురించిన నది విధివిలాసముకాని వేఱుకాదు.

ఇకవితంతూద్వాహము. బాలవితంతువుల సంఖ్య మితిమీరు చున్నందున ఈసమస్య తీవ్రరూపము దాల్చినది. చిన్నవయసునందున్న బాలికలను ధనాపేక్షతో ప్రథమ ద్వితీయ కళత్ర వియోగదుఃఖితుల కంటగట్టుట వలనను, భర్తలు మరణించునప్పటికి వివాహితగు బాలిక లప్పుడప్పుడే యౌవనదశ యందుండుట జరుగుటచేతను, వైధవ్యము ప్రాప్తించిన బాలికలకు పునర్వివాహమున కనుజ్ఞనొసగ బడనందునను, సంఘమున బాలవితంతువులసంఖ్య దినదినము వృద్ధిజెందుట వలనను, కొందఱు సంస్కరణాభిలాషులగు స్త్రీపురుషుల ఆందోళనమువలనను, వితంతూద్వాహ సమస్య తీవ్రరూపమును దాల్చినది. పుష్పవతులగుటకు పూర్వమో, లేక తదనంతర మొకటి రెండు సంవత్సరములకో భర్తలు మరణించిన బాలవితంతువులకు పునర్వివాహ యోగ్యత గలిగింపకుండుట ముమ్మాటికి గర్హనీయమే. వయస్సుచెల్లిన పురుషులకు తమ తనయలనొసగి వివాహ మొనరించుటకు చాలవఱకు తల్లిదండ్రుల ఆర్థిక దుస్థితియేకారణము. దారిద్ర్యమునను భవించుచున్న దంపతులకు, ఒకే సారి వందల రూపాయిలను చూచుభాగ్యము లభించినచో వారికి గలుగు సంతోషాతిరేకమున కుమార్తెల భావి సౌఖ్యము నాశించు చింతయే ఉండకబోవుట సహజమే. తల్లిదండ్రులేకాక మాతాపితృ విహీనలగు బాలికలను పోషించు వారుకూడ ప్రేమలేకనో, లేక నెటులైన వివాహమైన జాలునని ఆదుర్దాపడుటచేతనో, వృద్ధవివాహముల నొనరించెదరు వైధవ్యము సంభవించిన యువతులకు పునర్వివాహమున

కనుజ్ఞనొసగినచో వేలువేలు పురుషులతో సంభోగమను భవించు దోషము కలుగగలదనుట నిజమే. పూర్వకాలము నందు శిష్టాచార సంపత్తిగల బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణజులలో వితంతువులకు కఠిన నియమముల ద్వారా శరీర సౌఖ్యవాంఛల నరికట్టు ప్రయత్నములను సలుపుచుండిరి. కాని ఇప్పుడా కాలము గతించినది. సంభోగ సౌఖ్యానుభవమే మానవజన్మ తరించగల ఉపాయమని, పాశ్చాత్య నాగరికతావలంబకులు మనస్ఫూర్తిగ నమ్మి ప్రవర్తించుచుండ, యౌవనమందు వైధవ్యము కలిగిన యువతులను వైరాగ్య భావములో జీవితమును గడుపవలసినదని బోధించుట హాస్యాస్పదముగ నుండదా? పూర్వాచారములకు విరుద్ధముగ ప్రవర్తించుట మహాదోషమని వాదించవచ్చును. కాని నేటి విషమపరిస్థితులందు సంఘమే నామరూపములు లేకుండ బోవు చున్నప్పుడు, దానిని నిలబెట్టుటకు పూర్వాచారములను కొంతవరకు సడలించినను నష్టములేదేమో! జాతీయ నాగరికతను గాపాడుటయే భారతీయుల-ముఖ్యముగ హిందువుల ముఖ్యధర్మము. ఇల్లు తగులబడు చున్నప్పుడు, సామానును బయట బడవేయువారిని వంటింటిలోనికి వెళ్లిన దేవతార్చనపుపెట్టె మైలపడునని నిరోధించుట ఎంతసమంజసముగ నుండునో, అటులనే సంఘమే విషమపరిస్థితులందున్నప్పుడు దానిని సంస్కరించు ప్రయత్నమునందు కొంతవరకు పూర్వాచారములను సడలించుట మహాదోషించుటకూడ అసమంజసమే. ఐతే వితంతూద్వాహముల కనుజ్ఞనొసగు టలో కూడ కొన్ని నియమముల నేర్పరచుట ముఖ్యావసరము.

25 ఏండ్లలోపు యువతులకు మాత్రమే భర్తమరణించిన తరువాత పునర్వివాహ మొనర్చుకొనుటకు హక్కుండవలెను అంతకన్న మించిన ఈడుగల స్త్రీలకట్టి అధికారముండ కూడదు. కారణమేమనిన, 30 మొదలు 40, 45 ఏండ్ల వయసునందున్న స్త్రీలుకూడ భర్తలుమరణించిన తరువాత మరల వివాహ మొనర్చుకొనెదమని ఆందోళన సలుపుట, వారికనుమతి నొసగుటవలన సంఘమునకు క్రొత్తనష్టము కలుగగలదు. దానిని నిర్మూలించుటకు పునః భగీరథప్రయత్నములు సలుపవలసియుండును. "అడుసుదొక్కనేల? కాలు కడుగనేల?"—

పూర్వకాలమునందు రజస్వలానంతర వివాహములే కాని బాల్యవివాహములు లేనేలేవు. రజస్వలానంతర వివాహములను జరిపిన దోషమేమి? యనువాద మొకటికలదు. రజస్వలానంతర వివాహములు జరుగ లేదని మనము చెప్ప లేము. చారిత్రక దృష్టితో బరికించిన మాత్రము, కఠిన తురుష్క ప్రభువుల కాలమునందే హిందువులు బాల్యవివాహముల నొనర్చుట కుద్యమించిరని తెలియగలదు. అప్పటి దేశపరిస్థితులు, విదేశీయులును పరమతస్థులగు ప్రభువుల కఠిన నియమములు, హిందువులను సామధాన భేదదండోపాయములచేత తమమతమును స్వీకరించునట్లు చేయుట కవలంబించిన దుష్ప్రవర్తనము మొదలగునవి ముఖ్యముగ బాల్యవివాహములకు పునాదులని చెప్పవలెను. ప్రభుత్వపక్షమునుండి హిందువులను స్వమతత్యాగము పరమత స్వీకరణ మొనరింపవలసినదని గావింపబడిన ఒత్తిడి సహింపరాని

దిగా నుండెను. దురభిమానపరులై, పరమతస్థుల కుటుంబములను హీనముగ జూచి స్త్రీలను బలిమిని గొనిపోవుట సాధారణ కృత్యమైనది. ప్రభుత్వపక్షమునుండి ఏలాటిరక్షణ లేకుండపోయినది. స్త్రీధన మానప్రాణరక్షణకు గడంగిరి హిందువులు. బాల్యముననే తమబాలికలకు వివాహము గావించినచో, భర్తలువారి కేలాటి అగౌరవము కలిగినను సహింపకుండ బోరాడెదరనియు, అట్లగుచో బాలికలను కష్టకాలమునందు సంరక్షించు బాధ్యత తమకు కొంతతగ్గుననియు విశ్వసించిరి. వారిప్రయత్నములు చాలవఱకు నెరవేరినవని చెప్పవచ్చును. ఇప్పటి పరిస్థితులే వేఱు. పూర్వకాలమునందు హిందువులు పరాక్రమ సంపన్నులుగ నుండిరి. కదనమునకు వెనుదీయని వారుకారు. 15. 16 ఏండ్ల బాలురే సింహముపిల్లలవలె ప్రాణముల నైన త్యజించి శత్రునిర్మూలమగునంతవఱకు బోరాడెడివారు. ఆపౌరుషము, ఆత్మవిశ్వాసము, నేడుమనలో పేరునకైనను లేవు. అడుగంటిపోయినవి ఆనాటివిషమ పరిస్థితులున్నూ లేవు. కానిపూర్వము జఱుగుచూవచ్చిన బాల్యవివాహములు మాత్రము చెక్కు-చెదరకుండ నిలిచియున్నవి. కేవలము బాల్యవివాహములేగాక వృద్ధవివాహములున్నూ జఱుగుచున్నవి. బాల్యవివాహములకన్న వృద్ధవివాహములే విరివిగ జఱుగుచుండుటవలన బాలవితంతువులసంఖ్య పెచ్చుమీరినది. వారియాక్రందనము కర్ణకఠోరముగను, హృదయ విదారకముగను, ఉండుటచేత వితంతూద్వాహ సమస్యబయలుదేరినది. వృద్ధవివాహముల కంగీకరించిన సంఘము వితంతూద్వాహముల కంగీకరించుట

లేదు. ఏలకో విచిత్రముగనున్నది. నాభిని తినినవాడు మరణించునని ప్రతిమనుష్యు డెరిగినవిషయమే. తినువప్పు డూరకుండి, మరణించిన తరువాతవిలపించు వెఱ్ఱివాని విధముగనున్నది మనసాంఘిక పరిస్థితి. నాభిని మ్రింగినను, దానివలన ప్రాణాపాయము సంభవించుటకు ఘూర్వమే విరుగుడున కేదైన ఔషధము నిచ్చిన లాభమగునుగాని, ఊరక జూచుచుండి మరణించిన వానికొఱకు గుండెలు బ్రద్దలగునట్లు విలపించిన లాభముండునా? వృద్ధులకు బాలికలనంటగట్టు దురాచారమును మాన్పినచో, బాలవితంతువుల సంఖ్య ఇప్పటివలె హెచ్చుమీరియుండదుగదా! వారిగోడును జూడలేక సంఘసంస్కారులు వితంతూద్వాహ సమస్యను లేవదీయకనే యుందురుకదా! సంసారము చేయుచున్న స్త్రీపురుషులకు, స్వల్పకారణములను పురస్కరించుకొని, **వివాహ** విచ్ఛేదన మొనరించుకొను అవకాశమును గలిపించి పవిత్ర వైవాహిక ధర్మమునే మంటగలుపజాలిన విడాకుల చట్టమును ప్రతిపాదించు ప్రయత్నములు జఱుగుచున్నప్పుడు, మూలుగుచున్న సంఘము, భర్తలు మరణించుటవలన ప్రాప్తించిన వైధవ్యదుఃఖముతో జీవితాంతము క్రుళ్లుచున్న బాలవితంతువులకు పునర్వివాహ మొనరించుట కొప్పుకొనలేదా? నోటిముందరగల అన్నము గాలదన్నిన వానికన్న, క్షుద్బాధచే నల్లాడు వారికాహారమును సమకూర్చిన వాడు మాన్యుఁడుకాదా? ఈరెండింటిలో నేదిఉత్తమమో, ఆచరణయోగ్యమో సంఘనాయకు లూహింపజాలని స్థితిలో నున్నారా?

బాల్య వివాహములు చేయనిచో బాలవితంతువుల సంఖ్య తగ్గగలదని కొంతమంది వాదించుచున్నారు. ఏవిధముగ తగ్గునో నాకు గ్రాహ్యమగుటలేదు. బాలికలను వృద్ధులకిచ్చి వివాహముజేయకుండ నిరోధించుటవలన బాలవితంతువుల సంఖ్య యిప్పటివలె పెచ్చుమీరకుండునని వెనుక జెప్పియుంటిని. బాలికలనిన 10 ఏండ్లలోపు పిల్లలని కాదు నాఅభిప్రాయము. 10 ఏండ్లుదాటిన పిల్లలకే వివాహమొనర్పవలెను. రజస్వలైన బాలికకు వివాహమనిన నేమో, వైవాహికధర్మమన నేమో తెలిసికొనుటకు సామర్థ్యముబ్బునని చెప్పుచుందురు. ఊహాపోహలకేమి కాని, నేడు రజస్వలానంతరము వివాహమొనర్పబడిన యువతులలో ఎంతమందికి వైవాహికధర్మమన నేమో గ్రాహ్యమైనది ? వారెంతవఱకు పవిత్రధర్మమును నెరవేర్చుటకు పాటుపడుచుండిరి ? మంత్రపూతముగ గావింపబడిన వివాహసమయములందు దైవజ్ఞుడు పలికించిన మంత్రముల గూఢార్థమును గ్రహించి స్వధర్మమును నిర్ణయించుకొనజాలిరి ? మంత్రపూతముగ గావింపబడిన వివాహములను గుఱించి యేమైనా ప్రస్తావనయునా! అంతేకాని, ఉంగరములను మార్చుకొని, పెద్దమనుష్యులయెదుట రిజిస్టరుచేయించుకొని, ఏతంతు లేకుండ బంధువులచేత వివాహమైనదని ఒప్పించుకొని, రహస్య ప్రణయచేష్టలకు పాల్పడియే అర్ధరాత్రములందో పాడుపడిన దేవాలయముల చెంతజేరి ఆకాశము వంక జూచుచు ‘ మనసంబంధమును ప్రకృతిదేవత ఆమోదించినది ’ అని విశ్వసించి, తల్లిదండ్రులను ధిక్కరించి ఎవరికి

జెప్పకుండ పారిపోయి సిగ్గులేకుండ ప్రవర్తించి—పూర్తిచేసి కొనిన వివాహముల ప్రసక్తియే మనకనవసరము. రజస్వలా నంతరవివాహములు తక్కిన వర్ణములలో జరుగుట లేదా యనవచ్చును. ఏవి ఆతక్కిన వర్ణములు? బ్రాహ్మణుల లోనా, వైశ్యులలోనా? స్వయంవర వివాహములుకాని, రజస్వలానంతర వివాహములుకాని, సర్వసాధారణముగ జరుగుటలేదు. నవీననాగరికులమని విర్రవీగువారు జరుపు చున్నారేమో? వారిది సముద్రములో కాకిరెట్టసామెత ఇక శూద్రులలోనా? ఏకొద్దిమందో తప్ప, రజస్వలానంతర వివాహములనే జరుపుచున్నారు. వారిలోనూ బాల్య వివాహములు జరుపబడుచునే యున్నవి. కాని బ్రాహ్మణులలో వలె వృద్ధవివాహములు, వినగానే గుండెలవియునంతటి సంఖ్యలో జరుగుట లేదేమో! స్త్రీవితంతువైనను వారిలో మారుమనుమున కనుజ్ఞ కలదు. అది బ్రాహ్మణులలోలేదు. మారుమనుము మంచిదని నేనుపొగడను. కాని సంస్కారమందు బ్రాహ్మణులగ్రగణ్యులని—ఈర్ష్య చేత తక్కిన వర్ణముల వారు కాదని విమర్శించినను — మనపూర్వులభిప్రాయపడి యుండిరి కనుక మారుమనుమున కనుజ్ఞ నొసగలేదు. రజస్వలానంతర వివాహములను జరుపు ఆచారము నేటివఱకులేని బ్రాహ్మణ, వైశ్య కుటుంబములందు వాటిని జరుపుటకు ప్రయత్నించినచో ఏలాటి కష్టనష్టములు కలవో, కీ! శే! శ్రీవావిలికొలను సుబ్బారావుగారు తమ "ఆర్యాలోక చరిత్ర" యందు విపులముగ వివరించి యున్నారు. దానిని పూర్తిగ చదువవలసినదని నాసోదరీమణులకు సలహానిచ్చుచున్నాను.

రజస్వలానంతర వివాహములవలన వితంతువుల సంఖ్య ఎంతవఱకు తగ్గగలదను ప్రశ్న! వృద్ధులకిచ్చి వివాహములొనర్చుట మాన్పబడినచో, రజస్వలానంతర వివాహములుకాని, లేక రజస్వలాత్పూర్వ వివాహములుకాని,— రెండింటిలో ఏదొకటి జరిపినను— బాలవితంతువుల సంఖ్య తగ్గిపోగలదు. భోగవాంఛలు కలుగుట రనస్వలానంతరమే కదా! భర్తృగృహప్రవేశము నిర్ణయ ముహూర్తమునకే వైవాహిక ధర్మానుసరణముగ బ్రవర్తించుట భర్తృగృహ ప్రవేశానంతరమేగదా! రెండు విధములగు వివాహములందు వధూవరుల వయస్సు పరిగణింప బడునుకదా! దైవచిత్రము వలన వైధవ్యము సంభవించుట నెట్లును సమానమేకదా! బాలవితంతువులకు పునర్వివాహయోగ్యత గలిగించిన తరువాత రజస్వలానంతరమైనను, తత్పూర్వమైనను నష్టములేదు కదా! రజస్వలానంతరమే కన్యలకు శరీరవాంఛ కలిగి దానిని తృప్తిబఱచుకొనుటకు పురుష సహాయ మవసరమగుట నైజముకదా! రజస్వలయైన పిదప పెండ్లి చేయబడి వితంతువైన బాలికకు పునర్వివాహము వెంటనే అవసరమైనచో, రజస్వలకాక పూర్వమే వివాహమైన బాలికకు వైధవ్యానంతరము యౌవనమంకురించిన తరువాత నవసరమగును. ఇంతేభేదము. జ్ఞానోదయమగుట వ్యక్తిగతము. ఇంతకన్న ప్రబల రహస్య మేమయిననున్నచో, దానినెఱిగించిన నాయీయభిప్రాయమును మార్చుకొని, తెలిసినవారితో పూర్తిగ నంగీకరించుటకు సర్వదాసిద్ధుడనే.

ఇటీవల కొంతమంది చాలాకివ్యక్తులు పూర్వము క్షత్రియ కన్యలకు జరిగిన స్వయంవర వివాహములనుగురించియు, రహస్య ప్రణయ చేష్టలకు బాల్పడి స్వేచ్ఛతో గావించుకొనిన వివాహములను పురాణములందు వర్ణింపబడిన 'గాంధర్వ, రాక్షస' మొదలగు వివాహములతో లంకె పెట్టి వర్ణించియు, ఆందోళన సలుపుచున్నారు. ఈఆందోళన హాస్యాస్పదముగ దోచుట తప్పలేదు. స్వయంవర వివాహములలో, సుక్షత్రియ కుమారుల సమక్షమున తనకు నచ్చిన వరుని నేరుకొనుటకు క్షత్రియకన్యకు అనుజ్ఞ నొసగబడెడిది – తానువలచిన వరునితో అంతకుముందెన్నడు రహస్యముగగాని, బహిరంగముగగాని వలపు ముచ్చట్లనాడియుండదు. అంతేకాకుండ, క్షత్రియజాతిని, పవిత్ర క్షత్రియరక్తమును గాపాడుకొనుటకు, వీర్యవంతమగు సంతానమును గాంచుటకు, వీలగునట్లు స్వయంవర వివాహములు జరుగుచుండెడివి. అంతేకాని, నేటి మన విచిత్ర వివాహధోరణిలో మాత్రము కాదు – ఈ దన నిలుపుకొనుటకైనచో, పాశ్చాత్యదేశములందు జరుగు స్వేచ్ఛా వివాహములు స్వయ వర వివాహములని వర్ణింప వీలుండునేమో! రాక్షస, గాంధర్వాది వివాహములు జరిగియున్నను, లేకున్నను, ఆనాటి పరిస్థితులు, ఆయావ్యక్తుల మనోగతములు, శౌర్యప్రతాపములు, మనకతీతములేమో! ఈలాటి వాదనలవలన ఉన్నవాస్తవము మరుగుబడునేమోకాని, సమస్యాపరిష్కారముమాత్రము కాజాలదు.

ఆడపిల్లలకు పెండ్లిండ్లు ఏవయస్సులో జరుపవలెనను విషయము నాలోచించి దేహారోగ్యమునకు ముఖ్యమయిన శీతోష్ణ పరిస్థితులను దృష్టియందుంచుకొని, సమర్థులగు వారు నిర్ణయింపవలసియుండును. వయస్సును నిర్ణయించు సామర్థ్యము లేకపోయినను, సాధారణముగ ఆయా ప్రాంతముల శీతోష్ణస్థితినిబట్టి రజస్వలాత్పూర్వము సంవత్సరమో 5, 6 నెలలు వ్యవధిగానో వివాహము లొనరించుట సమంజసమని సూచింప సాహసించెదను. రజస్వలానంతర వివాహములవలన – పైన వివరించిన ప్రకారము – ప్రత్యేక లాభమేమియు కనపడనందున, సనాతనుల అభిరుచుల నాదరించి, ప్రస్తుత క్లిష్ట పరిస్థితులను మార్చుటకు ప్రయత్నించుటయే సర్వజనాదరణీయమగునని ప్రత్యేకముగ జెప్ప నక్కఱలేదుకదా!



# పదమూడవ మజిలీ.



నేడు మనహిందూస్త్రీలు కోరుచున్న వారసత్వపు హక్కుల మంచి చెడ్డలను గురించి ముచ్చటింతము. ఇంతవఱకు హిందూకుటుంబములలో పిత్రార్జితమును సమభాగములుగ పంచుకొను హక్కు మగసంతానమునకే కలదు. స్త్రీలకు లేదు. మహమ్మదీయులలో అటులగాక, యావదాస్తిని విభజించి పంచుకొను విషయములో స్త్రీలకుకూడ పురుషులతో పాటు హక్కుకలదు. దానిని ఉర్దూభాషలో 'తర్కా' అనివాడెదరు. మనపూర్వులు స్త్రీలకు పిత్రార్జితమగు ఆస్థియందు భాగమేల పంచియివ్వకుండిరో? వారివి, తక్కిన విషయములవలె, యీనిర్బంధమునందు సైతము మహదాశయముతో ఉండవలెను. ప్రస్తుత విషమ పరిస్థితులందు వారునియమించిన విధానము పక్షపాతముగను, వక్రముగను కానుపించినను వారి కాలపరిస్థితుల ననుసరించి సక్రమముగనే న్యాయముగనే యుండి యుండవలెను. నేడాచరణయందుండిన విధానము మఱికొన్ని శతాబ్దములకో, లేక ప్రస్తుత కాలపరిభ్రమణ పరిస్థితులనుబట్టి, దశాబ్దములకో, పనికిమాలినదిగ గోచరింపవచ్చును. పురుషులతోబాటు స్త్రీలకుగూడ పిత్రార్జితమునందు హక్కుఉండవలెనా, లేదా? యనిగదా ఆందోళన చెలరేగినది. కోరువారు స్త్రీలుకనుక దీనిని కూడ మనము స్త్రీలసమస్యక్రింద బరిగణింపవలెను. ఫిరి

ఆందోళన ఎంతవఱకు సమంజసము? మగసంతానముతో పాటు స్త్రీసంతానముకూడ పిత్రార్జితమునకు సమానబాధ్యతగల వారేయగుదురుగాక! స్త్రీ పురుష వివక్షత పాటింపబడుచున్నంతవఱకు, ఎన్ని సంస్కారములు జఱిగినను, సృష్టిగతముగ నేర్పడిన స్త్రీపురుష శారీరక విభేదము మారుగలదా? ఆడది మగవాడుగను, పురుషుడు స్త్రీగాను మారుటకు వీలున్నదా? మానవుల బుద్ధులెట్లు వక్రముగనున్నవో, వాటికనుగుణ్యముగనే గాజ్ఞోల్లు పుట్టుకతో బాలుడైనను, కొంతకాలము గడిచిన తరువాత బాలికగ మారుట, బాలిక బాలుడుగ మారుట, సంభవించుచున్నదని వినుచున్నాము. పురుషుడు తండ్రిమరణించిన పిదప గృహమున కధిపతియగుట ఆచారముగ జఱుగుచున్నది. వివాహమై, యీడేరిన తరువాత, స్త్రీ భర్తృగృహమునకేగుటకూడ ఆచారముగ జఱుగుచున్నది. తాను జన్మించిన కుటుంబమును పోషించు భారము తనయునిమీదనుండును, కాని, తనయమీదనుండదు. పోషణ భారమును వహించు పురుషునికి పిత్రార్జితముతో పనికలదుకాన, వేఱొకయింటికేగు స్త్రీల కేమియవసరము? పోషించు బాధ్యత స్త్రీది కాకపోవడమే దానికి కారణము. స్త్రీ సంపాదనతో జీవితమును గడుపు వారధమాధములని మనవారు నిరసించిరి. భర్తృపోషిత స్త్రీకాని, భార్యచేతపోషింపబడువాడు పురుషుడు కాడుగదా! ఇప్పటికైననిదే ఆచారము జఱుగుచున్నది. దానికింతవఱకేవిఘాతము కలుగలేదు. అన్నదమ్ములతో పాటు పిత్రార్జితమునందు హక్కుగల మహమ్మదీయ స్త్రీలు

నైతము భర్తలచేతనే పోషింపబడుచున్నారు కాని వేఱు కాదు. పోషణభారము పురుషునిదైనప్పుడు, (స్త్రీ)స్వక్రమ ప్రవర్తన కలదియై పురుషుని పోషణయందుండ దలచినప్పుడు ఆ స్త్రీప్రమేయము వారికవసరమో, అనవసరమో, నా సోదరీ మణులనే ప్రశ్నించెదను. ఆస్తిపాస్తుల విషయములందు ముఖ్యముగ బరిశీలించ వలసినది ప్రేమకాదు, ఆర్థిక పరిస్థితులు.

ఒక కుటుంబమునందు యజమానికి నలుగురు కొడుకులు, ఇద్దరు ముగ్గురు కూతుళ్లు గలరనుకొనుము. అతను రెక్కలకష్టముమీద జీవితము జరుపునుకొనుము. ఏదో కొంత పిత్రార్జితమో, లేక స్వార్జితమో, కలదనుకొనుము. ప్రతికి యున్నంతవఱకు తనరెక్కల కష్టముమీదనే కాకుండ, ప్రతి ఏడు వచ్చే ఆదాయమును ఆధారముగా జేసికొని జీవించుచుండెనను కొనుము. అతను మరణించిన పిదప సంతానమునకు పిత్రార్జితముగ సంక్రమించిన ఆస్తియందు విభాగము లేర్పడినవనుకొనుము. సమానహక్కు లుండినచో పిత్రార్జిత మెన్నిభాగములుగ పంచవలసివచ్చును? ఆరు, ఏడు భాగములుగ గదా? నలుగురు కొడుకులు వివాహితులైన తరువాత ఆకుటుంబము నాలుగురెట్లు వృద్ధిజెందును గదా? సమిష్టిగ గాకుండ వేరుపడినచో నాలుగు భాగములు గనైన పరిగణింప బడును కదా? సమిష్టిగనైనను, వేఱు వేఱుగనైనను, ఆకుటుంబమును బోషించు భార మనుమ డింపదా? కాని, ఆడపిల్లలకా గొడవతో పనియేలేదు. అన్న దమ్ములను ప్రేమమిగులునేగాని; కుటుంబ పోషణ భారము

నందేలాటి బాధ్యత లేకుండును. పురుషసంతానముతో
బాటు స్త్రీసంతానమునకు కూడ సమానభాగ మొసగబడి
నచో, నిక, పిత్రార్జితమగు ఆస్తి నామరూపములు లేకుండ
విభజింప బడదా? భర్తృపోషితలగు సోదరీ ద్వయమునకు
ఆస్తిపంచిపెట్టవలసి వచ్చినచో, వారికార్థికముగ నష్టము
కలుగదా? అనుజన్ములతోబాటు సమానభాగమును పంచు
కొనిన స్త్రీలు తమఆస్థిని ఎవరు అనుభవింపజూచి యూర
కుండెదరు? సక్రమ పరిస్థితులందు, మోసమొనరించు దుష్ట
భావములకు హృదయములందు తావొసంగక, మెలగు సతీ
మణులు తమభర్తలకేగదా ఆదాయము ననుభవించు అధి
కారము నొసగునది. అనగా, ఒకపురుషునికి రెండు విధ
ములగు ఆస్థి దాపురించుటయేగదా! ఇది ఏమిన్యాయమో
గ్రాహ్యము కాకుండనున్నది. బీదపరిస్థితులందుండి, సంతాన
మెక్కువగానున్న విభజనము ప్రాణాంతకముగ నుండగ
లదు. భాగ్యవంతుల విషయమనిననో? కుమార్తెలు కోరక
పోయినను, వారు సౌఖ్యపడవలెనను సద్భావముతో తమ
ఆస్థియందు కొంతభాగము పంచియిచ్చెదరు. వేడుకలక్రిందనో
అత్తవారింటికి పంపునప్పుడో, ఈలాంఛనములు జరుగు
చుండును. ఇది మనమెఱిగిన విషయమే. వారికేహక్కులు
కావలయుననే గోలయే యుండక బోవును. ఇకకావలసిన
దెవరికి? సాధారణ పరిస్థితులందున్న వారికేగదా? వారికి
పిత్రార్జితమునందు పురుషసంతానముతోబాటు భాగములను
పంచి యిచ్చినచో, ఆర్థికముగ నేలాటిచిక్కులు కలుగ
గలవో పైనసూచించితిని. హక్కులకొఱకాందోళనము

నలువు యువతులను ప్రోత్సహించి స్త్రీ జనోద్ధారకులమని గుండెలు బాధుకొను నవీన నాగరికులీ విషయములో ఏమి సూచించెదరో వేచియుందము.

సాధారణముగ ప్రతికుటుంబమునందు కటికి దరిద్రులైతేనో, లేక ధనాశాపరులైతేనో తప్ప-భార్యాభర్తలు తమకూతుళ్లకు పెండ్లిచేయునప్పుడు కాబోవు జామాతల ఆర్థిక పరిస్థితులనుకూడ నాలోచించెదరు. రూపము కలిగినను, విద్యయున్నను, అత్తమామల పోరులేకున్నను, పదినెల ఆడుబిడ్డల ఒత్తిడి లేకున్ననుసరేకాని, కటికిదరిద్రులకు తమపిల్లల నిచ్చుటకు వారువెరతురు. కారణము ? తమ కూతుళ్లకు తినుటకు తిండి, కట్టుటకు బట్ట, లేనిలోపము కలుగగలదేమో ననికదా! ఏలాటి కష్టములేకుండ, నిర్విచారముగ జీవితము గడిచిన నంతేచాలునని వారాశించెదరు ఇక వారికూతుళ్లకు హంసతూలికాతల్పము లుండవలెనని పంచభక్ష్యపరమాన్నములే గావలెనని, తమకెంతటి ఖర్చుకైనా లోటులేకుండ చేతిలో నిరంతరము డబ్బుమూల్గుచుండవలెనని, ఇటువంటివే మతేమైన గొంతెమ్మ కోరిక లున్నచో పాపము! సాధారణ పరిస్థితులలో జీవితములు వెళ్లబుచ్చు తల్లిదండ్రులేమి చేయగలరు ? వారికోరికలను నెరవేర్చుట కేలాటి విశ్వప్రయత్నముల నొనర్పగలరు ? మాతృగృహమున నెంతటి దుర్భరదారిద్ర్యస్థితి ననుభవించినను, భర్తృగృహమున మాత్రము స్వర్గసౌఖ్యములు లేవే యని మూతిముడుచుకొను విచిత్రవ్యక్తులు ఎందరులేరు ? అందరటుల నుందురనికాదు నాయభిప్రాయము. దారిద్ర్య

మునందే మహదైశ్వర్యము ననుభవింపగల తృప్తస్వాంతులు కలరు. దారిద్ర్యమనుభవించుచున్నను వినయమునే భూషణముగ నమ్మి ఆప్రకారము తమజీవితములను నిర్దుష్టముగ గడుపు సోదరీమణులున్నూ కలరు. గొంతెమ్మకోరికలతో అహర్నిశములు తాము మరణావస్థనందుచు, తమకు సంబంధించిన వారిఎముకలను కొఱుకు వారుకూడ దురదృష్టవశాత్తు మనలో గలరన లేమా? పుట్టింటగాని, మెట్టినింటగాని, తమ గొంతెమ్మకోరికలను నెరవేర్చుకొను మార్గము గనపడ సందున, ఎంతసేపటికి వారు భాగ్యవంతులను జూచి మోజు పడు చుందురు. భాగ్యవంతుల జీవితమే వారిదృష్టిలో సార్థకమనితోచును. భాగ్యవంతులతోనే వారు స్నేహముతో మెలగెదరు. వారి ఆశ్రయమునే వాంఛించెదరు. వారి ప్రాపునే కోరెదరు. తృణమో, పణమో, వారొసగునది వీరికి భగవత్ప్రసాద సమానమగును. తోడి యువతుల చెలిమి వీరికి గౌరవహానిగ నుండును. వారితో మాట్లాడుటయే పనికిరాదు. వారినాదరించుట లేకపోయినను, వారాదరించినను తృణీకరించెదరు. మనోవాంఛలు కొనసాగుటకేలాంటి భట్రాజుపొగడ్తలకైనను సిద్ధపడెదరు. కారణమేమనిన, భాగ్యవంతులు తమను పొగడువారిని మన్నింతురు. ఎంతటినైచ్యమున్నను, వారాచరించు పనులను వారుగడుపుజీవిత విధానమును, చేయుచేష్టలను, మిన్నంటునట్లు పొగడినచో, వారు తబ్బిబ్బులై వేలకువేలు ఖర్చుపెట్టెదరు. దుస్సలహాల నిచ్చువారిని బహూకరించునట్లు, క్షేమము నాకాంక్షించి మంచి సలహానొసగు వారిని

మన్నించరు. ఇదెక్కడి ప్రారబ్ధమో కాని, పారిదృష్టిలో తక్కువస్థితిపరులు గౌరవార్హులు కాకుండ నున్నారు. పై పెచ్చు బీదవారుకూడ మానవులే అను యథార్థమును గ్రహించజాలని మూర్ఖ్యమును జూపించుచుందురు. ఈ తారు మారు పరిస్థితులలో మానవులెవరు, మానవత్వమునకు విరుద్ధముగ ప్రవర్తించువారెవరు పాఠకు లూహించుకొనిన బాగుండునేమో! కనుక వ్యక్తిగతమగు కుమార్తెల మనో భీష్టములను పూర్తిగ తల్లిదండ్రులు నెరవేర్పజాలరేమో కాని, ఆర్థికముగను సాంప్రదాయికముగను మంచిసంబంధ ములనే వెతకిచేసెదరని చెప్పనగును. సంతృప్తి లేని వ్యక్తికి హృదయవేదన, గొంతెమ్మ కోరికలుండుట పూర్వజన్మ సంచితము కాబోలు! దానికి తల్లిదండ్రు లేమి చేయగలరు? శక్తి కిమించిన కామితములను నెరవేర్చుట కసాధ్యమని తోచినప్పుడు కట్టుకొనిన భర్త లేమి చేయగలరు? అసంతృప్తి నిరాశ, విసుగుదల, సంతాపము, గుండెమంట, వైద్యమెన తించుటకు వీలులేనట్టిదియును, బహిర్గతమొనర్చుటకు వారికే వీలుకానట్టిదియునగు హృదయావేదన — వ్యక్తి చేసికొనిన ప్రారబ్ధకర్మ ఫలితమేగాని వేఱొండెటులగును? మగవారు పుట్టినట్లు, మేముకూడ తల్లిదండ్రులకు బుట్టలేదా? యని ప్రశ్నించుట అసంగతము. పుట్టలేదని ఎవరనుచున్నారు? ఎవరనగలరు? పురుషులవలె స్త్రీలుకూడ ఆర్థికముగ స్వశక్తిమీద నాధారపడ కలిగినప్పుడు, లేక కుటుంబపోషణ భారము వారే వహించుటకు బాల్పడినప్పుడు స్త్రీ లకు సమానభాగము పంచియిచ్చుట సమంజసముగ నుండు

నేమో! అంతవఱకు విషమ పరిస్థితినందుచున్న హిందువుల ఆర్థిక పరిణామము మఱింత హీనముగ నుండకతప్పదు. దానికి బూనుకొనిన వారికి దూరమునుండియే నమస్కరించెదను.

వ్యక్తిగతముగ నష్టముకలిగినవారే ఏ యాందోళనకైనను సిద్ధపడుట సర్వసాధారణము. దానిని వారు యావన్మందికి అంటగట్టుటకు ప్రయత్నించెదరు. ఇది సాహసము. తమ పరిస్థితులే తక్కినవారికికూడ గలవని విశ్వసించుటయే వీరిలోపము. ఇంకొక తరగతివారు కలరు. వారాగర్భ శ్రీమంతులై, తిన్నది అరగక, ఇష్టమువచ్చినట్లు నోటికి వచ్చినదంతయు ప్రచారమొనర్చుచుందురు. 'నలుగురికేగాని మనకొఱకుగాదు సారకాయ నిషేధమను ఉపదేశము" అను తత్వము వారిది. బీదవారిని కన్నబిడ్డలవలె జూచి, వలయు సహాయ మొసగవలసినదని సభలలో నెలుగెత్తిచాటియు, స్వగృహములందు నౌకర్లను కడుపునిండ అన్నముబెట్టక పీడించుచుందురు. భర్త మరణించిన స్త్రీ తనభర్త సంపాదించిన ఆస్తిలో భాగము రాకపోయినచో, తానునుభవించు హృదయావేదన తక్కినవారికిగూడ కలదనే దురూహపడును. లేదా, భర్తలు మరణించిన తక్కిన స్త్రీలవిషయమైకూడ-తనకు తెలియకబోయినను-తనవలెనే కష్టమనుభవించుచున్నారని విచారించును. ఇది సౌభ్రాతృత్వ చిహ్నమని తలచుట పొరపాటుసుమా! తన కష్టములను నివారించుకొనుటకు స్వశక్తి నీరీతి వృథాపుచ్చుటకుబదులు ఉపయోగించుకొనిన నెంతబాగుండును.? ఒక

వేళ, తన ప్రయత్నములు విఫలమైనంతమాత్రమున తనకు గల దురూహాలను నలుగురినెత్తిన రుద్దుట న్యాయముగనుం డునా? తాజెడ్డకోతి వనమెల్ల చెరచినదట! వీ రే కా రు. మరికొంతమంది యావజ్జీవితము చెప్పరాని, నివారణకాని హృదయవేదనతో, అవసరము తీరువరకు మంచిగనే యుండి బాధపడుచున్నట్లు నటించి, భర్తలతో డీకొనుచు నానాభీభత్సజేయు పతివ్రతామణులు తమకు స్వాతంత్రజీవన భాగ్య మబ్బుటకు పన్ను కుయుక్తులు వర్ణనాతీతము. వారికి స్వాతంత్ర జీవనము గడుపుటకు, భర్తలచేత నిలువెడలనంపిం చుకొనిన తరువాత ఏదైన ఆధారముండవలెనుగదా! అక్రమ ప్రవర్తనానంతరము భర్తృగృహ నిష్క్రమణ సంభవించి నచో, లోకముకొఱకు చేబట్టిన పురుషుని ఆస్తిలో వీరికేలాటి హక్కు కలుగ గలదు? కనుక, పిత్రార్జితములో స్త్రీలకు గూడ సమానభాగమునకు హక్కుండితీరవలెనని వీరివాద మేమో? పాపమంతవఱకు లేని అవసరమిప్పటి కెటనుం వచ్చెను? మఱియొకరకమువారున్నారు. భర్తలను తమ యిష్టమువచ్చినట్లు ఆడింపదలచిన స్త్రీలు, పిత్రార్జితమేదైన సంక్రమించినచో నిక స్వతంత్రముగ నుండగోరెదరు. ఉండ కపోయినను, చీటికిమాటికి ఉండెదమనుచూ! అని బెదరిం చెదరు. ఇందుకొఱకేనా సమానహక్కు! గృహకల్లోల ములు జఱుగనీయక సంసారమును శాంతముగ గడుప యత్నింపవలసిన హిందూస్త్రీలు తప్పటడుగులు వేయుటకా ఈ ఆందోళన!! సక్రమ ప్రవర్తనగలవారికే గొడవయు నక్కఱలేదు. కటిక దరిద్రులకు జన్మించిన స్త్రీలకు

పాపమిం హాస్యాలవిషయమే అనవసరము. కారణము వారికి పిత్రార్జితముగ సంక్రమించి వచ్చేనదిలేదు కనుక. అయాచితముగ తమకు గూడ కొంతముట్ట చెప్పగల శక్తి తల్లిదండ్రులకు కలదు కనుక ధనవంతులకు కూడ విచారముండదు. ఇక కానిపోని కోరికలు, మనోవ్యధలు మధ్యరకము వారికే గదా? ఎవరైన తమభుజాలు తడుముకొనినచో, ప్రత్యేకముగ వారిని నిర్దేశించి వ్రాయుటలేదు గనుక, వారికి సానుభూతి.

ప్రతివ్యక్తికి ఐశ్వర్యమే రావలయుననిన నెటనుండి వచ్చును? వారివారి అదృష్టములనుబట్టియే సిరిసంపదలు కలుగుచుండును. లేదని యెంత విలపించినను, ఇతరుల మీఁద నెంత ఆక్రోశము చూపించినను, క్రొత్తది రాగలదా? కురూపికి తనరూపమే చక్కగనుండునని తోచును. దానిని వాడు మనఃస్ఫూర్తిగ నమ్మును. అది నైజము. లేనిచో, తనకు సౌందర్యము తక్కువైనదని అహర్నిశములు స్మరించి బుద్ధిహీనుఁడై హృదయ వేదన ననుభవించును. ఎన్నికష్టములుపడినను, లేని సౌందర్యము రాగలదా? పైమెఱుగు పూఁతలతో కొంతవఱకు వదనము నునుపుగ మారినను, నైజముగ లేని సౌందర్యము కృత్రిమ ప్రదర్శనమువలన సమకూరునా? గర్భదరిద్రుఁడు, కోటిమందిలో ఏయొకవ్యక్తియో తప్ప, మహదైశ్వర్య సంపన్నుఁడగుట అసంభవము. ఒక వ్యక్తియైన నట్లగుట అతని పూర్వజన్మ సుకృతమే. మహదైశ్వర్య సంపన్నులు గొప్పవారని, దరిద్రుడు కొద్దివాఁడని తలచుట దోషము. మానవత్వమునకుగూడ లోపమేమో!

ఈ సందర్భమునందు శ్రీమతి ఆకుల లక్ష్మీకుమారి గారు 20–12–1942 ప్రజామిత్ర పత్రికలో సౌందర్యమును గురించి వ్రాసిన దిచట పొందుపఱచుట అనుచితముకాకుండుటమాత్రమేకాదు; సమంజసముగ నుండునని నా యభిప్రాయము.

"నిరాడంబరి, నిగర్వి, అయిన స్త్రీని యిల్లాలుగ చేసికోవాలని ప్రతి పురుషుడు కోరుతాడు. సౌందర్యకాంతులతో మెరయు స్త్రీనిచూచి ఆనందిస్తాడు. ఉవ్విళ్లూరుతాడు. కాని, ఆమెను భార్యగా స్వీకరించుటకు మాత్రం శంకిస్తాడు. పురుషుడు సౌందర్యాన్ని రోసిఉండలేడు. సౌందర్య పిపాస మానవకోటికి సహజజన్యము. సుందరమైన ప్రకృతిని, చక్కని యువతిని కాంచినప్పుడు అతడు ఆనందోద్భవ తరంగములపై ఊగి ఆరాధిస్తాడు. సౌందర్యాన్ని ప్రధానముగ యెంచిన స్త్రీపతితయే. సౌందర్యము శాశ్వతముకాదు. దాని నిలుకడ కొంతకాలము వరకే. ఉదాత్తాశయ ప్రపూరితమైన ఆత్మయే శాశ్వతం. అది అమరకాంతులతో వెలుగొందువినిర్మలజ్యోతి. రూపవతిఅయిన భార్యపొత్తువలన భర్త సుఖించలేడా? ఈ సందర్భంలో ఒక మిత్రుని జీవితం యిప్పుడు జ్ఞాపకం వస్తుంది.

'నామిత్రుడెంత అదృష్టవంతుడో!' అని ఆనందించాను. కాని అతని భార్య నిద్రనుండి లేచుసరికి తొమ్మిది గంటలగును. కాలకృత్యములు తీర్చుకొని సౌందర్య రేఖలు దిద్దుకొనునప్పటికి 10 గంటలగును. ఈలోగా భర్త పని మనుష్యులతో వేగి వేసారి కాఫీ ఫలహారములు ముగించు

కొంటాడు. ఆమె మధ్యాహ్నం భోజనానంతరము భుక్తాయాసం రెండుగంటలసేపు తీర్చుకుంటుంది. ఆమెను చూసిన కళ్లతో భర్తనుచూచి అవహేళనచేస్తారు ప్రజలు. భర్తను నవ్వులపాలుచేయడమే కాదు అందంగా అలంకరించుకొని పకపకలతో ఆనందాన్ని ఒలకపోసుకుంటూ నలుగురితో మాట్లాడుతూ, నలుగురిచూపుల్ని ఆకర్షిస్తూ ఆమె భర్తహృదయంలో అసూయాగ్నిరగులుకొల్పుతూ ఉంటుంది.

సుందరియైన యిల్లాలినిగల నామిత్రుని అదృష్టమిదియా? అనుకొన్నాను. అందుచేతనే కాబోలు నవనాగరికతకు ఆటపట్టయిన హాలీవుడ్ నగరంలో ప్రఖ్యాతమగ తారలందఱు నిరాడంబరులైన వనితలనే వివాహమాడి ఆ ప్రేమానుబంధములో తమజీవిత కుసుమాలను వికసింపజేసికొంటున్నారు.

ఆదర్శ గృహిణికి సౌందర్య పోషణలో మునిగితేలుటకు తనదైనందిన కార్యక్రమము తగినంత వ్యవధి యివ్వదు. అసలామె సౌందర్యాన్ని ప్రధానంగా ఎంచుకోదు. దానినే తహతహలాడదు. ఆమె నాకర్షించునది స్వీయ సౌందర్యముకాదు. తనభర్తయొక్క, తనముద్దు సంతతియొక్క పోషణము-జీవిత సుఖముమాత్రనే.

స్త్రీలోని సౌందర్యము ఎక్కువగా ఆకర్షించుననుమాటవాస్తవమే. కాని ఏండ్లు గడచినకొలది ఆ సౌందర్యఛాయలు కళాహీనములై ఉడిగిపోతవి. అందుచేతనే బాహ్యసౌందర్యానికి మురిసిచేసికొనినపెండ్లిళ్లు విజయవంత

ములుగాక విషాదాంత ఫలితాలనే పొందుతున్నవి. సౌం దర్య పోషణమే పరమావధిగ పెట్టుకొన్నస్త్రీ, ఆమెసోయ గాన్ని కాలం హరించినంతనే ఉచ్ఛిష్టాన్నమువలె సర్వజన తిరస్కృతగ బాధపడుచున్నది.

నిరాడంబరియైన యువతి సౌందర్యముపై ఎప్పుడూ ఆధారపడదు. తనకు ఎన్ని ఏండ్లు నిండుచున్నా చింతిం చదు. తన గురుతరగుణ సంపదనే పోషించుకొంటుంది. దానినే వెలలేని భూషణముగా చేసికొంటుంది.

అందుచేతనే పురుషుడు నిరాడంబరి, నిగర్వి అయిన స్త్రీనే తనకు భార్యగా చేసికోవాలని ఆశిస్తాడు ''

( ముందుగా తెలియబఱచి అనుజ్ఞబడయకుండ పై వ్యాసమును ఇందుపొందుపఱచినందుకు శ్రీమతి లక్ష్మీశ్వ కుమారిగారు, ప్రజామిత్ర పత్రికాధిపతులు వేఱువిధముగ దలపకుందురని నాకోరిక—గ్రంథకర్త. )

ఈ కడసారి వాక్యమెంతో భావగర్భితముగనున్నది ప్రస్తుత స్త్రీహక్కుల సమస్యకంతగా సంబంధించకపోయి నను, యీ యువతీమణి అభిప్రాయమును నాకు తోచినంత వఱకు విపులీకరించెదను. కనుక సోదరీ! విసుగుజెంద వలదుసుమా!

సహజ సౌందర్యములేని స్త్రీలెందరో తమభర్తలను ఆకర్షించుచుండుట మనము నిత్యజీవితమునందు చూడగలము వీరిలోనెంతమంది అందవికారముగ లేకున్నారు? ఐనప్పటికి భర్తలు వారిని ప్రేమతో జూచుచున్నారు.

సాధారణముగ స్త్రీలు పొరబడున దేమనిన, సుందరి యైన స్త్రీయే పురుషుల మనోభీష్టమలంకరింపగలదని. ఈ యభిప్రాయము సరియైనచో, సహజ సౌందర్యము లేని యువతులేల తమభర్తలను అరచేతనుంచుకొనగలుగుచున్నారను ప్రశ్న బయలు దేరును ?

ఐతే స్త్రీలు పై విధముగ తలచునది పొరపాటనిపించుకొనుటకు కారణమేమి ? వాస్తవనేమనిన, పురుషులు స్త్రీల సౌందర్యమునుజూచి ముచ్చటపడినను హృదయరంజకమగు సంభాషణను జరుపు నేర్పుగల స్త్రీల నెక్కువగ ఆదరించెదరు. ఈ నేర్పుగల స్త్రీలు అందగత్తెలైనను, కాకున్నను నష్టములేదు. చెప్పుకోదగినంత సౌందర్యము లేని స్త్రీలాలోపమును గుర్తించి, దానిని మఱుగుపఱచుటకెన్నివిధములో ప్రయత్నించెదరు. ముఖ్యముగ వారు ప్రయత్నించునది, తమ భర్తల హృదయములను రంజింపజేయుటయే. ఈ విషయములోమాత్రము అందగత్తెలను మించిపోగలరు. పురుషులు సహజముగ హృదయరంజకమగు ప్రియసంభాషణ నపేక్షించెదరు. ఎంతరూపవతియైనను భర్తహృదయ ప్రవృత్తుల నెఱిగి ప్రవర్తింపజాలని స్త్రీ సంసార సౌఖ్యమును పూర్తిగ ననుభవించలేదు.

భర్తహృదయము నెట్లు రంజింపనగును ? అతని అభిప్రాయములకుగాని, ఆశయములకుగాని, ఆమోదము జూపించక వ్యతిరేకముగ మాట్లాడిప్రవర్తించరాదు. విద్యావతులైన నాసోదరీమణులకు కష్టము కలిగించునదైనను, యదార్థమును మరుగుపఱచుట సాహసము. విద్యావతు

లైన స్త్రీలు, సౌందర్యముకలిగిన స్త్రీలు, భర్తలతో సామరస్యము కలిగించుకొని సంసారసౌఖ్యము నెక్కువగ ననుభవించుట లేదని చెప్పవచ్చును. దీనికి కారణమేమనిన రూపవతులైన స్త్రీలు తమ సౌందర్యమును జూచుకొని గర్వించుటలో భర్తృహృదయరంజక విధానమును లెక్కింపరు. విద్యావతులైన యువతులు తాము గడించిన విద్యావిధాన ఫలితముగ కలిగిన మార్పులను, సర్వ స్వాతంత్రాభిప్రాయములను బలపఱచుకొన బ్రయత్నించి భర్తలు తమకనుగుణముగ ప్రవర్తించనిచో జగడమాడుచుందురు.

కనుక, పురుషుల హృదయములను రంజింపజేసి, వారిని స్త్రీలు తమ స్వాధీనములో నుంచుకొనుటకు మార్గమేమనిన పురుషుల మనోప్రవృత్తులను, ఆశయముల నెఱిగి సాధ్యమైనంతవఱకు వాటికి భిన్నముగ నడువకుండుటయే. ఇట్లు నడచుటవలన స్త్రీల ప్రత్యేకతకాని, స్వాతంత్ర్యము కాని కుంటువడదు. భావదాస్యమునకు వెఱవనక్కరలేదు యావజ్జీవితము సంసారసౌఖ్యమనుభవించు కోరికగల స్త్రీలు సంపూర్ణ శాంతిసౌఖ్యములను గాంచగలిగెదరు. అనుకూల దాంపత్యమును పెంపొందించు విధానమున మెలగు భార్యమాట ప్రకారము నడచుటకు పురుషుడు, ఆమెచేతిలోని కీలుబొమ్మయని లోకము దురభిప్రాయపడినను, వెఱవనక్కరలేదు. వారి అభిప్రాయమును మన్నింపదలచి ఆమె నగౌరవపఱచుటకు యత్నించ నంతమాత్రమున పురుష మహాశయుడు కాకుండబోడు.

ఆసలుసంగతి. అవమానింపబడి అన్యాయముగ కష్టములపాలు గావింపబడిన వ్యక్తులకు ఆధారమొసగవలెనా? లేదా? యని ప్రశ్నింపవచ్చును. ఎంత సాధువర్తనమును ప్రదర్శించుచున్నను, హృదయపూర్వకముగ ప్రేమించి ఆనందముగ జీవితమును గడుపవలెనని ఆశించుచున్నను, పురుషులచేత బాధింపబడి దిక్కులేనివారిగ జేయబడిన స్త్రీలకక్కర లేదని చెప్పుటకు నాకు సాధ్యమగునా? కష్టములనుభవించువారికి సానుభూతి జూపించుట మానవధర్మమని నావిశ్వాసము. ఎందువలన కష్టములు దాపురించినవో విచారించుటకూడ ముఖ్యమే. ధిక్కరించి ప్రవర్తించినందున కలుగు కష్టములకు బాధ్యులాయావ్యక్తులే. వారికష్టములను నివారించుట కనేకమార్గములుకలవు. పక్షపాతబుద్ధితో, 'నీవు వాంఛించుచున్నదే సక్రమమనియు, పురుషులు దుర్మార్గులనియు, స్వార్థపరులనియు, స్త్రీహృదయముల నెఱుగనివారనియు,' ఆవ్యక్తికి బోధించి, విపరీతమగు కోరికలను కష్టనష్టములకు సహించి నెరవేర్చుకొనవలసినదని ప్రోత్సహించుట సరియైన మార్గమో? లేక ఏయే కారణములవలన పరిస్థితులు విషమించినవో వాటిని సక్రమముగ మార్చుకొని సాధుప్రవర్తనమున మెలగవలసినదిగ ప్రబోధించుట న్యాయమో? పాఠకబృందమునకే వదిలెను. అన్యాయముగ బాధింపబడిన వ్యక్తికి సహాయమొనర్చుట సంఘముయొక్క బాధ్యతలలో ప్రధానమైనది. స్వార్థపరుడైనను తనను జేబట్టిన భార్యను బాధించు పురుషునికి బుద్ధి చెప్పుట ముఖ్యావసరము. ఆస్థివిషమునందేకాదు, సంతా

నము విషయమునందే కాదు, మరియేయితర గృహసంబంధ మైన విషయములందైనను స్త్రీలకు సమానబాధ్యత లొసగవలెను. వారికేలాటి ఆటంకములు కలిగింపరాదనుమాట సత్యమే. కాని యేలాటి పరిస్థితులందు ? అన్యాయము జఱిగినవారికి మాత్రమే. నంజుచూపినవానికి రోగము నయమగుటకు, రెండువేళలందు రొట్టెపాలుమాత్రమే నియమించును వైద్యుడు. మఱొకరోగమునకు మఱొక ఆహారము. అన్నిరోగములకొకటే మందును, ఒకటే ఆహారమును వైద్యుడు నియమించునా ? ఆరోగ్యముతోనున్న వానికి కడుపునిండ తిండికావలెనుకాని పాలురొట్టెలతో ప్రయోజనమేముండును ? వానికి దానితో క్షుద్బాధ తీరునా ? సక్రమముగ సంసార జీవితమును గడుపు స్త్రీలకు సమాన భాగములను పంచియిచ్చుటవలన కలుగు లాభమేమి ? పురుషులతోబాటు వారికికూడ ఆర్థిక స్వాతంత్ర్య మిచ్చుటకనియేనా ? పురుషులకుగల స్వాతంత్ర్యమేలాటిది ? వారికదికలదా ? గృహకృత్య నిర్వాహణమునందు స్త్రీ పురుషులకు సమానబాధ్యత స్వాతంత్ర్యములేదా ? నేటి విపరీత పరిస్థితులందదిలేకపోవచ్చును. అంతమాత్రమున పురుషుల స్వార్థమేనా దానికికారణము ? స్త్రీలమనస్తత్వముకాదా ? కేవలము పురుషులు నూటికి నూరుపాళ్లు స్వార్థపరులని ఉద్రేకముతో తీర్మానించుట సాహసము కాదా ? స్త్రీలందఱు స్వార్థరహితలని చెప్పుటకు సాధ్యమగునా ? స్త్రీ ఆనంద స్వరూపిణియైనప్పుడు పురుషునికి స్వార్థము నిలుచునా ? ప్రేమప్రవాహమునందు ప్రతిగృహ

చ్ఛిద్రము గడ్డిపోచవంటిదని పైన జెప్పియుంటిని. పురుషుల మనస్తత్వములను మార్చుటకు సృష్టిగతముగ స్త్రీలకొక ప్రత్యేక నిపుణతగలదనికూడ చెప్పియుంటిని. కాదని స్త్రీలనగలరా? తోలుత నేవిధముగ సంచరించినను, హృదయ పరివర్తనము కలిగిన తరువాత పురుషుల మనస్తత్వమును గ్రహించి, దానికనుగుణ్యాముగ మెలగి, సాధ్యమైనంతవఱకు తమకు సుముఖముగ నొనర్చుకొన ప్రయత్నించి, ఆనందమయమగు సంసారజీవితమును గడుపుచున్న స్త్రీలను మనము చూచుటలేదా? వారి గృహవిషయములను ముచ్చటించుట మనము వినుటలేదా? గృహావిషయములందు స్త్రీలకు హృదయ పరివర్తనము స్వార్థత్యాగము వలన కలుగగలదు. స్వార్థత్యాగప్రదర్శనమున భారత యోషామణు లెల్లప్పుడగ్రస్థానమునే వహించిరని ఇట ప్రత్యేకముగ వ్రాయనక్కఱలేదు. నేటి భారత స్త్రీలు వారిసంతతిలోని వారుకారని యెవరైన ఆక్షేపించుటకు సాహసించునా? పురుషులు స్వార్థపరులని దూషించుటతో సరిపుచ్చుకొనుట స్త్రీల సాధ్వీతనమునకు కళంక మాపాదించునేమో! వారు తమ స్వార్థమును వీడి పురుషుల హృదయములలో పరివర్తనము తేగలుగు స్వార్థత్యాగము నేల ప్రదర్శింపరాదు? కొందఱు స్త్రీలు నిష్కారణముగ బాదింపబడుచుందురు. వారికి సానుభూతి జూపించుట, సాధ్యమగునంతవఱకు కష్టములను నివారించుట, ప్రతి విద్యావంతుని ముఖ్యధర్మము. హిందూ స్త్రీలు అందరు నేడు ప్రారంభింపబడిన ఆందోళనమునందు పాల్గొనుచున్నా

రనుటగాని, పాల్గొనగలరనిగాని చెప్పుట సాహసము. మంచి చెడ్డలను గ్రహించు సామర్థ్యములేని వ్యక్తులను, బుద్ధికలిగినవారు తమ ఆందోళన కనుగుణ్యముగ ప్రవర్తింపజేయగలరు. ఈసామర్థ్యములేకపోవుటకు కారణము విద్యార్థులు స్వమతి ధర్మత్యాగ మొనరించి పరమతధర్మ స్వీకరణ మొనర్చుటవలననే (పాశ్చాత్య నాగరికతా వ్యామోహము కలిగి, వారి యాచారములను, ఆశయములను మన్నించు హిందువు హిందువైనను పరమతధర్మ స్వీకరణ మొనర్చినవాడేయని నాయభిప్రాయము. కాదనుటకు రుజువు కలదా ? ) చదువుకొనిన స్త్రీలు లేరా ? కలరు. కాని వారు నేర్చిన విద్య మనదికాదు. జాతీయ విద్యకాదు. అది పాశ్చాత్యులది. ఏవిద్యయైనను నష్టము లేదుకాని దానిని సార్థకపఱచుటలోనే గలదు నేర్పు. తప్పుడు త్రోవలలో లభించిన సంస్కారము నుపయోగించుట సార్థకమగునా ? ఆభావమింకను నాకు తట్టుటలేదు భగవదనుగ్రహమువలన 'నాకట్టి సామర్థ్యము కలుగనేవద్దు. క్షీరనీరన్యాయము ప్రతివిద్యావంతునికి ముఖ్యలక్షణముగ ననువర్తింపవలెను. జాతీయ నాగరికతయనిన నేమో, మన సంప్రదాయములేవియో, మన ఆశయము లెట్టివో, ఆదర్శము లెట్టివో, విజ్ఞానమెట్టిదో, గ్రహింపగలిగినారా ఇప్పటి విద్యార్థులు ? గ్రహించుట కేలాటి ప్రయత్నములు సల్పిరి ? గ్రహింపజాలిన మహనీయులు మనజాతీయ విజ్ఞానమునే, నాగరికతనే; సర్వోత్కృష్టమైనవని ముక్తకంఠముతో ఎలుగెత్తి చాటినారు. చాటుచున్నారు. కాదను

వారు కలరా? భారతదేశమునందే కాక పాశ్చాత్య దేశము
[illegible]ము వారు భారతీయ విజ్ఞాన ముక్తారత్నములను
వెదజల్లుచున్నారు. పాశ్చాత్య విజ్ఞానమునందు వైశిష్ట్య
ము లేదా? ఉండవచ్చునుగాక! కాని సరిపోల్చి చూచినచో
మన ప్రాచీన విజ్ఞానముకన్న వారిది గొప్పకాదు. పోనీ,
సమానమనుకొనినను, గొప్పతనము లేనిదానికొఱకు ప్రాకు
లాడుట దేనికి? పాశ్చాత్య నాగరికతానుకరణ పితామ
హుల దృష్టితో బరికించి స్త్రనశల్య పరీక్షచేసిన నేమైన
మహాత్మ్యము గనపడునేమో? పండబారని మామిడికాయ
నుండి రసము నాస్వాదించుటకన్న, ప్రమగ్గి సిద్ధముగనున్న
మామిడిపండు రసమునే ఆస్వాదించుట బుద్ధిమంతుల లక్షణ
మగును. గాంధీమహాత్మునికన్న, విశ్వకవి రవీంద్రుని
కన్న, సుప్రసిద్ధ వేదాంతోపన్యాసకుడు రాధాకృష్ణునకన్న
మహాతపశ్శాలి అరవిందునికన్నను, ఘనులెవ్వరు?
ఈమహా పురుషుల దివ్యసందేశ మేమి? జాతీయతను జారవిడు
వకుము; స్వధర్మమును పరిత్యజింపకుము; వ్యక్తిత్వమును
జంపుకొని ఇతరుల కన్యాయమును సలుపకుము; అనియేనా?
ఎవరెన్ని చెప్పినను కన్నతల్లి నిపీడి, అమ్మా! యని తన
కిష్టమువచ్చిన స్త్రీని సంబోధించిన వాని వెఱ్ఱికి మందు
బుద్ధిమంతులే ఆలోచించెదరుగాక!

సోదరీ! క్రొత్తగ మనము ఉ[illegible]ముతో ప్రక్క-
బాటకు వెళ్లినామేమో!

విద్యాప్రాప్తిగలిగిన [illegible]ములు జాతీయ ధర్మ
మును విస్మరించుట మహాపరాధమని నా నిశ్చయము.

స్వమతమును దూషించుట తగదేరికి. మనమెవరి సంతతి వారమో, అట్టి ప్రాచీనార్యులను, మహర్షులను తృణీకరించుట తగదు. వారు నిర్ణయించిన నాగరికతా విధానమును త్యజించుట తగదు. పాశ్చాత్య నాగరికతయందు వారికే దైన మంచికలదని నమ్మకము కుదిరినను, గ్రుడ్డినమ్మకము కాకుండ సహేతుకముగ నుండవలెనుసుమా! దానివలన జాతీయ నాగరికత ఎంతవఱకు అభివృద్ధికి రాగలదో విచారించి, విరుద్ధముగ లేకుండినచో, గ్రహించి మన నాగరికతాచారములందు దానినాచరించుట శ్రేష్టమనియు, శ్రేయస్కరముగ నుండుననియు, నామనవి. పాశ్చాత్యులమతము గొప్పది కావచ్చును. కాని దాని నవలంబించువారి ప్రవర్తనమెట్లున్నది? మతమే అక్కఱలేదని నెట్టివేసినప్పుడు మతవిచారమున కవకాశ మెక్కడిది? వారి మతము వారికే పనికిరానప్పుడు మనకెందుకో? తన సాంప్రదాయములమీదనేగదా ప్రతిజాతియొక్క నాగరికత ఆధారపడియుండును. పునాదియగు మతమే పనికిరాదని త్రోసివేసినప్పుడిక నాగరికత ఎక్కడిది? మత విరుద్ధమగు నాగరికతను భారతీయు లెన్నడవలంబింపలేరు. ఒక్కొక్క జాతికి ఒక్కొక్క ప్రత్యేకతఉండును. భారతీయులకు మతమునను సరించు నాగరికతయే ప్రత్యేకత నొసగినది. పాశ్చాత్యులలో స్వేచ్ఛకలదనిస నుండనిమ్ము. ఆదేశ సాంప్రదాయములు వేఱుగనున్నవి. భారతదేశమున నవే సాంప్రదాయములున్నవనుకొనుట పొరబాటు. ప్రాచ్య దేశములకు, పాశ్చాత్యదేశములకు, అందునివసించు

జాతుల నాగరికతకు, 'దృక్పథమునకు ఆశయములకు' పరస్పర భేదముండును. "East is East, West is West, and never the twain shall meet" ( తూర్పు తూర్పే, పడమర పడమరే, రెండింటి కెన్నడు కలిసికొన వీలులేదు ) అని పాశ్చాత్యుఁడే వ్రాయుట కేల సాహసించును ? తూర్పు పడమరల నొకటిగా కలుపగలమా ? అసంభవము. ఐనా, తూర్పున భాస్కరుడుదయించుచున్నట్లు ప్రాచ్య దేశమునందే విజ్ఞానభాస్కరుడుదయించి ప్రకాశించుచుండును. పాశ్చాత్య దేశములందు సంధ్యాకాంతులు మాత్రమే విరజిమ్మబడును. మధ్యందిన మార్తాండుని దేదీప్యమానమగు కాంతులతో సంధ్యాకాంతులు సాటివచ్చునా ? యవ్వనము ముందఱ జరాభారము నెవర పేక్షింతురు ? కనుక ప్రాచ్యులకు విజ్ఞానభాస్కర తేజము ప్రాప్తించుచుండ, పాశ్చాత్యుల నేల దేబరించుట ! ప్రతిజాతికి తమ మత విషయములందుద్ధురభిమాన మెన్నటికిని పనికిరాదుసుమా ! — పరులెవరైన జోక్యము కలిగించుకొని దూషించినచో రోషము కల్గును. మనమతము నితరులు నిష్కారణముగ దూషించుచున్నప్పటికి నోటిలో గుడ్డలు కుక్కుకొని మిన్నకుండుట పరిపాటియైనది. అంతేకాకుండ ఇతరుల ఆక్షేపణ నిజమేమో అని మొదట సందేహించుట, తరువాత సత్యమేమో అని విశ్వసించుట, ఆతరువాత ముమ్మాటికి వాస్తవమేనని ఎలుగెత్తి చాటుట నిత్యకృత్యమైనది కాదనగలరా? ప్రాచీనమత సాంప్రదాయమును, సంస్కారమును, సాహిత్యమును, నాగరికతను — ఒక టేమిటి జాతీయతను సూచించు

ప్రతివిషయమును— తెలియకపోయినను విచారపడక తీవ్ర
ముగ విమర్శించి అగౌరవపఱచుటలేదు ? ఈవిధముగ జరు
గుటలేదా ? పుట్టుగ్రుడ్డికాకపోయినను, కనులను మూసి
కొని జగమంతయు నంధకార బంధురమని వాదించు వెఱ్ఱి
వానితో మనకేమిపని ? కన్నులు పొడిచినప్పటికి, బాధ
కైన నోర్చుకొనజాలి, వాటిని తెఱచి యదార్థ పరిస్థితు
లను గాంచుటకు నిరాకరించు దురదృష్టవంతుల సంగతి
మనకువలదు. ఏదేశములోనో, ఏజాతికొఱకో, ఆచరణ
యోగ్యములనిపించుకొనిన నియమములను, మనదేశము
నందు విధించుట ముమ్మాటికి గర్హనీయమే. వారి సం
స్కారమును తెలిసికొనకుండ, వారి సాంప్రదాయమునందు
గల మంచి చెడ్డలను గ్రహించకుండ, నాలుగురోజుల
భోగము ననుభవింపదలచి, సక్రమమైనవని నమ్మి, స్వదేశ
జనులకవి నిరర్థకములని తోచినప్పటికి, లెక్కజేయకుండ
ఆచరణయందుంచుటకు శాసన సభలయందు ఆందోళన
మొనరించుట గొప్పతనమనిపించుకొనునా ? రాజకీయార్థిక
కారణములవలన విజ్ఞానభాగ్యమును నోచుకొనని అమాయ
కుల హృదయములను కలతపఱచి స్వార్థమున వెలుపఱచిన
స్వాభిప్రాయములను వారినెత్తిన బలవంతముగ రుద్దుటకు
ప్రయత్నించుట న్యాయమనిపించునా ? మూలసూత్రము
లందుమాత్రమే వివిధ మతములమధ్య సామరస్యమున కవ
కాశముండును. కాని వాటినాచరించు ప్రజల ఆచార
వ్యవహారములందు భేదముండకపోదు. ఏదైన నొకక్రొత్త
ఆచారమును తీసికొనిఁ దలచినచో ఎన్నెన్ని విషయముల

నాలోచింపవలసియుండును! ప్రప్రథమమున జాతీయతకు భంగము కలుగునేలేదో (జాతీయతయనిన 'నేషనలిజం' (Nationalism) మాత్రమేకాదు, ప్రతి జాతికిగల సనాతన ధర్మమని చెప్పవచ్చును. జాతిధర్మము జాతీయత అనిపించుకోనదా ?); ఆనూత్నాచారమువలన సంభవించు లాభనష్టములేవియో; కొన్నికట్టుబాట్లలో నడచుకొను ప్రజల అభిమతమేమో; వారుదానికి విముఖులో, సుముఖులో; ఆర్థిక నైతిక పరిస్థితులేవో; మొదలగువాటి నెన్నిటినో ఆలోచించి లాభకరమని నలుగురేకీభవించిన ప్రయత్నించుట ధర్మమని వేఱుగ చెప్పనక్కఱలేదు. అంతేకాని, విన్నన్న చెప్పినదే వేదమగునా? తనకు దుఃఖమువచ్చిన నలుగురికి దుఃఖమునమ్మదిన రాగలదా ? ప్రత్యేకవ్యక్తుల కష్టములను నివారించుటకు ప్రజాబాహుళ్యము సమ్మతించును గాని, ఉన్నఆచారములను దొలగించి వెంటనే క్రొత్తవాటిని విధించరాదు. సైకిలు ట్యూబులు మార్చవలసిన మోటారు ట్యూబులను కొనబోయెదమా ? ప్రజాబాహుళ్యము సమ్మతించినదానిని ప్రత్యేకవ్యక్తులు నిరసించినను లెక్కలోనిదికాదు. ఈహక్కులవిషయమై నేను తుది నిర్ణయము గావించుటలేదని వెనుక మనవిచేసికొనియుంటిని. ప్రజాబాహుళ్యమునదా కర్తవ్యము. ఆర్థిక పరిస్థితులకు హాని వాటిల్లునను భయము తొలగినప్పుడు వీటినామోదించుట శ్రేయస్కరముగ నుండునని మాత్రమే నాసూచన.

స్త్రీలకు పిత్రార్జితమునందు—నేడు లేసందునహక్కులుండకూడదని నేను త్రోసివేయుటలేదు. పురు

షులతోబాటు వారికికూడ సంఘమునందు సమానాధికారము లుండవలెనని నేను వాంఛించుచున్నాను. అంతేగాకుండ, నాదృష్టిలో, ప్రస్తుత విషమపరిస్థితులందు పురుషులకన్న స్త్రీలకే ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వవలెను. కారణమేమనిన వారివలననే జాతి, ధర్మము, సంఘము, పునః సంస్కరింపబడుటయు, వృద్ధికి దేబడుటయు సాధ్యమగును. కాని, ఆర్థిక సమస్యలను పరిష్కరించి తదనంతరము తమ ప్రత్యేక హక్కులను సంపాదించుకొనగలరని నాసోదరీమణులకొక మనవి.

వంగరాష్ట్రమునందు మొన్నమొన్నే క్షుద్బాధాపీడితులు లక్షలాది మరణించిరను వార్తవిని, దుఃఖాక్రాంతుడై, గాంధీమహాత్ముడేమనినాడో తెలియునా? ఈదుర్భర దారిద్ర్యమును పోగొట్టి భారతీయులకందఱికి కడుపునిండ ఆహారమును గూర్చు శుభసమయము స్వరాజ్యస్థాపనానంతరమే ఉదయింపగలదు. అంతదనుక నాసోదరుల ఆక్రందన ధ్వనులను విని కడుపు తరిగిపోయినను, మిన్నకుండు మరణావస్థను పొందుటయే నాచేతిలోనిపని. కనుక సోదరీమణులారా! ప్రేమకు, సానుభూతికి, సహాయమొనర్చుటకు మీరు పురుషులకన్న వేయిరెట్లు శక్తిసంపన్నలగుదురుగదా! స్వరాజ్యస్థాపనోద్యమమునందు మీరెందుకు శక్తిలోపము లేకుండ ప్రయత్నింపకూడదు? కడుపునిండిననేగదా భోగకాంక్ష! అన్నాతురునికి భోగములేల? సౌందర్యోపాసనవేల? ప్రత్యేక హక్కుల గొడవవేల? కలిగినవారి కడుపునిండిన, లేనివారి ఆకలిమంట చల్లారునా?

ప్రత్యేక సౌకర్యములకు, ప్రత్యేకహక్కులకు, పాటుబడు
మీరు బక్కచిక్కిన ఆనిరుపేదల దైన్యమును బాపదలం
పరా ? వారి ఆస్థిపంజరములు మఱల రక్తమాంసములు
కలిగి పౌష్టవముగనుండునట్లు కృషిసలపరా ? సర్వము పరి
త్యజించి దరిద్రనారాయణసేవయందే నిరంతరము మగ్న
మైన మహాత్ముని యీ దేశము నాలించి సర్వదా త్రోడ్పడి
కృతకృత్యునిజేయ నెంచరా ? భారతమాత శుష్కవక్షు
మును మఱల క్షీరసమృద్ధ మొనరింప బూనుకొనరా ?
మీరు గృహిణులేగాక మాతృదేవతలను మాట మరువ
వలదు. సంతానరక్షణము స్త్రీలే బాగుగ నెఱిగి కావింప
గలరు. మనలనందఱిని కన్నతల్లి; అనేకవేల సంవత్సర
ములనుండి మనపూర్వులను మనలను తన చల్లని ఉదరము
నందు గాంచి పోషించిన కృపామయి; విజ్ఞానకాంతులను
నల్దెసల విరజిమ్మజాలిన తేజస్విని; ఋషిపుంగవులను,
వేదాంత నిధులను, పరమహంస పరివ్రాజకాచార్యులను,
తపశ్శాలురను, యోగపుంగవులను, భక్తాగ్రగణ్యులను,
మహాత్ములను, దేశసేవా ధురంధరులను, కడుపార కని
గర్వించిన సంతానవతిని; రత్నగర్భను; వేదభూమియని,
కర్మభూమియని ఖ్యాతిగాంచిన దేశమాతను; పెద్దముత్తై
దువను; మీరు సేవింపజాలరా ? కోటి భాస్కర తేజముతో
ఒకప్పుడు దేదీప్యమానముగ విరాజిల్లియు, నేడు మన దుర
దృష్టమువలన, మన నిరాదరణవలన, మన నిద్రమత్తువ
లన, మన అసంబద్ధ ప్రలాపఫలితమున, మన పరస్పర
విద్వేషకారణమువలన, మన కర్తవ్యతా మాంధత్వము

వలన నివురుగప్పిన నిప్పువలె, ధూళిధూసరిత దివ్యరత్న మువలె, మఱుగుపడియున్న మాతృనైరాశ్యమును బాప జాలరా ? రండు, కార్యదీక్షకు గడంగుడు. మీలోని అస మాన సామర్థ్యము నెఱిగి ప్రదర్శింపుడు. అంత ఆకు మీ దృష్టి నన్యథా కేంద్రీకరింపకుడు. శక్తిసామర్థ్యముల ను దేశసేవతోబాటు హిందూధర్మ సముద్ధరణకై కేంద్రీకరించ గలరని నాప్రార్థన. పాశ్చాత్య విద్యానాగరికతలయెడ వ్యామోహముకలిగి ప్రదర్శించువారుపట్టణములు మాత్రవే నివాసయోగ్యములని తలచుచుందురు. గ్రామములందు నివసించుటగాని, గ్రామవాసుల సహచర్యగాని వీరేవగించు కొనెదరు. కనుకనే హూణవిద్యాప్రవీణులు, పాశ్చాత్య నాగరికతానుకరణమునకు జీవితముల నంకితమొనర్చిన ధన వంతులు పెద్దపెద్దపట్టణములందు నివసించుచుందురు. ఇక సామాన్య హూణభాషా పరిచయముకలిగిన విద్యావం తులసంగతి చెప్పనక్కరలేదు. పొట్టకూటికాశించి ఉద్యో గాన్వేషణకై పట్టణముల కెగబ్రాకుచుందురు. ఇట్టివారికి గ్రామవాసుల బాగోగులతో అవసరమేముండును ? విద్యా వంతులు గ్రామమునందు నివసించుట కిష్టపడనిచో, భారత దేశమునందుగల ఏడులక్షల గ్రామములు, బాగుపడు టెట్లు ? భార్యాభర్తలు పట్టణ నివాసమే జీవిత పరమా వధిగా నెంచుకొని మెలగుచున్నంతవఱకు, దేశసేవకు మూల కందమగు గ్రామ పునరుద్ధరణ సాధ్యపడునదెట్లు ? అదృష్ట వశాత్తు, ఉత్తమాశయములుగల భర్త గ్రామ నివాసమున కువ్విళ్లూరుచున్నను, నవనాగరికతానుకరణ విద్యాప్రవీణు

రాలైన భార్య అంగీకరింపదు. భార్య పైప్రకారము నిశ్చయించుకొనిన భర్త ఉత్సాహముతో చేయూతనొసగడు. గ్రామ పునరుద్ధరణోద్యమమునకై, విద్యావంతులైన యువకులు; మాతృదేశారాధనకై, భారతస్త్రీ సౌభాగ్య సంరక్షణకై నిరంతరకృషి సలుప నిశ్చయించుకొనిన యువతులు; యావచ్ఛక్తిని వినియోగించి పాటుపడవలెనని నామనవి. ఈఉద్యమమునకై స్త్రీ పురుషులిరువురు కూడబలుకుకొని సమరసభావముతో ప్రయత్నించలేరా అని నా ప్రశ్న? దీనికి సమాధానము తీవ్రకృషియే! ఆచరణయే!!



# పదునాలుగవ మజిలీ.



ఇక స్త్రీలకు విద్య అవసరమా, కాదా? అను విషయము. విద్యయనిన నేమి? జ్ఞానమును సమకూర్చు ప్రబోధమే విద్యయని నానిశ్చితాభిప్రాయము. అవిద్యయనిన అజ్ఞానము. ఎటువంటి జ్ఞానమవసరము? భగవద్భక్తిని, ఆత్మవిశ్వాసమును, నైతికశక్తిని, కార్యదీక్షతను, సహనభావమును, విచక్షణశక్తిని, జాతిమతధర్మ గౌరవ భావమును సమకూర్చు జ్ఞానమే వాంఛనీయము. వీటిని సమకూర్చునదిగనే విద్యఉండవలెను. విద్యవలన జ్ఞాన ప్రబోధమగునని విశ్వసించినప్పుడు, విద్యోపార్జనయందు స్త్రీ పురుష వ్యత్యాసమనవసరమేకదా? అనాలోచనీయమేగదా? పురుషులు జ్ఞానసంపన్నులుగను, స్త్రీలజ్ఞానదశయందుండవలెనని ఏజాతి వాంఛించును? స్త్రీ పురుషులలో ఏయొక రజ్ఞానమునందున్నను జాత్యభివృద్ధి సక్రమముగ సాగగలదా? కనుక స్త్రీవిద్య తప్పకకావలెను. విద్యోపార్జనవలన జ్ఞానోదయముకలిగి, తద్వారా జాత్యభివృద్ధి లక్షణములు స్త్రీ పురుషులందు జనించినచో నిక కాంక్షించునదేమి?

ఐతే, ప్రస్తుత పరిస్థితులందు మనకు లభించు విద్య వలన జ్ఞానాభివృద్ధియగుచున్నదా? దానివలన పొందదగిన వైలక్షణ్యము ప్రాప్తించుచున్నదా? అనికూడ మనము

లోచింపవలసియుండును. ప్రతిజాతికి మతధర్మములను నిర్ణయించునప్పుడు, పూర్వాచార్యులు (దురదృష్టవశాత్తు ఆచార్యశబ్దమే పరిహాస్యాస్పదమైనది. ఆచార్యుడనగా జ్ఞానమార్గోపదేశకుడని తెలుగవలెను) ప్రత్యేక విద్యా విధానమును నిర్ణయించిరి. విద్యవలననేది ఆకాంక్షింపబడి నదో దానిని సాధించు ప్రయత్నముల కనుగుణ్యాముగ వారు విద్యావిధానము నేర్పఱచిరి. జాతీయ విద్యయే ప్రతివ్యక్తికి ముఖ్యము. భారతీయులకు కావలసినది పాశ్చాత్యుల విద్యావిధానముకాదు. విద్యవలన నాత్మవికాస విశ్వాస ములు సిద్ధించునుగదా! ప్రజల వృత్తులనెఱిఁగి, నాడిని పరీ క్షజేసి రుగ్మను బాపగల ఔషధమును వైద్యుడు నిర్ణ యించునట్లు, పూర్వాచార్యులు తమతమ జాతివైలక్ష్య ణ్యములను వ్యక్తపఱచుటకు వీలైన మార్గములద్వారా, వాటిని చెక్కుచెదరకుండ గాపడి తమ భావిసంతతివారు ప్రవర్తించుటకు వీలైన ఉపాయములద్వారా, జాతిమత ధర్మవిషయములందు బాల్యమునుంచి దృఢపఱుపబడు ఆత్మవిశ్వాసము క్లిష్టపరిస్థితులందు క్షీణించకుండుటకు వీలైన విధానముద్వారా, విద్యావిధాన మిట్టిదని నిర్ణయించిరి. జాతికళ్యాణము సాధ్యపడు ప్రాచీన విద్యావిధానము నను సరించి హిందువులు ప్రవర్తించినంతకాలము స్త్రీవిద్య అవ సరమా, కాదా? అను సమస్యయే కలుగలేదు. కాని కాలపురుషుని హస్తలాఘవమున భారతదేశ పరిస్థితు లార్థి కముగ, నైతికముగ, రాజకీయముగ, సాంఘికముగ తారుమారైనవి. (ఈనాలుగుమాట లెన్నపర్యాయము

లుచ్ఛరించినను నాకు విసుగు జనించుటలేదు. కారణమే మనిన, ఏవిధముగ నాలోచించినను భారతీయుల ప్రస్తుత పరిస్థితులు క్షీణదశలో నున్నవికాని ఉచ్ఛదశలోనికి వచ్చుటలేదు.) వాటినభివృద్ధిపఱచుటకు విద్యావయో వృద్ధులగు జాతీయనాయకులు ప్రయత్నించుచుండ విద్యార్థి కులవలననే సరియైన సహాయము దొఱకుటలేదు. నేటి విద్యార్థికులకు జాతీయతయనిన, జాతీయ విద్యయనిన వెగటు. ఆంగ్లవిద్యా వ్యామోహము పెచ్చుమీరుటయే వారి ఉపేక్షకు కారణము. కనుకనే ఇటీవల కాశీవిశ్వ విద్యాలయమునందు పట్టభద్రులస్నాతకోపన్యాసమునందు గాంధీమహాత్ముడిట్లు విమర్శించెను. "ప్రస్తుత విశ్వవిద్యా లయములు పాశ్చాత్య నాగరికతను స్వీకరించు అద్దుడు కాగితములవలె నుపయోగపడుచున్నవి" వ్రాసిన దానిని అద్దుడు కాగితముతో నద్దిన రెండవప్రక్కకు దిగిపోవును. నేటి విశ్వవిద్యాలయ విద్యావిధానమును అద్దుడుకాగితము తోబోల్చుట సమంజసముగనే ఉన్నది. వాటి (విశ్వవిద్యా లయముల) దృక్పథమునందు పాశ్చాత్య విద్యా సంస్కృ తులే మహత్తరమైనవిగ గోచరమగుచుండును. విశ్వ విద్యాలయములే ఈరీతిగనున్నచో, ఇకఉన్నత మాధ్యమిక పాఠశాలలందు, కళాశాలలందు గఱుపబడు విద్యావిధాన మెట్లధ్వాన్నముగనుండునో గ్రాహ్యమగును.

హిందూరాజుల పరిపాలనలో భారత విద్యావిధాన మేరీతి వన్నెచిన్నెలతో వృద్ధిగాంచినదో తెలియునా?

మచ్చునకొక నలందా విశ్వవిద్యాలయ పరిస్థితులను క్లుప్తముగా వివరించెదను. ఈ విశ్వవిద్యాలయమునందు పదివేల విద్యార్థులకు, పదిహేనువందల మందికి పైగా ఉపాధ్యాయులకు, ఉచితముగ నివాసముండుటకు, విద్యావ్యాసంగ మొనరించుటకు, వైద్యసహాయమును బొందుట. కవకాశములు కల్గింపబడినవి. ఈమహాత్కార్యమును జయప్రదముగ కొనసాగించుటకు ప్రభుత్వ విరాళముల సంఖ్యాకములుగ నుండెడివి. మత విషయములు, వేదాంత తర్క వ్యాకరణ శాస్త్రములు, సాహిత్యము, ఖగోళవైద్య శాస్త్రములు — ఇవికాక తక్కిన వివిధశాస్త్రము లీవిశ్వ విద్యాలయమునందు బోధింపబడుచుండెడివి. సుప్రసిద్ధులగు పండితులయెడను వారిపాండిత్యమునందును గల గౌరవ మును ప్రదర్శించుటకై ఎవరైన పండితోత్తముడు విచ్చేసి నచో నలందా విశ్వవిద్యాలయమునందుండిన వేయిమంది బౌద్ధమతస్థులు వారికి స్వాగతమొసగి, భక్తిశ్రద్ధలతో నుప చర్యలను సలిపి, తత్వగీతములను పాడుచును, శ్వేతచ్ఛత్ర ములను బట్టుచును జండాలతో నూరేగించుచును, వేత్రహస్తులై వెనువెంట నడచుచును గౌరవించుచుండిరి. మఱి కొంతమంది సుగంధమిళిత పరిమళ ప్రసూనముల నాపండితోత్తమునిపై జల్లుచుండిరి.

నలందా విశ్వవిద్యాలయము ప్రజాసమ్మర్దము కలిగిన పట్టణములకు చాలదూరమునందు నిర్మింపబడినది. అందులో విద్యార్థులకు, విద్యాబోధకులకు, ఉచితముగనన్ని

అవకాశములు కలిగింపబడినవి. అదియొక బస్తీవలెనే కానిపించుచుండెడిదట.

ఈ విశ్వవిద్యాలయమునందు చిత్రలేఖనము, శిల్పము చేతిపనులు, గణితశాస్త్రము, ఖగోళశాస్త్రము, వైద్యశాస్త్రము మొదలగు విద్యలెన్నియో నేర్పబడుచుండెడివి. వందలకొలదిగల విద్యాపీఠములనుండి మతము, వేదాంతము, బోధింపబడుచుండెడిది.

ఉదాహరణముగ నొక నలందా విశ్వవిద్యాలయౌన్నత్యమును మాత్రమే తెలిపితిని. ఇంకను వేరువేరు ప్రదేశములందు విశ్వవిద్యాలయము లుండెడివి. తక్షశిలయందును, ధరణికోటయందును, వారణాసియందును విశ్వవిద్యాలయము లుండెడివి. ప్రతిచోటను పైన పేర్కొనబడిన విధముననే విద్యాదాన మొసగబడెడిది.

సక్రమపద్ధతులమీద విద్యగడించినవారికి గౌరవముగ జీవితమును గడుపుకొను మార్గము తెలిసియుండుట తప్పనిసరి. ప్రతిదేశమునందు గఱపబడు విద్యవలన ఆదేశస్థులకు జీవనోపాధి లభ్యపడవలెను. కాని మనలో నెంతమంది విద్యావంతులు నిరుద్యోగులై క్షుధార్తిచే బాధపడుటలేదు? వారేమైన తెలివితక్కువవారా? ప్రస్తుతము ప్రభుత్వ కార్యాలయములలో పనిచేయువారికన్న నసమర్థులా? వీరత్యద్భుత మేధాసంపన్నులని - అటువంటివారు కూడ కలరేమో! - సర్వసాధారణముగ జెప్పుటకు వీలులేకపోయినను, గౌరవప్రదముగ, లోపరహితముగ, కృషిసల్పి తమ జీవితములను గడుపగల సమర్థులని చెప్ప వ

చ్చెను. కాని ద్రవ్యోపార్జనకు మార్గమేది? నెల సరివేతనములు లభించు ప్రభుత్వోద్యోగము లెంతమందికి లభింపగలవు? ఎంతమందిని ప్రభుత్వము పోషింపగలదు? విద్యావంతులంకరికి ఉద్యోగములు దొరకుట కష్టమే. ఇక చదువుకొనినవారి కర్తవ్యమేమి? వారు శరీరకష్టమునొనర్పజాలరు. వారికి వ్యవసాయము; వడ్రంగము, నేత – మొదలగు వృత్తివిద్యలయందు ప్రవేశములేదు. ఎంతసేపటికి ప్రభుత్వోద్యోగములను సంపాదింపవలెననే పట్టుదలతో, కాంక్షతో, వారు విద్యనేర్చుకొనిరి. కాని శరీరమువంచి కష్టపడి యేదోవిధముగ జీవనోపాధిని సంపాదించుకొనగలమనునిశ్చయముతో ప్రారంభించలేదు. బ్రిటీషు చరిత్ర వలన, భూగోళశాస్త్రపఠనమువలన, అర్థశాస్త్రపఠనము వలన, ఆంగ్లసారస్వత రాజ్యాంగవిధాన రహస్యవిజ్ఞానమలవడుటవలన, నిత్యజీవితమునందు విద్యావంతులకు లాభమేమైనగలదా? ఎంతమంది పట్టభద్రులు పరీక్షయందు విజయముగాంచిన నంతేచాలునని చదివియుండరు? పట్టభద్రుడైన యువకుడు వృత్తివిద్యల నెఱుగడు. అతనికి ఉద్యోగమే ప్రధానము. విద్యాధిక్యతనుబట్టి, బిరుదమునుబట్టి, మాసవేతనము నిర్ణయింపబడవలెనని వాదించును. కొద్ది జీతముమీద శరీర కష్టమునుజేయ నొల్లడు. ఉద్యోగ మొనరించుటయే పురుషుల ఆశయమై పోయినది. వృత్తి విద్యలనిన నేవగింపుకలిగినది. వృత్తివిద్యలను నేర్చుకొనక తరతరములనుండి వంశానుగతముగవచ్చిన చేతిపనులను నేర్చుకొనక, కళాశాలలను వదలివచ్చిన తరువాత లభించు

ననుకొనిన ఉద్యోగములు దొరకక నేటివిద్యావంతులగచా ట్లుపడుచున్నారనునది ఎవరు కాదనగలరు ? హూణభాషా భ్యసనము గావించినంతనే, తక్కిన తద్భాషా పరిచయ భాగ్యములేనివారికన్న తానెక్కువ వాడనని మాత్రము ప్రతి విద్యావంతుడు గర్వించుచుండును. ఇదియే ప్రస్తుత విద్యావిధానమువలన కలుగు విజ్ఞానము !

మన జాతీయ నాగరికతను దెలుపు గ్రంథముల న్నియు సంస్కృతభాషయందున్నవి - సంస్కృతమునకు దేవభాషయను గౌరవమొసగబడిన సంగతి ప్రతి భారతీయు డెఱుగవలసినదే. కాని భారతీయుల దౌర్భాగ్యవశమున నేడు సంస్కృతభాష 'చచ్చుభాష' (Dead Language) క్రింద పరిగణింపబడుచున్నది. వివిధ ప్రాంతములందు నివ సించుచున్న భారతీయుల మాతృభాష — వంగభాష, పంజాబీ, హిందీ, గుజరాతి, ఓఢ్రము, తెలుగు, అరవము, కన్నడము, మళయాళము, వగైరాలు - సంస్కృతము నుండియే ఉద్భవించినవనుట సర్వజన సమ్మతమైన నిర్ వాదాంశము. ఏభాష నాలోచించినను దానికి మూలః సంస్కృతభాషగానే తేలుచున్నది. కనుక భారతీయు వివిధరాష్ట్ర మాతృభాషలు సంస్కృతముతో సంబంధము కలిగియున్నందున ప్రతి భారతీయుడు సంస్కృతమును నేర్చుట ముఖ్యావసరము. పూర్వమొకప్పుడు సంస్కృ తము రాజభాషగానుండినదనినచో ఆశ్చర్యపడవలసిన అవ సరములేదు. ఇప్పటికి సంస్కృతభాషా ప్రవీణులు భారత దేశమంతటను గలరు. ఏభాషకైనను రాజపోషణఉండి

ననేగాని సర్వతోముఖముగ నుండుటకు వీలుండదు. ఒక ప్పుడు సంస్కృతభాషయందు హిందూరాజులకుగల ఆదరాభిమానములవలన నది పలువురిచేత నాకర్షింపబడినది. మతశాస్త్రములు, ధర్మశాస్త్రములు, పురాణములు, కావ్యములు, సంస్కృతభాషయందే వ్రాయబడినవి. ఏకాలము నాటివో ఇతమిత్థమని నేటికిని తేల్చుట కలవిగాని వేదములు సైతము సంస్కృతమునందేకలవు. దీనివలన సంస్కృతమెంత పురాతనమైనభాషయైనది తేలుటలేదా? కాని నేడది 'Dead Language' గా అగౌరవింపబడుచున్నది. ఈపిషాదావస్థకు భారతీయులందఱు వాపోవవలసినదే. ప్రభుత్వమువారు పాలనా సౌకర్యార్థమై భారతీయుల విద్యాప్రధానమును తారుమారుచేసిరి. వారు తయారుచేసిన విద్యాప్రణాళికయందు సంస్కృతమునకు బదులు ఇంగ్లీషునకెక్కువ ప్రాముఖ్యత ఒసగబడినది. కారణమేమనిన అది వారి మాతృభాష! భారతీయులవలె వారెన్నటికి మాతృభాషాభిమాన రహితులుకారు; కాజాలరు. ఇంగ్లీషు నేర్చిన వారికే ఉద్యోగార్హత కల్పింపబడినది. ఆర్థికముగ సర్వనాశనమునకు గురికాబడిన భారతీయులొకటి మంటకు తాళజాలక కులవృత్తులను వీడి ఉద్యోగముల కెగబ్రాకిరి; ఎగబ్రాకుచున్నారు. ధనవంతులగు భారతీయులు స్వార్థపరులైరి. ఉద్యోగము దొరకుట కేభాషాభ్యసన మవసరమో, దానినే ఉదరపోషణార్థమై నేర్చుకొనుట తప్పదుకదా! పరభాషను త్వరలో నేర్చుకొనుట సాధ్యముకానిపని. కనుక కొన్ని సంవత్సరములవఱకు కష్టపడి చదివి పరీక్షలందు

విజయముగాంచి యోగ్యతా పత్రములను సంపాదించవలసి వచ్చినది. ఈపరీక్షలలో క్రమతరగతులు — మెట్రిక్, ఎఫ్. ఏ., బి. ఏ., ఎం. ఏ — కలవు. ఆశ్చర్యమేమన, ఎంత పైతరగతి డిగ్రీసంపాదించిననంత భారతీయయువకుల మేధాశక్తి, స్వభాషాభ్యాసనము విషయమై, మొద్దుబారు చుండును. నేర్చుకొనిన భాష నభివృద్ధిపఱచుకొనుటకు మానవుడు యత్నించుట సహజ లక్షణము కనుక, ఆరంభమునుండి కష్టపడి నేర్చుకొనిన ఇంగ్లీషునే ప్రతివాడు గొప్పగ భావించుట పరిపాటైనది. ఇక సంస్కృతము నేర్చుకొను అవసరముకాని, అవకాశముకాని, అభిలాష కాని ఎక్కడనుండి కలుగగలదు ? ఇంగ్లీషువలెనే, సంస్కృతమును నేర్చుకొనుటకు కొన్నాళ్ళపాటు కృషిసలుపవలసి యుండునుగదా ? కాని ఎంతో కష్టపడి ఇంగ్లీషు నేర్చుకొనిన తరువాత, సంస్కృతభాషను నేర్చుకొనుట కెవరు శ్రమింపగలరు ? దానితో అవసరమేమి ? పొట్టకూటి చదువున కభ్యాసపడిన వ్యక్తి, జ్ఞానాభివృద్ధినాశించి యితర విద్యల నెట్లు నేర్చుకొనగలడు ? ప్రభుత్వమువారిచే మన్నింపబడక విద్యనార్జించువారిచేత నాకర్షింపబడక, సంస్కృత మెట్లభివృద్ధికి రాగలదు ? తత్కారణమున క్రమశః ముసలివాళ్లను యౌవ్వన మదముననున్నవారు చీదరించుకొని నిర్లక్ష్యమొనరించునట్లు, సంస్కృతభాష దవ్వుదవ్వులకు నెట్టబడినది. భారతీయ సంస్కృతి నెఱుగుటకు, దానికి సంబంధించిన గ్రంథములన్నియు సంస్కృతమున వ్రాయబడియున్నందున నేటి విద్యార్థులకు విద్యాధికుల కవకాశమెక్కడిది ? నేర్చు

కొనుట కవకాశము లేనప్పుడు సంస్కృతి ఎంతగొప్పదైనను దానిమహాత్మ్య మెట్లెఱుగనగును ? దీననేగదా హూణ భాషా ప్రవీణులగు భారత యువకులు భారతీయ సంస్కృతి నెఱుగకుండ, విమర్శించుటకు సాహసించుచున్నారు ! ఆహా! భారతీయు లెంత అధోగతిపాలగుచున్నారు. పుట్టిన వెంటనే వేలుగా గొంపోఁబడి, వయస్సువచ్చినతరువాత కొడుకు తోనే కన్నతల్లిని తిట్టి చినట్లున్నదీ అవస్థ. ఈదౌర్భాగ్య దశనుండి విముక్తిగాంచుటకు మనలో మనమే విశ్వప్రయ త్నములను జఱుపవలెను. మన విద్యావిధానమును జాతీయభావ సందీపితముగనుండునట్లు మార్చుకొనవలెను. సంస్కృతమును, మాతృభాషను వృద్ధికి దెచ్చుకొనవలెను. ఇంగ్లీషు చదువుకొనినవారు, దాని నెఱిగిన మిత్రులకుగాని, బంధువులకుగాని, ఇంగ్లీషులోనే ఉత్తరప్రత్యుత్తరములు జఱుపు రోగమునుండి విముక్తులగునట్లు కృషిసల్పవలెను. వ్యాకరణ దోషములు లేకుండ, తడువుకొనకుండ, అనర్గళ ముగ ఇంగ్లీషు మాట్లాడగలను; ఎన్ని పేజీలనైన వ్రాయ గలను; అను అహంకారమును వారిలోనున్నచో రూపు మాపవలెను. మన నిజ గౌరవస్థానమును పునః సంపాదిం చుకొనవలెను. శ్రద్ధగా మన సంస్కృతిని విమర్శించుట మాని, దాని నెఱుగుటకు ప్రయత్నము సలుపవలెను. నాడే మనకు ముక్తి; నాడే మన నాగరికత పెంపొందును; నాడే మనకు ప్రత్యేకత లభించును; నాడే మనతల్లి గౌర వము నిలబడును; నాడే భారతదేశము సర్వశక్తి సంపన్న ముగ శోభిల్లును; నాడే భారతజాతికి కళ్యాణము సిద్ధించును

ఈ శుభసమయమునకై ప్రతిభారతీయుడు శక్తివంచన లేకుండ ప్రయత్నించవలెను. ఇదతనికి పవిత్రకార్యము; మరువరానిదీక్ష.

మండుచున్న గాయముమీద ఉప్పుచల్లినట్లు పురుషులే నేటి విద్యావిధానమువలన నధోగతిపాలగుచున్నారని విచారించుచుండగా జాతీయనాగరికత నభివృద్ధిపఱచుటకు పట్టుకొమ్మల నదగిన భారత స్త్రీలు హూణభాషాభ్యాసనము నకర్రులుసాచి ఉఱ్ఱూతలూగుచున్నారు.

స్త్రీలకు నేటి విద్యావిధానము పనికివచ్చునా రాదా? నేటి విద్యావిధానము విషయమై పైన ముచ్చటించియుంటిని. ప్రస్తుతము విద్యాభ్యాసమనిన హైస్కూలునందు, కాలేజీలందు విద్య నేర్చుటయే! ఈవిద్య, ఉద్యోగములకై ప్రాకులాడువారికి మాత్రమే పనికివచ్చును. ఉద్యోగములు దొఱుకక అల్లాడు విద్యాధికులెందఱో పురుషులలోనే కలరు. ఇక స్త్రీలకెక్కడ ఉద్యోగములు సిద్ధముగ నున్నవి? స్త్రీలు గృహిణులైనప్పుడు ఉద్యోగములకు ప్రాకులాడనేల? స్వయంపోషణ నిమిత్తమేకదా? భర్తలు సంపాదించి కుటుంబపోషణ జరుపునప్పుడు స్త్రీలకు స్వయంపోషణతో నిమిత్తముండ నక్కఱలేదు. భర్తృవిహీనలు, ఎలాటి ఆధారములేక దుస్థితి ననుభవించుచున్నచో, స్వయంపోషణకు పాటుపడరాదా యని ప్రశ్నింపవచ్చును. ఆధారరహితలగు స్త్రీలు ఉద్యోగములు దొఱుకు యోగ్యత కలుగునంతవఱకు చదువుటకు డబ్బుసహాయ మెక్కడనుండి కలుగును? ఎవరైన ధనసహాయమునొనర్ప సిద్ధపడినచో

నెంతవఱకు సహాయ మొసగగలరు ? పూర్వమనిన గురుకులములందు చితముగ విద్యాదాన మొసగుబడుచుండెడిది. కాని ఇప్పుడా ఉదారత అడుగంటిపోయినది. ప్రతిపనికి డబ్బు కావలసియుండును. ఇతరుల ధనసహాయముతో మైత్రికు లేమనువఱకు చదువు సదుపాయముకలిగిన స్త్రీలకు, విద్య సమాప్తి కాగానే ఉద్యోగములు దొరుకునను నమ్మక మేమి ? యోగ్యతలనుబట్టి కాదు నేడు ఉద్యోగములు దొరుకుట. అవి అదృష్టాదృష్టములనుబట్టి లభించవచ్చును; లభింపకపోవచ్చును. ఎవరును, గ్యారంటి ఇవ్వజాలరు. ఇట్టి పరిస్థితులందు, ఉద్యోగముకొఱకు హూణభాషాభ్యాసన మొనర్చి, అనుకొన్న ప్రకారము ఉద్యోగములు లభింపక లేక కడుపునిండ తినుటకుచాలని స్వల్ప వేతనములు లభించిన విచారముతో కాలము గడుపుటకుబదులు, ఉదారహృదయులొనర్చు ధనసహాయముతో చేతిపనులను నేర్చి జీవితమును గడుపుట శ్రేయస్కరమేమో ? వృత్తివిద్యలే యంత్రనిర్మాణమువలన మూలబడినప్పుడు, దిక్కులేని పరిస్థితులందుకములుచున్న అనాథస్త్రీలు చేతిపనులను నేర్చి చేయగలదేమి ? చేతిపనులను నేర్చుటమాత్రము త్వరలో పూర్తి కాగలదా ? ఇక చేయునదేమి ? ప్రస్తుతవిద్యావిధానము ననుసరించి చదువుకొనిన స్వల్ప వేతనమే; చేతిపనులను నేర్చుకొనినను స్వల్పాదాయమే ! ముందుగొయ్యి, వెనుక నుయ్యి !! ఐతే ఇట్టి విషాదపరిస్థితులందు జిక్కుకొనిన అనాథలు చాలాతక్కువ. వారినెల్లు సుఖజీవితమును గడుప

చేసెదరో, సంఘసంస్కారు లాలోచింపవలసియున్నది. వారేవిధముగ బరిష్కరించెదరో చూచెదము.

స్వయంపోషణకై విద్యగడించు స్త్రీలసంఖ్య చాల తక్కువ. కేవలము వ్యామోహముతో ప్రస్తుత విద్యా విధానము నామోదించి పాఠశాలలందుజేరు యువతుల సంఖ్య, యువకుల సంఖ్యతోపోల్చిన తక్కువైనను, చెప్పుకోదగినంత ఎక్కువగానేయుండును. బి. ఏలు ఎం. ఏలు చదువకపోయినను, స్కూలుఫైనలువఱకు చదువు యువతులెందఱో కలరు. యువతులకై ప్రత్యేకకళాశాలలున్నచోటులందు తప్ప, మిగతాచోట్లలో యువతీయువకులొకేకాలేజిలో విద్యనభ్యసించుచున్నారు. ఈవిధముగ యువతీయువకులు కలిసి నేర్చు విద్యనే ఇంగ్లీషులో 'కో ఎడ్యుకేషన్' (Co-education) అని పిలిచెదరు. ఈ విద్యావిధానమువలన కలుగు మంచిచెడ్డలను, విద్యనభ్యసించు యువతీయువకులు, విద్యనుబోధించు కళాశాలాధ్యక్షులు, విశ్వవిద్యాలయాధ్యక్షోపాధ్యక్షులు విచారించవలయునే కాని నాకనవసరము.

ఉన్నతవిద్య నభ్యసించి యోగ్యతాపత్రములను సంపాదించిన యువకుల నిరుద్యోగ సమస్యాపరిష్కార విషయమటుండనిచ్చి, యువతుల దృక్పథము లేవిధముగ పరిణమించునో విచారింతము. వారి మొదటిఆశయము. యువకులవలెనే స్వాతంత్ర్యము. భావస్వాతంత్ర్యము దోషమాయనవచ్చును, కాదు. కాని పెద్దలయెడ గౌరవము, పిన్నలయెడ మన్నన, బంధుమిత్రులయెడ సుహృద్భావము, సిరిగల

వారైనచో నౌకర్లయెడ సానుభూతి — మొదలగు సద్గుణములకు తావొసంగని భావస్వాతంత్ర్యమువలన లాభమేమి? భావస్వాతంత్ర్యమనిన తమకుగల భావములను — అభిప్రాయములను, ఆశయములను, — ఆదర్శములను — నిర్భయముగ ప్రకటించుటయేగదా! భావములు మంచివైనను, మంచివికాకపోయినను, ప్రకటించి ఆచరణమందుంచు కోరికను బహిర్గతమొనర్చు స్వాతంత్ర్యమగునా భావస్వాతంత్ర్యము? ఏర్పడిన భావములు పురోభివృద్ధికి పనికిరావని సదుద్దేశముతో పెద్దవారు చెప్పినచో, వారిసలహాను పాటింపక వెక్కిరించి వేళాకోళముచేయు స్వాతంత్ర్యమగునా భావస్వాతంత్ర్యము? గ్రంథస్థమైనది మాత్రమే నేర్చుకొని పరీక్షలందు జయముగాంచి సర్టిఫికెట్లను సంపాదించినంతనే లోకానుభవ మెటనుండివచ్చును? ఎంతమంది విద్యావంతులగు యువకులు-యువతులు సైతము-లోకానుభవములేక నిత్యజీవితములందు పాట్లననుభవించుచుందురో మనమెఱుగమా? పోనీ, ఈఉన్నత విద్యనభ్యసించిన యువతులు గృహకృత్య నిర్వాహణమునందుగాని, భర్తలహృదయములను ఆకర్షించి సంసారజీవితమును సౌఖ్యదాయకముగ నొనర్చుకొను నేర్పునందుగాని, తద్విద్యాహీనలగు తక్కినసంసార స్త్రీలకన్న నెక్కువ ప్రావీణ్యతను సంపాదించగలరా? స్వకుటుంబ సంరక్షణమొనర్చుకొనలేని విద్యావతియగు స్త్రీవలన సంఘమునకుగాని, దేశమునకుగాని, జాతికిగాని కలుగు లాభమేమి? పైసంగతులను ఉన్నతవిద్యకై ప్రాకులాడిన, లేక నితరులను ప్రోత్సహించు

యువతులెన్న డైన దీర్ఘముగ నిష్పక్షపాతబుద్ధితో నాలో చించిరా? ఆలోచించిన వాటి నిజసంగతి బోధపడగలదు. నగ్నసత్యము, మనస్సునకు నొప్పికలిగించినను, పరిస్థితు లనవగాహన మొనరించుకొనుటకు ముఖ్యసాధనము.

జాత్యభిమానమును, జాతిగౌరవమును, జత్యభి వృద్ధి మార్గమును, తెలిసికొనుటకు, దేశగౌరవమునకు దేశ కళ్యాణమునకు పాటుపడుటకు, పనికివచ్చునదైనచో నేటి విద్యావిధానమునకన్న మనపూర్వకాలపు స్త్రీలశిక్షణ విధానమే వేయిరెట్లు మేలు. స్త్రీ విద్యయనినంతనే, పాఠ శాలలందుజేరి యువకులవలె ప్రస్తుత విద్యావిధానమును నేర్చుకొనుటయను దురభిప్రాయము ప్రాకిపోయినది. దానితో అట్టిభాగ్యము కలుగని తక్కిన యువతుల నిరాశ ప్రబలిపోవుచున్నది. కాని నాసోదరీమణులకొక మనవి. విద్యయనిన పుస్తకవిద్యమాత్రమేకాదు. అజ్ఞానమును పోగొట్టునది విద్య కనుక ఆవిద్య యేభాషలోనైనా, ఇంటి వద్దనైనా, నేర్చుకొనవచ్చును. సంస్కృతము, మాతృభాష, రాష్ట్రభాష, లలితకళలు, చేతిపనులు, గృహకృత్య నిర్వ హణ విధానము, మొదలగునవి నేర్చుకొనిన యువతిని కూడ విద్యావతియని పిలిచి గౌరవించెదరు. విద్యకు యోగ్యతాపత్రములు తార్కాణము కాజాలవు. యోగ్య తాపత్రమువలన లోకానుభవము లభింపదు; జీవితోద్దేశము నెరవేరదు. కనుక ప్రస్తుత విద్యావ్యామోహమునకు దోసిలొగ్గుట వాంఛనీయముకాదు. శ్రేయస్కర మంత కన్నను కాదు.

గృహిణులు పాశ్చాత్య యువతులవలె, తమ పురుషుల సంపాదనతోనే జీవితములు గడుపుట వీలుకాకుండనున్నదను తలంపుతో ఉద్యోగములు చేయకూడదా? అనుచు ప్రశ్నింపవచ్చును. కాని ఆలాటి సదుద్దేశములు నెఱవేఱుటకూడ ప్రస్తుత నిస్సారమగు విద్యావిధానము సాగుచున్నంతవఱకు వీలుండదని చెప్పవచ్చును. కారణమేమనిన భారతదేశము పరాధీనస్థితియందు మ్రగ్గుచున్నది. స్వాతంత్ర్యమనుభవించు శుభసమయమింకను భారతీయులు నోచుకొనలేదు. యూరపుదేశమునందన్ని రాజ్యములు స్వతంత్రపరిపాలన మొనర్చుకొనుచున్నవి. కాకపోతే, ప్రస్తుత ప్రపంచ మహాసంగ్రామమునందు దురాక్రమణపాలయినను, మిత్రమండలి వారిచేత నవి పునః స్వాతంత్ర్యమును సంపాదించనున్నవి – స్వతంత్ర రాజ్యములగుటచేనచటి ప్రజలు – స్త్రీ పురుషులు – తమ మాతృభాషనే రాజభాషగా ఏర్పఱచుకొని ప్రభుత్వమును నడుపుకొనుచున్నారు. మాతృభాష రాజభాష అయినప్పుడు, విదేశీయులభాష నేర్చుకొనిననేగాని ఉద్యోగములు లభింపవను భయముండదు. పుట్టుకతోడనే వచ్చు మాతృభాష నభివృద్ధిజేసికొనుట ఏమంతకష్టమైనపనికాదు. కనుకనే పాశ్చాత్య యువతులు – పురుషులతోపాటు – ఉద్యోగములను సలుపుటకు వీలున్నది. మనదేశమునందు ప్రజల మాతృభాషయే రాజభాషగా పరిగణింపబడలేదు. ప్రజాప్రభుత్వములేనప్పుడు – లేక భారతీయులెవరైనను రాజ్యపాలనచేయనప్పుడు – విదేశీయుల పాలనకు లోబడవలసి

వచ్చినప్పుడు, పాలకులభాషయే రాజభాషగా నిర్ణయింప బడినప్పుడు, యువతీయువకులు మాతృభాష నేర్చినంతనే ఉద్యోగార్హులు కాజాలనప్పుడు, ఇంగ్లీషునే నేర్చుకొనినను ఉద్యోగములు దొరుకక విద్యాధికులగు పురుషులు మనోవ్యధనందుచున్నప్పుడు, భారత స్త్రీలకిక ఉద్యోగములెట్లు దొరుకును ? పాశ్చాత్య యువతులవలె మన స్త్రీలుకూడ ఉద్యోగములుచేసి పురుషుల సంపాదన నభివృద్ధిపఱచుటకు వీలుకలుగుటెట్లు ? జాతీయ ప్రభుత్వ స్థాపనానంతరము, ప్రజల మాతృభాషయే రాజభాషగా పరిగణింపబడి దానిని నేర్చుకొని జ్ఞానము సంపాదించినవారికి ఉద్యోగార్హత కలిగింపబడినప్పుడు, అప్పటికిగూడ పురుషుల సంపాదన నేడున్నట్లు పసిపిల్లవాని ఆముదము ఖర్చునకు చాలని దుస్థితి చెక్కుచెదరకుండనుండిన పక్షమున, నాసోదరీమణులు ఉద్యోగములు చేయవచ్చును. అందులకే ఆక్షేపణము కలుగదు. అంతవఱకు ముండ్లకంచెమీద వేయబడిన బట్టను చినుగకుండ జాగ్రత్తతో తీసికొనునట్లు స్త్రీ పురుషులిరువురు మెలగుట శ్రేయస్కరమని నామనవి. ఇంకను స్త్రీ విద్య — ప్రస్తుత విద్యావిధానము ననుసరించినది — కావలెనని పట్టుపట్టిన వ్యక్తులకు సాధక బాధకములు గ్రహించు సమయము రాగలదు. వారేదానికి ఉత్తరవాదులగుదురు. కాన ఈవిషయము నింతతో ముగింతును.

విద్యవలన జ్ఞానమభివృద్ధియగునని పైన తెలిపింటిని. మానవుడు విజ్ఞానవంతుడైనప్పుడు, స్వదేశారాధ

జాతీయ సంస్కృతి, నెఱిగి సక్రమముగ జీవిత విధానమును గడుపుట వాంఛనీయము; ముఖ్యధర్మము. భారతీయుల ప్రాచీన సంస్కృతిపై మనలో మహామహులెందఱో ఉత్తమ గ్రంథములను రచించినారు. వాటిని కూలంకష ముగ చదువవలసినదని నా సోదర సోదరీమణులకు మనవి — కనుక ప్రత్యేకముగ నిట గ్రంథవిస్తర భీతిచే ఆవిషయమును వ్రాయదలచుట లేదు.



సోదరీ! ఇంతవఱకు హిందూసంఘమునకు సంబంధించిన సార్వజనీనక విషయముల నెఱిగించితిని. ఈమజిలీలో నీకు ప్రత్యేకముగ కొన్నివిషయములను సంసార ధర్మ నిర్వహణమునకు సంబంధించినంతవఱకు తెలిపెదను.

నేడు మన దేశంలో అసభ్యమైన అనేక శృంగార గ్రంథములు ప్రచురింపబడుచున్నవి. దానివలన లాభమేమనిన వాఙ్మయములో దుర్నీతిని ప్రోత్సహిస్తూ ఎంతో ప్రచారము జరుగుటయే. వివాహ నియమాలలో, స్త్రీ పురుష సంబంధములో కట్టుబాట్లు సడలిపోతున్నవి. స్త్రీలకు తమ పాతివ్రత్య ధర్మమువిూద, సత్ప్రవర్తనవిూద భక్తి గౌరవములు తగ్గుచున్నవి. ప్రజలకు పూర్వసంప్రాయము లనిన, కుటుంబ మర్యాదలనిన, నీతినియమములననిన, క్రమవర్తనయనిన, భయభక్తులు గౌరవవిశ్వాసములు నశించి నాస్తికమతము పొట్టకూటి వేదాంతము దుర్నీతి ప్రబోధము ప్రబలంగా వ్యాప్తిలోనున్నవి.

పాశ్చాత్య దేశాలలోవలె మన దేశమునందుకూడ స్వేచ్ఛాప్రేమ, స్వేచ్ఛావిహారము, స్వేచ్ఛాప్రవర్తన కానుపులు రాకుండా చేసికొనడము, వచ్చినకాన్పులు పోగొట్టుకొనడము, మొదలైన విషయములను గుఱించి అనేక "శాస్త్రీయమైన" గ్రంథములు, కథలు, కావ్యములు విరివిగా ప్రచారమవుతున్నవి—ఆకారణముచే, మన స్త్రీలకు కూడ తమ మాతృధర్మమువిూద, సత్ప్రవర్తనవిూద విలువ తగ్గుచున్నది. బిడ్డలను కనుట అవమానకరమైనది. బిడ్డలు తమతల్లులవద్ద పెరగడము, తల్లులుస్తన్యమిచ్చితమ

బిడ్డలను పెంచుకోవడము, అనాగరికతకు, మోటుతనము
నకు చిహ్నములను అపోహకలిగినది. తల్లులు విద్యావ
తులై ఉద్యోగములను, ఉపన్యాస సభలను జరుపవలెను,
బిడ్డలను పోతపాలతోడాదులు పెంచవలెను! విద్యావతులు,
స్వాతంత్ర్య ప్రియులు, కాగోరుచున్న నేటి స్త్రీలనాగరికతకు
మూలకారణము లీవిధముగ నున్నవి.

ఈవిధంగా ధారీ, తెన్నూ, లేకుండా అగమ్యగోచ
రంగా ఉన్నది నేటి నవీననాగరికుల ప్రవర్తన. ఒకకార్య
క్రమముగాని, సంఘాభివృద్ధికై సంబంధించిన సామాన్య
లక్ష్యముకాని, ఉన్నతాదర్శములుకాని, లేకుండా వ్యక్తి
స్వాతంత్ర్యము పేర యథేచ్ఛగా విచ్చలవిడిగా, స్వార్థపరులై
సంచరించినమాత్రముననే నాగరికత స్పష్టమగునా? ఇది
ఎక్కడినాగరికతయో తెలియుటలేదు.

కాని వాస్తవ మాలోచించిన, స్త్రీ ముఖ్యధర్మము
బిడ్డలనుకని, పెంచి, వారికి జాతీయాదర్శాలతో విద్యాబుద్ధు
లను నేర్పడమే. స్త్రీ ముఖ్యముగ మాతృదేవత. మాతృ
దేవతాస్వరూపమైన స్త్రీధర్మము, భూధర్మముతో తుల్య
మైనది. ప్రజానీకమునకు కావలసిన ఆహారము నెట్లు భూమి
సమకూర్చుచున్నదో, అట్లులనే జాతినికని, పెంచి, వృద్ధి
జేయవలసినవారు స్త్రీలు. దేశముయొక్క ఔన్నత్య మీ
రెండింటిసారముమీద నాధారపడియుండుట సహజము.

భూదేవత, గోమాత, స్త్రీమూర్తి, జాతియొక్క
ఐశ్వర్యానికి, పాడిపంటలసమృద్ధికి, సంతానాభివృద్ధికి, కుదు
ళ్లంతివార్లు, జనసామాన్యాన్ని బాల్యమునుండియు, సక్రమ

మైన పద్ధతులమీద తర్ఫీదు చేయవలసినవారు స్త్రీలు. కాబట్టి స్త్రీలను చిన్నప్పటినుండియు పవిత్రాశయముల నెఱిగి స్వధర్మమును నెరవేర్చుకొను సమర్థులుగ జేయ వలెను. తదాశయసిద్ధికై, భారతబాలికలు చిన్నప్పటి నుంచి, తమ ఆటపాటలలోనై తమ మాతృధర్మమును గ్రహించవలెను. దానికి కావలసిన వాతావరణము సంఘ పరిస్థితులందు కలిగించవలెను. బిడ్డలనుకని, పెంచి, వారికి తగినశిక్షణ నొసగు స్త్రీలుకూడ జీవితసంగ్రామరంగ యోధాగ్రసరలే కదా!

పూర్వము భారత స్త్రీ తనగృహమనే రాజ్యములో నిశ్చింతతో రాజ్యమేలుచు, భర్తయొక్క శక్తిసామర్థ్యము లను, తెలివితేటలను చూచి సంతోషించుచు, ధైర్యసై ర్యాలతో, ఆత్మత్యాగముతో, జాగ్రత్తతో, చురుకుగా తనభర్తకు సహాయము చేయుచుండెడిది. కాని పురుషునితో సమానమైన హక్కులకొఱకు నిరర్థకమైన కలహములకుదిగి ఆదుర్దాపడలేదు. ఆమెదృష్టిలో కుటుంబమే విశాలప్రపంచ మునకు పునాది. భర్తలు వారిని హృదయపూర్వకముగ గౌరవించెడివారు. అయితే ఆమె విద్యావిహీనురాలై, తెలివితేటలు ప్రపంచజ్ఞానము లేకుండ, కేవలము బిడ్డలను కనిపెంచే యంత్రమువలె ఇంట్లో పడిఉండవలెనని వారి ఉద్దేశము కాదు. ఆమె తనభర్తయొక్క కష్టసుఖాలలో, జీవితసంగ్రామములో, అతనికి తోడునీడగా నిలిచి, అతని జీవితమును పరిపూర్ణవంతముగ చేయ సమర్థురాలై యుండవలె

నని యే వారిఉద్దేశము— అదేకాదు. జాతియొక్క అవసర
మునుబట్టి స్త్రీమూర్తి తనసౌఖ్యమునైనను త్యజించుటకు;
దైహికముగను, మానసికముగను తనవారి జీవితములను
మనోహరవంతముగ చేయుటకు; జాతిని ఆవరించి యుండి
దానిని క్రిందికి దిగలాగు ముష్కరపరిస్థితులను. లోటు
పాటులను గుర్తెరిగి తనవిధ్యుక్తధర్మములను సంతోష
పూర్వకముగ నెరవేర్చుటకు; రాజకీయ పరిజ్ఞానమును
సంపాదించి, జాతియొక్క రాజకీయదృక్పథముతో ఏకీ
భవించి, జనసామాన్యమున కంతరంగనిక్షేపనిధియై త్యాగ
మునొనర్చుటకు; సిద్ధముగనుండవలెనని వారి ఉద్దేశము.
వారిదృష్టిలో స్త్రీధర్మము చాల ఉత్కృష్టమైనదియు,
యోధాగ్రేసరునివీరపురుషుని ధర్మముతో తుల్యమైనది
యుగ, తోచినది. కనుకనే సంఘనిర్మాణమునందు స్త్రీలకు
ప్రత్యేకగౌరవస్థాన మొసగబడినది.

పైనజెప్పినప్రకారము స్త్రీవ్యక్తి ఎన్నోవిధముల
జాతికి, దేశమునకు లాభముచేకూర్చు పట్టుగొమ్మగ నుండు
టకు బదులు, నేడు అబలగా పరిగణింపబడుచున్నది. దీనికి
కారణము బహుశా స్త్రీలకు స్వార్థపరులగు సంఘయజమా
నుల క్రౌర్యము, దౌర్జన్యమువలన కలుగుచున్న రాపిడి
యేమో! వారిలో ఆశాజ్యోతి చల్లారుచున్నదనుటకు నా
కలమాడుటలేదు. నేనామాటను వినదలచుకోలేదు వీర
మాతలను కనిన భారతమాత భీరురాలెన్నటికిని కాజాలదని
మాత్రము మనమెఱుగవలెను. సంఘమునందు వారికి
కల్గుచున్న రాపిడిమూలమున స్త్రీలు తాము శక్తిహీ-

నలమనియు, అబలలమనియు ఒకవేళ తలచినను, వారికి
ఉత్సాహమును గలిగించుట జాతికళ్యాణమును వాంఛించి
పాటుపడవలసిన యువకవిద్యార్థినుల ప్రధానకర్తవ్యమని
నానిశ్చయము. పగలుమారి ఏడ్పులవలె నసహ్యముగ
దోచు కామవాంఛాప్రకోపిత ప్రణయసంభాషణ కలవాటు
పడిన కొందఱు యువకులు స్త్రీలను అబలలుగ, పనికిరాని
వారుగ తమకథలందు చిత్రించుచుండుట శోచనీయమే
కాకుండ మహాపరాధముకూడ. అసమానప్రతిభావంతులను,
అజేయులను దేశరక్షణకై భారతజాతి కర్పింపవలసిన
భారమును వహించుటకు స్త్రీల నుద్బోధించవలెను. వారికి
తమలోనున్న సహజధీశక్తులను విశదపరచవలెను. అంతే
కాని, ఉద్రేకపూరితములగు కథలలో, అనేకబాధలననుభ
వించి విసిగి వేసారిన యువతిపాత్రనొకటి కల్పించి దానిచే
స్త్రీజన్మను దరిద్రజన్మగాను, అభాగిని అయిన జన్మగాను,
అనుమానాస్పదమైన జన్మగాను, అయోమయప్రపంచంలో
కూలిపోయిన జన్మగాను, వర్ణింపజేయుట మహాద్రోహము.
నైరాశ్యమును జెందవలసిన పరిస్థితులందు స్థైర్యము, భగవ
త్ప్రసాదితధీశక్తిని ఉపయోగించి ధైర్యమును ప్రకటించుట
ముఖ్యావసరము. వెనుక సూచించిన ప్రకారము ప్రస్తు
తము భారతజాతిని అనుభవించుచున్న అనుకరణావ్యామో
హదశనుండి పైకి లేవనెత్తి పునఃజాతిగౌరవబీజముల నాటి,
బ్రోదిచేయొనర్చి, యశశ్చంద్రికలను వెలయింపగల భారము
స్త్రీలపైన గలదు. ఆ పవిత్రకార్యమును వారొనరించుటకు
సిద్ధముగ నుండవలెను. ఇట్టిపరిస్థితులలో స్త్రీవ్యక్తిని కొఱ

మాలినదిగ సృష్టించి కథలనువ్రాయుట మానవలసినదిగా
నాసోదర యువక కథకబృందమునకు మనవి. స్త్రీ ఎట్టిపరి
స్థితులందైనను సబలయేగాని అబలకాదు అని మనమెంత
త్వరలో నెఱుగగలమో అంతమంచిది. రాచకీయాందోళన
లేనిసమయములందు మనపూర్వకవులు శృంగారరసపోషణ
సందర్భములలో స్త్రీవ్యక్తిని అబలగా సూచించినంతమాత్ర
మున, ప్రస్తుత మనపరిస్థితులందదే ప్రకారము తలచుట
బుద్ధితక్కువ. మనకు కావలసినది నరకాసురుని వధించిన
ధీరవనిత సత్యభామ ననుకరించు స్త్రీబృందముకాని, వరూ
ధినివలె వెట్టిపోకడలుపోవు విలాసవతులు కాదు. ఈ తార
తమ్యమును గ్రహించవలెనని నాసోదరీమణులను ప్రార్థించు
చున్నాను.

పూర్వులు స్త్రీధర్మము నెట్లుద్దేశించినది, తద్వ్యతి
రేకముగ, నేడెట్లది తారుమారైనది పైన వివరించితిని.
యోగ్యశీలా! ఈరెండింటిని నిష్పక్షపాతదృష్టితో నాలో
చించిన మన పూర్వులు నిర్ణయించిన స్త్రీధర్మనియమములే
క్షేమంకరములని నీకు తోచగలదు. ఆలోచించుకొని మెలగ
వలసినదని నాసలహా.

ఇప్పటికే మనము చాలదూరము ప్రయాణ మొన
రించితిమి- ప్రపంచవాతావరణము ననుసరించి జీవితసము
ద్రమునందు తుపాను చెలరేగినను, మజిలీలద్వారా గమ్య
స్థానమును నిరపాయముగ జేరుకొనుమార్గము నింతవఱకు
తెలుప బ్రయత్నించితిని. మార్గమును సూచించుసందర్భ
మున, బహుశా చెప్పినదే మరొకసారి వేరుప్రదేశములందు,

చెప్పదలచినది నీహృదయమునకు నాటవలెనను సదభిప్రాయ ముచే, చెప్పియుందునేమో! ఐనను దానిని నీవు చర్వితచర ణమని వదలిపెట్టవద్దు. మంచిసంగతుల నెన్నిసార్లు బోధిం చినను, ఆక్షేపణచేయ వీలులేదు. తెలియనిపాఠమును ఉపా ధ్యాయుఁడు మరలమరల బోధించడా? అదే సమరసభావ మున గ్రహించుమని నాకోరిక. దానినెఱిగి సక్రమముగ ప్రయాణమొనరించినచో ఎంతటి ప్రబలమైన తుపానునైనను లెక్కించక గమ్యస్థానమును సురక్షితముగ జేరుకొనగలవు. ఇక సంసారసముద్రము, జీవితసముద్రమునకొక శాఖయే గదా? దానిని దాటుట సులభమే! నేను నిర్మించి, నిన్నుకూర్చుండబెట్టి, చుక్కానిత్రిప్పుచూ, మజిలీల ద్వారా, ఒడ్డునకు చేర్పగలిగిన నావను నీస్వాధీనపఱచుచున్నాను. నాప్రక్కన గూర్చొని చుక్కాని త్రిప్పువిధానమును గ్రహింపగలిగితివి కాన దానిని నీవు కష్టములేకుండ త్రిప్పుచూ గమ్యస్థానమునకు నావను చేర్పగలవు. నీతోబాటు మఱికొందఱు సోదరీమణులను నావయందు తీసికొనిపొమ్ము. వారికి వలయు సహాకార్యము నొసగి, గమ్యస్థానమును సురక్షితముగ జేరగల సలహా నిచ్చుచుండుము. పనియందు కలిసిననే గదా ఏపనిచేసినను సంతోషము కలుగుట!

ఇఁక నాకు సెలవు. అవసరము వచ్చినప్పుడు నా సహాయ మపేక్షించుటకు వీలుకలదు కావున భయమువలదు. నేనందులకు సర్వసిద్ధుడను. కానిమ్మ! తోడి సోదరీమణులతో ప్రయాణమునకు సాగుము. మీ అందఱిని భగవానుడు రక్షించి శుభములను చేకూర్చుగాక! హిందూమతము,

హిందూధర్మము, హిందూసంఘము, హిందూస్త్రీ, హిందూయువకబృందము, శాశ్వతముగ వర్ధిల్లుగాక !! భారతమాత కోటిసూర్యప్రభలతో వెలుగొందుగాక !!! దేశకళ్యాణము, జాత్యభివృద్ధి ప్రాప్తించుగాక !!! సెలవు.



